# భారతి వచన రచనలు

సంకలనం :

పెరియసామి తూరన్

అనువాదం :

చల్లా రాధాకృష్ణశర్మ



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, న్యూఢిల్లీ

1979 (1901)



*Original title* : BHARATHI THAMIZH (TAMIL)
*Telugu title*: BHARATHI VACHANA RACHANALU

రూ. 8 - 00

PUBLISHED BY THE DIRECTOR, NATIONAL BOOK TRUST, INDIA, A-5, GREEN PARK, NEW DELHI-110016 AND PRINTED AT STREE SEVA MANDIR PRESS, 32, BAZULLAH ROAD, MADRAS-600 017.

## తొలిపలుకు

### తమిళ వచన రచనా పరిణామం

భాష ఏర్పడిన తొలిరోజులలో వచనమే వాడుకలో ఉండి వుండాలి. కాని ముద్రాక్షరాలు వెలుగులోకి రాకమునుపు, ప్రజలు చెప్పిన కథలనూ అనుభవాలనూ వారు చెప్పినట్లుగానే వచనంలో వ్రాయడానికి తగిన వసతి ఉండేది కాదు. తాటాకుల మీద గంటంతో వ్రాసే అలవాటు ఏర్పడిన రోజులలో కూడా, కవితలవలె, వచనం వ్రాయడం సులభమైన పని కాదు. భావగాంభీర్యం కల కవితలు వ్రాయడం, వాటిని వల్లె వేయడం - వచనంతో పోల్చి చూసినప్పుడు - సులభమనే తోచి వుండాలి. అందువల్లనే తొలుత కవితకు స్థిరత్వం లభించింది. అతిప్రాచీన కాలంలోనే భాష బాగా అభివృద్ధి చెంది, లక్షణ శాస్త్రం కూడా రూపొందించుకున్న తమిళ భాషకూ ఇది వర్తిస్తుంది.

ఎనిమిదవ శతాబ్దిలో సంతరించబడిన ఇఱైయనార్ కళవియల్ వ్యాఖ్యానమే మనకు లభ్యమైన ప్రాచీన తమిళ వచన రచనకు తొలి మచ్చుతునక అనవచ్చు. ఒకటి రెండు శతాబ్దులకు తర్వాత, తొల్కాప్పియమునకూ పత్తుప్పాట్టునకూ వ్యాఖ్యానాలు వెలయించాలని పలువురు ముందుకి వచ్చారు.

ఇళం పూరణర్, పేరాసిరియర్, నచ్చినార్ కినియర్, పరిమేలళగర్, సేనావరైయర్, అడియార్కునల్లార్ వంటి పండితులు పలువురు ప్రశస్తములైన గ్రంథములకు వ్యాఖ్యలు వెలయించారు. వీరంతా 12 - 16 శతాబ్దుల మధ్యకాలంలో జీవించారు.

ఈ వ్యాఖ్యాతల వ్యాఖ్యానం వారు వ్రాసినట్లుగానే మనకు లభించినట్లు చెప్పలేము. తాము విన్నవాటిని ఆ తర్వాత కొందరు తాళపత్రాల మీద వ్రాసినట్లు భావించడమే సమంజసం.

విపులమైన వ్యాఖ్యానం సంతరించలేని పరిస్థితిలో, ఈ వ్యాఖ్యాతలు కవిత వంటిదే భావ గాంభీర్యం కల ఒక వచన రచనా రీతిని అనుసరించారు.

అడియార్కునల్లార్ సిలప్పదికార కావ్యానికి తాను వ్రాసిన వ్యాఖ్యానంలో, దశకంలోని మొదటి రెండు పాదాలకు విపులంగా వ్యాఖ్య వ్రాసి, అలా విపులంగా వ్రాయడానికి వీలు కానందువల్ల, కడమ భాగానికి సంగ్రహం గానే వ్రాయనున్నట్లు పేర్కొన్న విషయం ఇక్కడ గమనించ దగింది.

సిలప్పదికారంలో పద్యాలకు మధ్య వచనం చోటు చేసుకున్నది. సంగ కాలపు కవులలో ఒకరైన భారతం వ్రాసిన పెరుందేవనార్ ఎక్కువగా వెణ్బా ఛందస్సునీ అక్కడక్కడా అగవ్బా ఛందస్సునీ ఉపయోగించి నప్పటికీ, కావ్యంలో మధ్య మధ్య వచనం కూడా ఉపయోగించారు. అయితే, యీ వచన భాగాలను తమిళ వచనమునకు మచ్చుతునకలని చెప్పడం భావ్యం కాదు. ఆ రోజులలో రూపొందిన వచనం ఏవిధంగా మనకు లభ్య మయిందో తెలుసుకోవడానికి ఈ వచన భాగాలు తోడ్పడ తాయని చెప్పవచ్చు.

మధ్యకాలంలో జైన పండితులు కొందరు సంస్కృత సమ్మిశ్రితమైన మణిప్రవాళశైలిలో వ్రాశారని శ్రీపురాణం, సత్యచింతామణి మొదలైన గ్రంథాలవల్ల తెలియవస్తున్నది. వైష్ణవ వ్యాఖ్యాతలు కూడా నాలాయిర దివ్య ప్రబంధమునకు మణిప్రవాళ శైలిలోనే విపులమైన వ్యాఖ్యానం వెలయించారు. శైవ పండితులు కూడా శైవ సిద్ధాంత గ్రంథాలకు వ్యాఖ్యా నాలు సంతరించారు. కాని యివన్నీ తమిళ వచన రచనా పరిణామమునకు నిదర్శన మని మాత్రం చెప్పలేము. అచ్చుయంత్రం రూపొంది, అది మన దేశంలో వాడుకలోకి వచ్చినప్పటినుంచే వచన రచన అభివృద్ధి చెందినట్లు పేర్కొనవచ్చు. ఆ తర్వాతనే కేవలం వచన రచనలు ప్రచారంలోకి రాగలిగాయి. క్రైస్తవ మతవ్యాపనోద్దేశంతో తన్మత గ్రంథం తమిళ వచనంలోకి అనువదించబడింది.

12 - 16 శతాబ్దుల మధ్య కాలంలో శిలాశాసనముల ద్వారా తమిళ వచన రచన ఒక విధంగా అభివృద్ధి చెందింది. అయినప్పటికీ ఆ శాసనాలు చెక్కినవారు బాగా తమిళ భాషాభిజ్ఞులు కాకపోవడం వల్ల, శాసనాలలోని భాష సాధారణంగా దోష భూయిష్ఠంగానే కనిపిస్తుంది. కనుక శాసన భాషను వచన రచనా పరిణామమునకు కొలబద్దగా గ్రహించలేము.

బెస్చి అనే ఇటలీ దేశపు ఫాదిరీ పద్దెనిమిదవ శతాబ్ది ప్రారంభంలో తమిళనాడుకి వచ్చాడు. తమిళం బాగా నేర్చుకున్నాడు. వీరమామునివర్

అని పేరు పెట్టుకున్నాడు. తమిళంలో కావ్యాలు వ్రాయడమే కాక, అవివేక పూర్ణగురుకదై (థ), వేదియర్ ఒళుక్కం మొదలైన వచన రచనలు కూడా చేశారు. ఆయనకి పూర్వమే పదిహేడవ శతాబ్ది మధ్యలో మనదేశానికి వచ్చి, నివసించి, మరణించిన తత్త్వబోధకస్వామి అనే క్రైస్తవుడు సంస్కృత శబ్ద భూయిష్ఠమైన శైలిలో కొన్ని వచన రచనలు వెలయించారు. వీరమామునివర్ వ్రాసిన అవివేక పూర్ణగురుకదై హాస్యరస ప్రధానమైన రచన. ఆయన వ్రాసిన వచన రచనలు సులభమైన శైలిలో ఉండడంవల్ల, వాటిని చాలామంది పుక్కువకొద్దీ చదివారు. ఆయనకి తర్వాత వచ్చిన శివజ్ఞానమునివర్ అనే వచన రచయిత శివజ్ఞాన బోధమును వివరిస్తూ ద్రావిడ మగా పాడియం (మహాభాష్యం) అనే గ్రంథం వ్రాశారు. ఇది భావగంభీరమైన రచన.

19 వ శతాబ్ది ప్రారంభంలో తాండవరాయ ముదలియార్ తమిళ వచన రచనల్లో ఒక కొత్తపుంత ప్రవేశపెట్టారు. ఆయన వ్రాసిన పంచతంత్రక్కదై ఆనాటి తమిళ వచన రచనకు మార్గదర్శక మయింది. ఆయన శైలి సాఫీగా సాగుతుంది; అస్పష్టత ఉండదు. కథామంజరి అనే మరొక వచన గ్రంథం కూడా ఆయన వ్రాశారు.

ఆ తరువాతి వచన రచయితలలో ప్రత్యేకత గడించుకున్నవారు యాళ్‌ప్పాణమునకు (శ్రీలంక) చెందిన ఆఱుముగ నావలర్ (జననం: 1823). పెరియపురాణ వచనం; తిరువిళైయాడల్ పురాణ వచనం మొదలైన పెక్కు వచన రచనలు ఆయన వెలయించారు. విద్యార్థులకు గాను పాఠ్యపుస్తకాలు కూడా వ్రాశారు. సుస్పష్టమైన శైలికి ఆయనే మొదట దారి వేశారు. తిరువరుట్ ప్రకాశవళ్లలార్ అనబడే రామలింగస్వామి మనుమురై కణ్ణ వాచకం, జీవకారుణ్యం మొదలైన వచన రచనలు సంతరించారు. ఆ తర్వాత పేర్కొనదగినవారు వీరాసామి చెట్టియార్. ఆయన వినోద రసమంజరి అనే వచన రచన చేశారు.

మాయూరం వేదనాయకం పిళ్లై ప్రతాపముదలియార్ చరిత్తిరం (1876) అనే హాస్యరస ప్రధానమైన పుస్తకం వ్రాశారు. ఇదే తమిళంలో వెలిసిన తొలి నవల. సుగుణసుందరి (1887) అనే మరోపుస్తకం కూడా ఆయన వ్రాశారు. వేదనాయకం పిళ్లై వచన రచన ముఖాముఖి మాట్లాడు కున్నట్లుగా ఉంటుంది.

రాజం అయ్యర్ (1872 — 1898) కమలాంబాళ్ చరిత్తిరం అనే ప్రశస్తమైన నవల వ్రాశారు. ఆయన్ని అనుసరించి, మాధవయ్య పద్మావతి చరిత్తిరం (1898) అనే నవలతో పాటు మరి రెండు నవలలూ, కుసికర్ కుట్టిక్కదైగళ్ (చిన్నకథలు) అనే పెక్కు కథానికలూ ఎంతో చక్కగా వ్రాశారు.

మధురపద గుంఫితమైన శైలిలో దామోదరం పిళ్లై చూళామణి వచనం అనే పుస్తకం రచించారు. సూర్యనారాయణశాస్త్రి కూడా మదివాణన్‌కదై అనే పుస్తకాన్ని చక్కని శైలిలో వ్రాశారు. ఆయన నాటకాలూ, యితర రచనలూ కూడా వెలయించారు.

ఇల్లాణ్‌మై, తమిళ్ నావలర్ చరితై అనే పుస్తకాలు రచించిన తిరు. కనకసుందరం పిళ్లై యాళ్‌ప్పాణమునకు చెందినవారు.

20 వ శతాబ్ది ప్రారంభమైన తర్వాతనే తమిళంలో వివిధశాఖలకు చెందిన వచనరచనలు ఎన్నో వెలుగు చూడసాగినవి. మఱైమలైయడిగళ్ మనోహరమూ, విలక్షణమూ అయిన శైలిలో వచన రచన కావించారు. తిరు. వి. కళ్యాణసుందర ముదలియార్ చక్కని తమిళ వచన శైలిని తమ ప్రసంగాలలోనూ రచనలలోనూ ప్రవేశపెట్టి, తమిళ వచనమునకు కొత్త మెరుగులు దిద్దారు. ఆయన ఎన్నో వచన గ్రంథాలూ వ్యాస సంపుటాలూ వెలువరించారు. ఆయన నిర్వహిస్తూ వచ్చిన "నవశక్తి" అనే వారపత్రిక కూడా తమిళ వచన రచనా పరిణామమునకు బహుథా తోడ్పడిందని చెప్పవచ్చు.

పండితమణి కదిరేశ చెట్టియార్, నావలర్ సోమసుందర భారతియార్, వెంకటసామి నాట్టార్ ప్రభృతులు వచనరచనలు వెలయించారు. కాని 'తమిళ తాత' అని వ్యవహరించబడుతున్న డాక్టర్ ఉ. వే. సామినాథయ్యరు, మీనాక్షిసుందరం పిళ్లై చరిత్తిరం, ఎన్ చరిత్తిరం (ఆత్మకథ), నాన్ కణ్డదుం కేట్టదుం (నేను కన్నవీ విన్నవీ) మొదలైన పెక్కు వచన రచనలు సులభ సుందరమైన శైలిలో సంతరించారు. ఈ సులభశైలిని అనుసరించి చాలా మంది తమిళ పండితులు గ్రంథరచన చేశారు. కా. సుబ్రహ్మణ్య పిళ్లై తమిళ సాహిత్య చరిత్ర వ్రాశారు. డాక్టరు రా. పి. సేతుపిళ్లైది మనోహర మైన శైలి.

బహు భాషా పండితులైన తె. పొ. మీనాక్షిసుందరం, కా. అప్పాదురైలు

ప్రశస్తములైన వచన రచనలు చేశారు. ప్రముఖ పత్రికా సంపాదకులు 'కల్కి' కృష్ణమూర్తి తమిళ వచన రచనకు చేసిన సేవ నిరుపమానం. ఆనంద వికటన్, కల్కి మొదలైన పత్రికలకు సంపాదకులుగా ఉన్నప్పుడు ఎన్నో హాస్య రస ప్రధానములైన వ్యాసములూ, చక్కని కథానికలూ, ప్రశస్తములైన చారిత్రక నవలలూ వ్రాశారు. ఆర్థిక రాజకీయాది విషయాలను సామాన్యులకు సైతం అర్థమయ్యేలా వ్రాయడంలో కల్కి సాటిలేని రచయిత.

ఎన్నో వచన రచనలూ, కథానికలూ, విజ్ఞానశాస్త్ర రచనలూ తమకే సొంతమనదగిన సులభ శైలిలో రచించారు రాజాజీ.

తమిళ నవలా సాహిత్యంలో ఒక కొత్త మార్పుని డాక్టర్ ము. వరదరాజన్ తీసుకువచ్చారు. ఆయనది సలక్షణమైన సులభ శైలి. ఎన్నో నవలలు వ్రాశారు. తన భావాలు పాఠకుల మనస్సుల్లో హత్తుకునేలా వ్రాయడంలో ఆయన దిట్ట. ఇందుకు ఆయన తమిళ భాషా పాండిత్యం ఉపకరించింది. వచనంలో చాలా పుస్తకాలు వ్రాశారు. ఆయన్ని అనుసరించి కు. రాజవేలు చక్కని నవలలు ఎన్నో వ్రాశారు.

కి. వా. జగన్నాథన్ ఎన్నో చిన్న కథలూ, వ్యాసాలూ, యితర పుస్తకాలూ సులభ సుందరమైన శైలిలో వ్రాశారు. నా. పార్థసారథి, మీ. ప. సోమసుందరం మొదలైన తమిళ పండితులు నవలలూ కథలూ వ్రాసి భాషకు సేవ చేశారు. ఈ రంగాలలో అఖిలన్‌కి ఒక ప్రత్యేక స్థానం ఉన్నది. ఆయన చాలా కథానికలూ నవలలూ వ్రాశారు.

బి. యస్. రామయ్య చక్కని కథానికలూ, తేరోట్టి మగన్ మొదలైన మంచి నాటకాలూ వ్రాశారు. యస్. డి. సుందరం రచించిన కవియిన్ కనవు భావోద్వేగం కల జాతీయ నాటకం. ఆయన వ్రాసిన చలన చిత్ర కథలు కూడా గమనించదగినవే. పమ్మల్ సంబంధ మొదలియార్ పెక్కు వచన నాటకాలు రచించి నాటక పితామహులని కీర్తి గడించారు.

జగసిర్పియన్, కో. వి. మణిశేఖరన్, చాండిల్యన్, రా. కి. రంగరాజన్ ప్రభృతులు విలక్షణమైన శైలులలో నవలలు చాలా వ్రాశారు. లక్ష్మి, అనుత్తమ, రాజం కృష్ణన్, కోమగళ్ మొదలైన రచయిత్రులు వాడుక తమిళంలో రచనలు కావించి పేరు పెంపులు గడించారు.

రసికమణి టి. కె. సి., యస్. మహారాజన్ ప్రభృతులు వ్రాసిన వ్యాసాలు పేర్కొన దగినవి. ము. అరుణాచలం 10 మొదలుకొని 15వ శతాబ్ది

వరకూ గల తమిళ సాహిత్య చరిత్రను ప్రత్యేక సంపుటాలలో చక్కని శైలిలో వ్రాసి తమిళ వచన వాఙ్మయాన్ని సుసంపన్నం చేశారు.

మయిలై సీని వెంకటసామి కూడా పరిశోధన రంగంలో పెక్కు గ్రంథాలు సంతరించారు. ఇంతవరకూ పేర్కొన్న వారందరూ తమిళ వచన రచనా పరిణామమునకు కొద్దిగానో గొప్పగానో తోడ్పడినవారే అని చెప్పవచ్చు.

నేడు వాడుక తమిళంలోనే వచన రచనలు వెలయిస్తున్నారు పెక్కు రచయితలు. పుదుమైప్పిత్తన్, కు. ప. రా., మొదలైనవారు వ్యావహారిక భాషలో కథానికలు వ్రాయడానికి మార్గదర్శకులు. ఈనాడు షణ్ముఖ సుందరం, జయకాంతన్ ప్రభృతులు యిలా వ్రాసి ప్రసిద్ధి చెందారు. వీరి నవలలు కూడా పేర్కొనదగినవే. తి. జానకిరామన్, చిదంబర రఘునాథన్, చిదంబర సుబ్రహ్మణ్యం, పిచ్చమూర్తి మొదలైనవారు కూడా తమ రచనలతో వచన వాఙ్మయాన్ని పరిపుష్టం చేశారు. వాసవన్ శైలిలో గాంభీర్యమూ, భావ తీవ్రతా కనిపిస్తాయి.

అఱిఞర్ అణ్ణాదురై ప్రసంగాలలోనూ వచన రచనలలోనూ ప్రాస మొదలైనవి దోబూచులాడుతూ వుంటాయి. ఆయన్ని అనుసరించి డాక్టర్ కలైఞర్ ము. కరుణానిధి మొదలైనవారు పలువురు వచన వాఙ్మయ వికాసానికి కృషి చేస్తున్నారు.

చెందమిళ్, తమిళ్ పొళిల్, చెందమిళ్ చెల్వి వంటి మాస పత్రికలతో ఆరంభమైన జటిలమైన శైలి యీనాడు సౌలభ్యం, నవ్యత, స్పష్టత మొదలైన వాటిని సంతరించుకుంది. కలైమగళ్, కల్కి వంటి పత్రికలూ, తమిళ్‌నాడు, దినమణి వంటి దినపత్రికలూ వచన రచనా పరిణామమునకు బహుధా తోడ్పడినవి. వాడుక తమిళంలో వ్రాయబడిన కథానికలు మంచివి తామరైలో వెలువడుతున్నవి. వానమామలై అనే ఆయన ఆరాయ్చ్చి అనే పత్రికను నిర్వహిస్తున్నారు.

వ. వే. సు. అయ్యరుగారి 'బాలభారతం', మాధవయ్య 'పంచామృతం', భారతి 'ఇండియా' మొదలైన పత్రికలు తమిళ వచనం అభివృద్ధికి చాలా దోహదం చేశాయి.

పిల్లలకి అర్థమయ్యే శైలిలో పలువురు వ్రాస్తున్నారు. తి. జ. ర., అళ వళ్ళియప్ప, పూవణ్ణన్ మొదలైనవారిని ఈ సందర్భంలో పేర్కొనవలసి వున్నది.

ఈ రోజులలో విజ్ఞాన శాస్త్రగ్రంథాలు, వ్యాసములు సులభశైలిలో

వెలువడుతున్నాయి. ఈ రంగంలో ఎన్నోయేండ్లుగా పరిశ్రమించినవారు పి. యస్. అప్పుసామి అయ్యరు.

చక్కని వచనంలో సులభంగానూ స్పష్టంగానూ ఉండేలా విజ్ఞాన శాస్త్ర గ్రంథాలు వ్రాసేందుకు కొత్త ప్రయత్నాలు జరుగుతున్నవి. తమిళ్ కలై క్కళంజియం (విజ్ఞాన సర్వస్వం), కుళన్దైగళ్ కలైక్కళంజియం (పిల్లల కోసం) — ఈ రెంటినీ యీ సందర్భంలో పేర్కొనక తప్పదు.

చాలా సంగ్రహమైన యీ వ్యాసంలో తమిళ వచనమునకు చెందిన పెక్కు శాఖలను గురించి విపులంగా వ్రాయడం కష్టం. ముఖ్యంగా కొన్నిటిని మాత్రమే ఉదాహరించవచ్చు. ఇక్కడ ఒక సత్యమును ఉదాహరణగా చూపదలచాను. వీలయినంతవరకూ ఇతర భాషా శబ్దాలు వాడకుండా సజీవమైన సరళమైన వచనమును అభివృద్ధి చెయ్యాలని అందరూ నేడు అభిలషిస్తున్నారు. దినపత్రికలూ ఇతర పత్రికలూ ఇందుకు ప్రయత్నించడం పేర్కొనదగిన అంశం.

నిశితమైన దృష్టీ, ఋజు ప్రవర్తనా మన స్త్రీలకు అవశ్యకములని భారతి పేర్కొన్నాడు. ఆయన కవితలూ, వచన రచనలా ఇందుకు లక్ష్యములా అన్నట్లుగా, అవి మనస్సుకి హత్తుకునేలా సులభమైన శైలిలో సంతరించ బడినవి. ఆయన కవితలను పరిశీలించేటట్లుగా, ఆయన వచన రచనలను పరిశీలించే గొప్ప కృషి జరగలేదనే చెప్పవలసివున్నది. వాటిలో సంస్కృత శబ్దాలు ఎక్కువగా కనిపిస్తున్నవి. అటువంటి కృషి జరగక పోవడానికి బహుశః యిదొక కారణం కావచ్చు. కాని ఆయన వ్రాసిన ఆ కాలాన్ని పురస్కరించుకుని చూస్తే, ఆయన అలా ఎందుకు వ్రాశారో మనకు అర్ధ మవుతుంది. ఆ రోజుల్లో ప్రజలకు చక్కగా సులభంగా మనస్సుకి పట్టేలా చెప్పాలన్నదే ఆయన లక్ష్యం. ఆ దృష్టితో పరిశీలిస్తే, ఆయన అఖండ విజయం సాధించాడు. ఆయన వచన రచనలను కనుక పరిశీలిస్తే, వాటిలో చక్కని నడక, నిశితమైన చూపు, సజీవమైన శక్తి ఉన్నట్లు తెలియవస్తుంది. ఈ సంపుటిలో చేర్చబడిన ఆయన వచన వ్యాసాలు, కథలు మొదలైన వాటిని చదువుతుంటే ఈ సంగతి బోధపడుతుంది. డొంక తిరుగుడు లేకుండా సూటిగా స్పష్టంగా తన భావాలను వివరించడంలో భారతి ప్రత్యే కత మనకు గోచరిస్తుంది. అంతే కాదు; ఆయన పరిహాస కుశలత, కుండ

బద్దలు కొట్టేలా చెప్పే స్వభావం మొదలైనవి కూడా తెలియక పోవు. వచన రచనలలో ఆయన జ్ఞాన రథం అద్భుతమైన సృష్టి.

వచన రచనా పరిణామమునకు తోడ్పడిన మరి కొందరి పేర్లు నేను ఉదహరించలేదు. ఇది నేను గుర్తించాను. ఈ వ్యాసంలో ఉదాహృతులైన వారి విషయంలో కూడా, వారు ఏ విధంగా వచన రచనా పరిణామమునకు తోడ్పడ్డారో వివరంగా చెప్పడానికి నాకు వీలు కలగలేదు.

ఈ సంగ్రహ వ్యాసంలో శ్రీలంక తమిళులూ, మలేషియా వంటి దేశాలలో నివసించే తమిళులూ తమిళ వచన వాఙ్మయానికి చేసిన గొప్ప సేవను వివరించాలంటే, యింకా ఎంతో వ్రాయవలసి వుంటుంది. అందువల్ల ఆ సంగతి చెప్పలేదు. వారు తమిళ వచన రచనా పరిణామమునకు గొప్ప కృషి చేశారని మాత్రం చెపుతూ ఈ వ్యాసాన్ని ముగిస్తున్నాను.

— పె. తూరన్

# విషయసూచిక

సమాజము



వేదాంతం

## సి. సుబ్రహ్మణ్య భారతి (1882 - 1921)

(జీవిత సంగ్రహం)

**తమిళ** భాషకు ఒక గొప్ప పునరుజ్జీవనాన్నీ, తమిళులకు ఒక నూతన దృక్పథాన్నీ ప్రసాదించిన వాడు భారతి. ఆయన తండ్రి చిన్నసామి అయ్యరు. ఆయనకి ఎట్టయాపురం సంస్థానంలో ఎంతో పలుకుబడి ఉండేది. అందువల్ల, సంస్థాన విద్వాంసులతో పరిచయ భాగ్యం చిన్నతనంలోనే కలిగింది భారతికి. చిన్నతనంలోనే కవిత చెప్పి భారతి అనే బిరుదు పొందాడు.

మొదట్లో భారతి తిరునెల్వేలిలోని హిందూ కళాశాలలో విద్యాభ్యాసం చేశాడు పథ్నాలగవ యేటనే ఆయనకి వివాహం జరిగింది. అయితే, అప్పటికే చిన్నసామి అయ్యరు ఆర్థికంగా చితికి పోయాడు. భారతికి పెళ్లయిన ఒక సంవత్సరంలోనే ఆయన తండ్రి కాలధర్మం చెందాడు. అందువల్ల కుటుంబం మరీ కష్టాల పాలయింది. ఆ పరిస్థితిలో భారతి కాశీ వెళ్ళాడు. అక్కడ వాళ్ల మేనత్తగారి యింట్లో రెండేళ్ళు ఉన్నాడు. అక్కడున్న రోజుల్లోనే అంగ్లంతో పాటు హిందీ, సంస్కృతం నేర్చుకొనే అవకాశం ఆయనకి కలిగింది. కలకత్తా విశ్వవిద్యాలయం వారి ప్రవేశ పరీక్షకు కూర్చుని, మొదటి తరగతిలో ఉత్తీర్ణు డయ్యాడు. జాతీయ కవిగా రూపొందేందుకు తగిన హంగులు ఆయన కాశీ జీవితం వల్ల లభించాయని చెప్పవచ్చు. వంగదేశంలో వెల్లి విరిసిన స్వాతంత్ర్య వాంఛ ఆయన మనస్సులో బాగా హత్తుకు పోయింది.

1902 లో భారతి ఎట్టయాపురమునకు తిరిగి వచ్చాడు. కొంత కాలం జమీందారు గారి వద్ద పని చేశాడు. కాని స్వాతంత్ర్య వాంఛ తీవ్రంగా కల ఆయనకి ఆ పని నచ్చలేదు. 1904 లో మధురకు వెళ్ళి, అక్కడ ఒక పాఠశాలలో మూడు నెలల పాటు తమిళ పండితుడుగా పని చేశాడు. ఆ ఉద్యోగమూ ఆయనకి అంతగా నచ్చలేదు.

ఆ సంవత్సరమే భారతి మదరాసు వెళ్ళి, అక్కడ స్వదేశమిత్రన్ అనే

తమిళ పత్రికా కార్యాలయంలో సహాయ సంపాదకుడుగా చేరాడు. ఆ పని చేస్తూనే ఆయన చక్రవర్తిని అనే ఒక మాస పత్రికను నడుప సాగాడు. అంతే కాదు. తిరువల్లిక్కేణి నుంచి నడుపుతున్న "ఇండియా" అనే వారపత్రికకు కూడా సంపాదకుడయ్యాడు. తన మనసులో మసలుతూ వున్న జాతీయ భావాలను తమిళనాడులో వ్యాప్తం చేసేందుకు ఇండియా వారపత్రిక ఆయనకి బహుథా ఉపకరించింది.

సూరత్‌లో 1907 లో జరిగిన కాంగ్రెసు మహాసభల్లో భారతి తీవ్ర వాదుల్ని అభిమానించాడు. తిలక్ మహాశయుని అభిప్రాయాలంటే భారతికి మోజు ఎక్కువయింది. తిలక్‌ని ప్రశంసిస్తూ, మితవాదుల్ని హేళన చేస్తూ, ఆయన కవితలు వ్రాయడం మొదలు పెట్టాడు.

మదరాసుకి తిరిగి వచ్చిన తర్వాత, ఇండియా పత్రికలో చట్టాన్ని లక్ష్య పెట్టకుండా వ్రాయడం ఆరంభించాడు భారతి. తత్ఫలితంగా ఆంగ్ల ప్రభుత్వం పత్రిక నడుపుతున్న వారి మీద చర్య తీసుకోసాగింది. అప్పుడు రహస్యంగా భారతి పుదుచ్చేరికి (పాండిచ్చేరి) చేరుకున్నాడు. ఆయన అక్కడికి చేరిన నెల రోజుల్లోనే, ఇండియా వార పత్రిక పుదుచ్చేరి నుంచి రావడం మొదలు పెట్టింది. అయితే బ్రిటిష్ ఇండియాలోకి అది రాకూడదనే నిషేధాజ్ఞ వచ్చిన తర్వాత, ఇండియా పత్రిక కాస్తా ఆగిపోయింది.

1908 నుంచీ 1918 దాకా భారతి పుదుచ్చేరిలోనే నివసించాడు. ఆ రోజుల్లో కుటుంబం గడవడం ఎంతో కష్ట మనిపించింది, చాలా సందర్భాలలో. అయినప్పటికీ, ఆ రోజుల్లోనే ఆయన సాహిత్య వ్యాసంగం ఉచ్ఛస్థితి నందుకుంది. పాంచాలి శపథం, కణ్ణన్‌పాట్టు, కుయిల్‌పాట్టు మొదలైనవి అప్పుడు సంతరించబడిన ప్రముఖ రచనలు. భారతి కవితా, వచన రచనా పుదుచ్చేరిలో మెరుగులు దిద్దుకున్నట్లు స్థూలంగా చెప్పవచ్చు.

పుదుచ్చేరిలో భారతి గడిపిన జీవితం అన్ని విధాలా దుఃఖ భూయిష్ఠ మైనదిగా భావించకూడదు. అక్కడున్న రోజుల్లోనే ఆయనకి ఇద్దరు మహనీయులతో పరిచయమూ సంబంధమూ కలిగాయి. 1910 ఏప్రిలులో శ్రీ అరవింద ఘోష్ పుదుచ్చేరికి వచ్చారు. అంతకు కొంచెం ముందే శ్రీ వ. వే. సు. అయ్యరు కూడా అక్కడికి చేరుకున్నారు. లండనులోని ఇండియా హవుస్‌లో ఒక యువకుడు 1909, జూలై ఒకటవ తేదీని కర్జన్ విల్లి అనే ఆంగ్లేయుణ్ణి చంపి, తర్వాత ఆత్మహత్య చేసుకున్నాడు. వెంటనే ఇండియా హవుస్‌లో ఉన్న

సావర్కార్, వ. వే. సు. అయ్యర్ ప్రభృతుల్ని ఖైదు చెయ్యాలనుకున్నారు. సావర్కార్ చిక్కిపోయాడు. కాని అయ్యరు మారువేషంతో రహస్యంగా పుదుచ్చేరి చేరుకున్నారు.

శ్రీ అరవిందులు, శ్రీ అయ్యరు – వీరిద్దరి సాంగత్యం భారతికి లభించింది. ఆయనకి బాల్యం నుంచే పరాశక్తి అంటే అపారమైన భక్తి. పరాశక్తి మీద ఎన్నో కవితలు చెప్పాడు. కృష్ణుడూ (కణ్ణన్), షణ్ముఖుడూ (మురుగన్) ఆయన ఇష్ట దైవములు. ఆయన వ్రాసిన 'కణ్ణన్ పాట్టు'కి తమిళ సాహిత్యంలో ప్రత్యేకత లభించింది. షణ్ముఖుని గురించి వ్రాసిన కవితలు కూడా చాలా గొప్పవి. 'శత్రుత్వమా! దరిచేరకు, పో – చిందులు తొక్కుతు వస్తున్నది శూలము' అనే పంక్తులకు అక్షర లక్షలు ఇవ్వవచ్చునని వ. వే. సు. అయ్యరు ప్రశంసించారు.

మొదటి ప్రపంచ యుద్ధం 1918, నవంబరులో ముగిసింది. పుదుచ్చేరిని దాటి బ్రిటిష్ ఇండియాలోకి అడుగు పెట్టాడు భారతి. వెంటనే ఖైదు చేసి ఆయన్ని కారాగృహంలో ఉంచారు. కానీ మిత్రుల సహాయంతో త్వరలోనే ఆయన విడుదల అయ్యాడు. తర్వాత కడయం వెళ్లి అక్కడ కొంత కాలం ఉన్నాడు. ఆ తర్వాత మళ్లీ మదరాసుకి వచ్చి, స్వదేశమిత్రన్‌లో చేరాడు. అప్పటికే ఆయన ఆరోగ్యం క్షీణించింది. ఒక కొత్త వ్యక్తిగా కనిపించసాగాడు.

1920, నవంబరు 15 నుంచీ స్వదేశమిత్రన్‌లో సూచన, రసత్తిరట్టు (రసగుళికలు), వినోదత్తిరట్టు (వినోదాత్మకములు) మొదలైన శీర్షికల కింద వ్యాసాలు ధారావాహికంగా భారతి వ్రాయసాగాడు. ఆ వ్యాసాలు చాలా వరకు దేశ స్వాతంత్ర్యాన్ని ప్రోత్సాహించే పరికరాలుగా ఉండేవి.

భారతి తిరువల్లిక్కేణిలో ఒక యింట్లో కాపురముండేవాడు. తరుచుగా పార్థసారథి స్వామివారి ఆలయానికి వెడుతూ వుండేవాడు. వెళ్ళినప్పుడల్లా గుడి యేనుగుకి పళ్ళూ కొబ్బరికాయలూ పెడుతూ వుండేవాడు. మదమెక్కి వున్న రోజున ఆ యేనుగు భారతిని తొండంతో లాగి నెట్టేసింది. భారతికి ఒంటి మీదా తలమీదా గాయాలు తగిలాయి.

ఆ గాయాలు మానిపోయినా, ఆ సంఘటనకు తర్వాత భారతి చాలా కాలం జీవించలేదు. ఆయన ఆరోగ్యం బాగా క్షీణించిపోయింది. తత్ఫలితంగా 1921, సెప్టెంబరు 11 న భారతి కాలధర్మం చెందాడు. తన రచనల

ద్వారా దేశంలో చైతన్యాన్నీ, భాషలో పునరుజ్జీవనాన్నీ తీసుకు వచ్చిన భారతికి మరణించేనాటికి 38 సంవత్సరాలు. ఆయన మనస్సులో పొంగి పొరలిన భావోద్వేగాన్ని ఆయన దేహం ఇక భరించలేకపోయింది.

భారతి మరణానంతరమే ఆయన కవితలోని వైశిష్ట్యం చక్కగా తెలియ వచ్చింది. స్వాతంత్ర్య సమరం జరుగుతూ వున్న ఆ రోజుల్లో ప్రతి సందర్భం లోనూ ఆయన జాతీయగీతాలు ప్రతిధ్వనించేవి. ప్రజలు వాటికి ప్రభావితు లైనారు. ముఖాముఖీ మాట్లాడుకున్నట్లుగా భావోద్వేగంతోనూ సుస్పష్టం గానూ ఆయన వచన రచన రూపొందింది. వచన రచనలోనూ ఆయన నవ్యతను ప్రవేశపెట్టాడు.

స్త్రీ స్వాతంత్ర్యం, సంఘసంస్కరణ, రాజకీయ లక్ష్యాలు మొదలైన వాటిని గురించి భారతి వెలిబుచ్చిన అభిప్రాయములు ప్రగతి శీలాత్మకములు. ఇందుకు ఆయన సంతరించిన కవితలు, కథలు, వ్యాసాలు మొదలైనవి సాక్ష్యాలు. మనస్సులో కనక వెలుగు ఉంటే మాటలోనూ వెలుగు కలుగు తుందని ఆయన చెప్పినట్లుగా, భారతి హృదయంలో ఉదయించిన వెలుగు ఆయన సృష్టించిన సాహిత్యంలోనూ వెలుగులు విమ్మడం మనం చూడ వచ్చు. అందువల్ల ఆయన్ని మనం ఈనాడు మహాకవిగా కొనియాడు తున్నాము.

# మొదటి భాగం - కథలు

అధ్యాయం - 1

# ఆరులో ఒక వంతు

వీణ వాయించడంలో మీనాంబాళ్ సరస్వతికి సమానం. పరశువాకంలోని మా యింటికి ఆమె విజయం చేసినప్పుడల్లా, మేడమీది గదిని ఆమె కోసం ఖాళీచేసి ఉంచడం మాకు అలవాటు. వెన్నెల రోజుల్లో రాత్రి ఎనిమిదింటికల్లా మా భోజనాలు అయిపోయేవి. తొమ్మిది నుంచి అర్ధరాత్రి దాకా గదిలో కూర్చుని ఆమె వీణ వాయించేది. గది నానుకుని బయట ఒక పందిరి. ఆమె తండ్రి రావుబహదూర్ సుందరరాజులు నాయుడు పందిట్లో మంచం మీద పడుకుని కొంచెంసేపు వీణవిని, తర్వాత గురకలు పెడుతూ నిద్రపొయ్యేవాడు. అయితే ఆ గురకల చప్పుడు వీణానాదాన్ని మింగివేసేది కాదు. బయట వున్న ముంగిలికి ఒక పక్కన నేను మాత్రం నా 'బ్రహ్మచారి' పడకను వేసుకుని నిద్ర పొయ్యేవాణ్ణి. వీణావాదన పూర్తి అయ్యేంత వరకూ నాకు నిద్ర పట్టేది కాదు. మీనాంబాళుతో పాటు గదిలోనే నిద్రపొయ్యే నా చెల్లెలు రత్నం కూడా త్వరగానే కునుకు తీసేది. కింద మా అమ్మ, మా అన్నయ్యా ఆయన భార్యా మొదలైన వాళ్లు కూడా నిద్ర పొయ్యేవారు. భోజనం ముగించుకుని చేతులు కడుక్కుంటూనే మా వదినగారు గురకలు పెట్టేది. మధ్య మధ్య పిల్లల యేడుపు వినిపించేది. అన్నగారికి కోటలో రెవెన్యూ బోర్డు ఆఫీసులో పని. ఆయనకి నాలుగేళ్లకొకసారి ఆఫీసులో పది రూపాయలూ, ఇంట్లో ఇద్దరు పిల్లలూ 'ప్రమోషన్'.

వసంతకాలం. వెన్నెల రాత్రి. అర్ధరాత్రి వేళ. పరశువాకం గాఢనిద్రలో ఉంది. ఇద్దరు మాత్రమే మేల్కొని వున్నారు. నేనొకణ్ణి. మరొకరు ఆమె.

గంధర్వ స్త్రీలు వాయించేటట్టుగా వీణ వాయించేది మీనాంబాళ్. చూడడానికి కూడా ఆమె గంధర్వస్త్రీలా ఉండేది. ఆమెకు పదహారేళ్లుండవచ్చు.

ఇంకా కథను ఊరికే పొడిగించడమెందుకు ? మన్మథుడు తన బాణంతో నా ప్రాణాన్ని గుచ్చి తీసుకుపోయి ఆమె వశం చేశాడు. అరె ! ఎంత సేపు విన్నా, ఆమె సంగీతం విసుగనిపించదు. రోజు రోజుకీ కొత్తగానే కనిపించేది, ఆమె ముఖంలా. ఆమె తండ్రి రావుబహదూర్ సుందర రాజులు నాయుడు మా అమ్మకు వేలువిడిచిన అన్నయ్య అవుతాడు. తంజావూరు మొదలైన పెక్కు జిల్లాలలో చాలా కాలం పోలీసు ఇనస్పెక్టరుగా పనిచేసి సర్కారు వారికి బాగా సేవ చెయ్యడంవల్ల, ఆయనకి రావుబహదూర్ అనే బిరుదు లభించింది. జాతీయతా భావం ఉదయించేందుకు మునుపే ఆయన ఉద్యోగం నుంచి విరమించుకున్నాడు. ఈ సంగతి ఎందుకు చెపుతున్నానంటే, ఏదో కొందరు జాతీయ నాయకుల మీద రిపోర్టులు వ్రాసి సులభంగా తెచ్చుకున్న బిరుదు కాదది. నిజంగానే ఎంతో కష్టపడడం వల్లనే ఆయన కా బిరుదు వచ్చింది. మీనాంబాళ్ చిన్నపిల్లగా ఉన్నప్పటినుంచీ, ఆమెను నాకిచ్చి పెళ్లి చెయ్యాలని ఆయన ఉద్దేశం. ఆ ఉద్దేశం నెరవేరే లోపల ఎన్నో విఘ్నాలు వచ్చిపడ్డాయి. అవి చాలా వరకు నా వల్ల కలిగినవే.

నాకు పదహారో యేడు వచ్చేంతవరకూ, నేను మదరాసులోని క్రైస్తవ కళాశాలలో చదువుతూ వుండేవాణ్ణి. 'వేదకాలం మొదలుకొని నేటిదాకా భారతదేశంలోని ఋషులంతా ఏమీ తెలియని మూఢులు. అర్జునుడూ, కాళిదాసూ, శంకరాచార్యులూ, శివాజీ, రామదాసూ, కబీరుదాసూ – వాళ్లకు మునుపూ ఆ తర్వాతనూ జీవించిన భక్తులందరూ వట్టి మూఢ భక్తులు, అనాగరకులు.' ఈ కోవకు చెందిన 'ఆంగ్లేయ' సత్యాలు నా మనస్సులో చోటు చేసుకున్నాయి. కాని క్రైస్తవ ఫాదరీ ఒక వింత జంతువు. హైందవ విధానంలోనూ హైందవ నాగరకతలోనూ అభిమానం ప్రకటించడం అవివేకమని నిరూపిస్తూనే, క్రైస్తవ విధానాల పట్ల ఆయన చూపే అభిమానం కూడా మూఢభక్తి వంటిదే అని యువకులు భావించేలా ఆయన ప్రవర్తించేవాడు. మత విషయాలను గురించి విపులంగా వ్రాసి పాఠకులకు తలనొప్పి కలిగించడం నా ఉద్దేశం కాదు. సంగ్రహంగా చెప్పాలంటే, నేను నా పూర్వ మతాచారముల పట్ల వైముఖ్యం చూపి 'జ్ఞానస్నానం' పొందలేదు కాని బ్రహ్మసమాజంలో చేరాను.

ఆ తర్వాత కొన్నాళ్లకు పట్టణం చదువుకి స్వస్తి చెప్పి, ఇంట్లో ఎవరితోనూ చెప్పకుండా కలకత్తాకి వెళ్లాను. అక్కడ బ్రహ్మసమాజం తాలూకు

విధానాలు బోధించే ఒక పాఠశాలలో చేరి కొన్ని నెలలు చదివాను. బ్రహ్మ సమాజం వారి 'బోధకుడు'గా నేను తయారు కావాలని నా ఉద్దేశం. తర్వాత పంజాబు మొదలైన పెక్కు ప్రదేశాలు పర్యటించి చివరికి చెన్న పట్టణం చేరుకున్నాను. నేను హిందూ మతం విడిచి పెట్టినట్లుగా తలచి, మా కులంవారు నన్ను నానా యిబ్బందులు పెట్టారు. ఈ బాధలవల్ల నాకు గుండె దిటవు నానాటికీ ఎక్కువయింది. అంతేకాని నేను నిరుత్సాహం చెందలేదు. మా నాన్నగారు – దుబాష్ (ద్విభాషి) రామచంద్రనాయుడు – పైకి మాత్రం అందరూ పాటించే ఆచార వ్యవహారాలు పాటిస్తూ వుండే వాడు. కాని లోపల మాత్రం బ్రహ్మసమాజం అంటే అభిమానం. అందువల్ల నిజంగా దైవభక్తి ఆత్మ ప్రత్యయమూ కలిగి వుండడం, నేనెప్పుడూ శ్రద్ధగా ఉపనిషత్తులు చదవడం చూసి ఆయన లోలోపల ఎంతో సంతోషించేవాడు. కాని పైకి నన్ను కోప్పడినట్లుగా నటించేవాడు; అది నన్ను కొనియాడు తున్నట్లు కనిపించేది. మా బంధువుల మాటలు విని ఆయన నన్ను బాధించ లేదు. పూర్వం కంటె యిప్పుడు ఎక్కువగా ఇంట్లో అన్ని సౌకర్యాలు నాకు కలిగేలా ఆయన కట్టుదిట్టం చేశాడు. కాని మా అన్నయ్యకు మాత్రం నేనంటే అంతులేని ద్వేషం. పంజాబీ వారివలె నేను తలపాగ చుట్టుకునే వాణ్ణి. అది నా అలవాటు. '15 రూపాయల' గుమాస్తాకోసం ఉద్దేశించబడిన అందమూ చందమూ ఏమీలేని కుంభకోణం తలపాగను నేను ధరించడం మానివేశాను. ఇదికూడా మా అన్నయ్యకు నేనంటే కోపకారణమే. 'రాజపుత్రుడు వీడు – దొంగ వెధవా! తలమీద మహా ఆడంబరంగా ఒక కుచ్చు కూడా వీడికి! అంటూ విసుగూ విరామం లేకుండా నన్ను కోప్పడుతూ వుండే వాడు. ఇలా ఉండగా, ఒకరోజు అకస్మాత్తుగా మా నాన్నగారు కన్ను మూశారు. ఆయనకి బ్రహ్మ సమాజం విధుల ననుసరించి అంత్య క్రియలు జరపాలని నేనన్నాను. మన మామూలు ఆచారం ప్రకారమే జరగాలన్నాడు మా అన్నయ్య. చివరికి మా మాటలు పెరిగి కలహంగా దారి తీశాయి. చాలా మంది రాయబారాలు జరిపారు. శ్మశానంలో మా అన్నయ్య తన నమ్మకం ప్రకారం అంత్య క్రియలు జరిపిన తర్వాత, నేను నా నమ్మకం ప్రకారం బ్రహ్మ సమాజానికి చెందిన ఒక గురువుగారిని తీసుకువచ్చి అంత్య క్రియలు చేశాను. ఇదంతా చూసిన తర్వాత మా మామయ్య రావుబహదూర్ సుందర రాజులు నాయుడుకి నేనంటే ఒక దురభిప్రాయం కలిగింది. అందువల్ల మా

పెళ్లికి విఘ్నాలు ఏర్పడుతూనే వచ్చాయి. కాని, నన్నెలాగయినా దోవలోకి తీసుకువచ్చి తన కుమార్తెను నాకిచ్చి పెళ్లి చెయ్యాలనే ఆయన అభిలాష.

వసంతకాలం. వెన్నెలరాత్రి. అర్ధరాత్రివేళ. పరశువాకం గాఢనిద్రలో ఉంది. మేలుకున్నవాళ్లు యిద్దరే. నేనొకణ్ణి. ఇంకొకరు ఆమె. హాయి గొలిపే గాలి వీస్తోంది. మేడమీద, మీనాంబాళ్ గదిలోంచి, అలవాటు ప్రకారం వీణానాదం వినవచ్చింది. అయితే, అలవాటు ప్రకారం గురకలు వినిపించ లేదు. రావుబహదూర్ గురకల మామయ్య ఊళ్లో లేడు. గ్రామాంతరానికి వెళ్లాడు. నేను ముంగిట్లో మంచం మీద కూర్చున్నాను. నా మనస్సులో అగ్ని పర్వతాలు రెండు ఢీకొని పోరాడుతున్నాయి. వీటిలో ఒకటి ప్రేమ. మరొకటి – తర్వాత తెలుస్తుంది. వీణానాదం ఉన్నట్టుండి ఆగిపోయింది. కొంచెం సేపటికల్లా నా వెనక ఒక వ్యక్తి నుంచున్నట్టు గ్రహించి వెనక్కి తిరిగి చూశాను. మీనాంబాళ్ !

ఇప్పుడే మేము కొత్తగా ఒంటరిగా కలుసుకున్నామనీ, అందువల్ల ప్రస్తుతం దీర్ఘమైన ప్రేమ సంభాషణ సాగుతుందనీ పాఠకులు ఎదురు చూడ వద్దు. ఈ విధంగా మేమిద్దరమూ ఎన్నోసార్లు కలుసుకున్నాము. మీనాంబాళ్ మంచం మీద కూర్చుంది.

'మీనా ! ఇవాళ నీతో ఒక ముఖ్యమైన విషయం చెపుతాను.' అన్నాను.

'అదేమిటో నాకు తెలుసు' అంది.

'ఏమిటది ! చెప్పు చూద్దాం.'

'నువ్వు బ్రహ్మచారిగా ఉండి పోదామనుకున్నావు – ఇదేగా ముఖ్యమైన విషయం.'

'ఎందుకు, దేనికి ? నీకెవరు చెప్పారు ?' అని అడిగాను.

'వందేమాతరం' అంది.

మీనాంబాళ్ బుద్ధిసూక్ష్మత నాకేమీ కొత్త కాదు. అందువల్ల ఆమె మాటలు నాకు ఆశ్చర్యం కలిగించలేదు.

ఆ తర్వాత నేనిలా అన్నాను. 'అవును. భారతదేశాన్ని యిప్పుడు బ్రహ్మ చారులే కాపాడాలి. ఎంతో గొప్పదేశం యిప్పుడు దిగజారి పోయింది. హిమాలయం ఉన్నచోట ముళ్ల పొదలూ విష కీటకాలూ నిండి పాడువడిన ఒక అడవిగా తయారయింది. అర్జునుడు నివసించిన భవనంలో గబ్బిలాలు వేలాడుతున్నట్టుగా కనిపిస్తోంది. కనక బ్రహ్మచారులే యిప్పుడు

కాపాడాలి. బొబ్బిలి రాజావారి కొడుకుగానో, రాజా సర్ వైలై రామ స్వామి ముదలియార్ కొడుకుగానో పుట్టక మనలా సాధారణ కుటుంబాలలో పుట్టినవాళ్లు పెళ్లి చేసుకుంటే ఈ కరువు కాటకాల దేశంలో ఉక్కిరి బిక్కిరి కావలసిందే. పిచ్చుక తలమీద తాటికాయను ఉంచినట్లుగా, యువకుడి మీద కుటుంబ భారం వెయ్యడం వల్ల, మొయ్యలేక వాడి కళ్లు లోతుకు పోతున్నాయి. చిన్న చిన్న పనులు నెరవేరడానికే భగీరథ ప్రయత్నం అవసర మవుతోంది. అటువంటప్పుడు దేశం కోసం వీళ్లెలా పాటు పడ గలరు ? బ్రహ్మచారులు కావాలి. ఆత్మజ్ఞానం కలవారు కావాలి. ప్రాపంచిక సుఖాలను కోరని ధీరులు కావాలి. జాతీయ భావమనేది లౌకిక ధర్మంకాదు. ఇది ఒక విశిష్ట ధర్మం. దీన్ని అవలంబించే వారికి తేజోవీర్యములూ, కర్మ యోగి లక్షణమూ మొదలైనవి తప్పకుండా ఉండాలి. నేను బ్రహ్మచర్య వ్రతం అనుసరిద్దామని అనుకుంటున్నాను. కాని . . .'

'కాని, నేనందుకు అడ్డు తగులుతున్నానని నీ అభిప్రాయం' అంది మీనా.

'చూశావా, చూశావా ! అప్పుడే ఏమంటున్నావో ! నా మాటలు పూర్తిగా విను. నా కొత్త నిర్ణయం ఒక కొలిక్కి రాకమునుపే నన్ను నీకు అంకితం చేసుకున్నాను. అందువల్ల ఇప్పుడు నాకు మరొక విధ్యుక్త ధర్మం ఎదుర యింది. ఆ విషయంలో నీ ఆజ్ఞకోసం నేనెదురు చూస్తున్నాను' అన్నాను. ఆమె యేదో మాట్లాడాలనుకుంది. ఇంతలో వాకిట్లో ఒక బండి వచ్చి ఆగిన చప్పుడు వినిపించింది.

'నాన్న వచ్చేశారు. నేను వెడుతున్నాను' అంటూ ఒక ముద్దిచ్చి వెళ్లి పోయింది.

గురకల నాయుడు తలుపు బద్దలుకొట్టి, లోపలున్న గురకల్ని లేపి, పైకి వెళ్లి పడుకున్న మరుక్షణానికే తన అలవాటుకి భంగం రానివ్వలేదు. ఆ రాత్రంతా ఇద్దరు మాత్రం కన్ను ముయ్యలేదు. నేనొకణ్ణి ; మరొకరు ఆమె.

## అధ్యాయం - 2

పై అధ్యాయం చివర పేర్కొనబడిన సన్నివేశం తర్వాత కొన్ని నెలలు గడిచాయి. ఈ లోపుగా కొన్ని మార్పులూ ఏర్పడ్డాయి. వందేమాతరం

ఉద్యమం పట్ల నాకు అభిమానం ఉన్నదనే విషయం తెలుసుకున్న రావు బహదూర్ నాకు తన పిల్ల నిచ్చి పెళ్లి చేద్దామనుకున్న అభిప్రాయాన్ని పూర్తిగా మార్చుకున్నాడు. కొన్ని నెలలుగా తన స్వస్థలమైన తంజావూరు నుంచి పరశువాకం రావడం మానివేశాడు. మీనాంబాళ్‌కి ఇతర సంబంధాలు చూస్తున్నట్టుగా వార్త వచ్చింది. ఆమె వద్దనుంచి ఒక్క జాబూ రాలేదు. ఆమె కూడా తనని పూర్తిగా మరిచి పోయిందా? ఆడవాళ్లు రూపెత్తిన వంచన – అని చెపుతారు; నిజమేనా? 'స్త్రీ .... హృదయ పరిపూర్ణత పొందనిది ....' అని నేను జీవక చింతామణి కావ్యం చదివినప్పుడు, ఆ కావ్యకర్త మీనాంబాళ్ వంటి స్త్రీని చూసివుండడనీ, అటువంటి స్త్రీ ప్రేమకు పాత్రుడై ఉండడనీ అనుకున్నాను. కాని యిప్పుడనిపిస్తోంది, కవి వాక్యం సత్య సంపూర్ణమని. యౌవనోద్రేకంలో పడిపోయి, ఆ మహాకవి అభిప్రాయాన్ని అప్పుడు శంకించానని అనుకున్నాను.

'ఓరి మూర్ఖుడా! ఎందుకిలా విచారిస్తావు? జీవితాంతం బ్రహ్మచారిగా ఉండిపోవాలని నువ్వేమో రోజూ ఉవ్విళ్లూరుతున్నావుగా! కాగా, మీనా మరొకరిని వివాహం చేసుకుంటే, అందువల్ల నీకు మరీ మంచిది కదా! నువ్వా యింకొక స్త్రీని పెళ్లి చేసుకుని సంసార యాత్ర సాగించవు. మీనా ఒక్కత్తె నీ ఆశయానికి పానకంలో పుడకగా ఉంది. ఆమె యిప్పుడు మరొకణ్ణి పెళ్లి చేసుకుని అతని భార్య అవుతుంది. నీ ఆశయం నిరాటంకంగా నెరవేరుతుంది. ఆ సర్వేశ్వరుడే నీకు మంచి చేశాడు. అందువల్ల ఈ విషయం గురించి నువ్వెందుకు విచారిస్తావు?' అని అప్పుడప్పుడు నా మనస్సు నాకు హితవు చెప్పేది.

ఒక్కొక్కసారి ఇలా అనుకునేవాణ్ణి. 'ఆమె నన్ను మరిచిపోలేదు. మామయ్య మాట విని మరొకణ్ణి పెళ్లి చేసుకోనే చేసుకోదు. ఆమె ప్రాణం నా ప్రాణంతో ముడివడింది. అందువల్ల నాలో వెలుగొందే ధర్మ చింతనలో ఆమెకూ భాగముంది. ఈ చింతనకు అంతరాయం కలుగుతుందనే భయం కొద్దీ ఆమె నాకు జాబు వ్రాసి ఉండదు. అది సరే కాని మీనా! నువ్వెటు వంటిదానివో నాకు తెలీదా? ఏం జరిగినా, నువ్వు నన్ను మరిచిపోగలవా? ఆ నీ కళ్లు 'నిన్ను మరిచిపోను' అని ఎన్నిసార్లు నా సమక్షంలో ప్రమాణం చెయ్యలేదని! ఆ కళ్లు! ఆ కళ్లు! అయ్యో, ఇప్పుడు కూడా అవి నాకు కనిపిస్తున్నాయి గదా! అవి అబద్ధం చెపుతాయా?'

తర్వాత ఇలా అనిపించేది. 'ఒరేయ్! నీది బలే సన్న్యాసం! నీది బలే భక్తి! బలే శ్రద్ధాసక్తులు! ఆర్యావర్తాన్ని ఉద్ధరించేందుకు నీవంటి మగ ధీరులే కావాలి! భీష్ముడు పుట్టిన దేశంగదా యిది! ఇప్పుడు నీవంటివారే దేశాన్ని ప్రకాశింప జేస్తున్నారు? ఛీఛీ .... నీది కుక్క బుద్ధి. అమృత ప్రవాహాన్ని తోసిరాజని వట్టి ఎముక కోసం వెతుకుతావా? లోకోద్ధరణ మంచిదా, నీ తుచ్ఛసుఖం మంచిదా? ధర్మచింతన గొప్పదా, స్త్రీ చింతన గొప్పదా? దేన్ని స్వీకరిస్తావు? చెప్పరా, చెప్పు.'

ఆ తర్వాత ఇలా అనిపించేది. "ఆమె కనక ఈ నిర్ణయానికి వస్తే, నాకెంతో బలంగా ఉంటుంది – 'నువ్వు నీ ధర్మం అనుసరించు; నా కోసమని నీ ధర్మాన్ని తృణీకరించకు. నేను జీవించి వున్నంతవరకూ నిన్నే మానసికంగా నా భర్తగా భావిస్తాను. వ్రతాలూ అవీ చేసుకుంటూ గడుపుతాను. స్వర్గంలో మనమిద్దరం కలిసి జీవిద్దాము' ఇటువంటి నిశ్చయానికి ఆమె వస్తే నాకీ జన్మ ప్రశాంతంగా గడిచిపోతుంది."

తర్వాత మళ్లీ యింకొక ఆలోచన. 'ఎవరితోనో ఆమెకు వివాహం జరిగినట్టు కబురు తెలిసి వుంటే, నాకే చింతా ఉండదు. ఐహిక వాంఛలేమీ పెట్టుకోకుండా, నా ధర్మానుష్ఠానంలోనే కాలం గడపవచ్చు.'

ఆ తర్వాత వేరొక ఆలోచన. 'ఆ – అటువంటి కబురే కనక వస్తే, నా బొందిలో ప్రాణం ఉంటుందా? ఆమె ప్రేమ మరొకరి మీదికి మళ్లిందని తెలిసిన తర్వాత నాకీ లోకంతో పనేముంటుంది?'

వెంటనే యింకొక ఆలోచన. 'ఆమె ప్రేమ! స్త్రీలకు స్థిరమైన ప్రేమ అంటూ ఒకటుందా! వంచన, లోభం – ఈ రెంటినీ కలిపి బ్రహ్మ స్త్రీలను సృష్టించాడు.'

ఇలా రకరకాల ఆలోచనలు నా మనస్సుని వశం చేసుకున్నాయి. నన్ను కలవరపెట్టాయి. గుండె దిటవు లేనివాని మనస్సుని సముద్రంతో పోల్చవచ్చు. పాఠకులు కనక ఒక్క క్షణం తమ్ము తాము పరిశీలించుకుంటే, తమ మనోభావాలనూ కలతలనూ పరామర్శ చేసుకుంటే, వారు చాలా ఆశ్చర్యపోతారు. జీవితంలో ఎందుకిన్ని ఆశ్చర్యాలు కలుగుతున్నాయి?

ఇలా ఉండగా, ఉన్నట్టుండి ఒకనాడు మీనాంబాళ్ వద్ద నుంచి నాకు ఉత్తరం వచ్చింది. ఆ లేఖను కింద పొందు పరుస్తున్నాను. అది చదివిన తర్వాత నా మనస్సు ఎంత బాధ పడిందో మీరే ఊహించుకోవచ్చు.

ఓం

తంజావూరు

సోదరా !

ఈ జాబు వ్రాయడం మొదలు పెట్టేసరికి నా గుండె కొట్టుకుంటోంది. ఎలా వ్రాయాలో నాకు తెలియడం లేదు. అయ్యో ! ఇది నా చివ్వరి జాబు. ఇక నిన్నీ లోకంలో నేను చూడలేను.

వచ్చే తై నెలలో (జనవరి–ఫిబ్రవరి) ఈ ఊరికి కొత్తగా వచ్చిన పోలీస్ ఇనస్పెక్టర్ మన్నార్ అనే ఆయనకి నన్ను బలిగా సమర్పించడానికి మా నాన్న నిశ్చయించారు. పెళ్లికి కావలసిన సామగ్రి కూడా సిద్ధమవుతోంది. నీ పేరు వింటే చాలు, వేటకుక్క మీద పడినట్టు పడి, అనరాని మాటలు అంటున్నాడు మా నాన్న. నేనెక్కడ తప్పించుకుని పారిపోతానో అని బయట కాపలా కూడా పెట్టించాడు. ఒకవేళ ఈ విషయమంతా తెలుసుకుని నువ్వు యిక్కడికి వస్తావేమోనని, మా నాన్నా మన్నారూ కలిసి నిన్ను యింట్లోకి కూడా రాకుండా చేసేందుకు తగిన కట్టుదిట్టాలన్నీ చేశారు. మా నాన్న డబ్బు మీద మన్నారు కన్ను వేశాడు. అందుకే ఈ వివాహానికి ఒప్పుకున్నాడు. అతనంటే నాకు ద్వేషమూ, కోపమూ అనీ, నన్ను కనక అతను పెళ్లి చేసుకుంటే యీ బలవంతపు పెళ్లి వల్ల అతని యావజ్జీవితమూ దుఃఖ భాజన మవుతుందనీ, అతనేమీ సుఖపడడనీ నేను ఖచ్చితంగా చెప్పాను. అందుకా పశువు, 'నాకు ఆమె మనస్సుతో పనిలేదు. ఎలా వశం చేసుకోవాలో నాకు తెలుసు. మొట్టమొదట ఆ డబ్బు నా చేతికి రావాలి. ఆ తర్వాత అది పారిపోయి జెయిలుకి వెళ్ళబోయే ఆ సన్నాసితో తైతక్కలాడి చివరికి సముద్రంలో దూకనీ' అని బదులు చెప్పాడు.

చాలా రోజులుగా నాకు రాత్రిళ్లు నిద్ర లేదు. నిన్నరాత్రి పక్క మీద అటూ ఇటూ దొర్లుతూ నేను కాలక్షేపం చేశాను. అప్పుడు కలలాంటిది ఒకటి వచ్చింది. నిద్ర లేనప్పుడు కల ఎలా వస్తుంది ? అది కలా కాదు, గిలా కాదు. ఏదో ఒక రకమైన దృశ్యం. అతి భయంకరమైన రూపంతో రక్త నేత్రాలతో, నీలమేఘం వంటి శరీరంతో, తెగిన తలల దండతో, చేతిలో శూలంతో కాళికాదేవి ప్రత్యక్షమయింది. నేను భయపడ్డాను. 'తల్లీ నన్ననుగ్రహించు' అంటూ నమస్కరించాను. వెంటనే, ఉన్నట్టుండి ఆమె మనోహరాకృతి దాల్చింది. ఆ సౌందర్యాన్ని వర్ణించలేను. ఆమె శిరస్సు

నావరించి కోటి సూర్యుల వెలుగుతో ఒక తేజోమండలం కానవచ్చింది. నయనాలలో అనుగ్రహం వర్షించింది. అప్పుడు దేవి నాకు అభయప్రదానం చేసి యిలా చెప్పసాగింది. 'బిడ్డా, నీ బావ గోవిందరాజుని నా సేవలో నియోగించ దలిచాను. ఈ లోకంలో నువ్వతనిని పొందలేవు. మరొకనికి నువ్వు భార్యవూ కాలేవు. నీకీ లోకంలో జీవితమంటూ యిక లేదు. మీ యింటి పెరట్లో, వాయవ్య దిశగా, ఒక పచ్చాకు తీగ చూస్తావు. రేపు పొద్దున స్నానం చేసి, పూజ ముగించిన వెంటనే, అందులోంచి రెండాకులు మాత్రం తిను. మరిచిపోకు.' ఇలా ఆజ్ఞాపించి పరాశక్తి ఆ తర్వాత మాయమయింది.

పొద్దున లేచి ఆ పచ్చాకు తీగకోసం చూశాను. ఆకాశం నుంచి ఒక కాకి దిగింది. అదిఆ పచ్చాకుని ముక్కుతో పొడిచి వెంట నే నేలమీద పడి పోవడం చూశాను. దేవి మాటలలోని ఆంతర్యాన్ని నేనప్పుడు తెలుసుకో గలిగాను. ఇవాళ పగలు పది గడియలకు ఆ ఆకుని తిని నేను పరలోకానికి వెడతాను. నీ రాకకోసం ఎదురు చూస్తూ అక్కడ కన్యగానే ఉండిపోతాను. నువ్వు నీ విధ్యుక్త ధర్మాలను నెరవేర్చి, ఆ జనని అభీష్టం ప్రకారం ప్రవర్తించిన తర్వాత, ఆమెయే నిన్ను నా వద్దకు తీసుకు వస్తుంది. వెళ్లి వస్తాను. రాజా! రాజా! నన్ను మరిచిపోకు. వందేమాతరం!'

ఈ జాబుని చదివానో లేదో, అంతే మూర్ఛపోయాను.

## అధ్యాయం - 3

మీనాంబాళ్ 'మరణ లేఖ' వచ్చిన తర్వాత రెండేళ్లు గడిచాయి. ఈ రెండేళ్లలోనూ జరిగిన సంఘటనలను కనక సవివరంగా చెప్పదలచుకుంటే, ఒక మహాగ్రంథం తయారవుతుంది. సంగ్రహంగా చెపుతాను. ఆ దుఃఖంతో ఇల్లు విడిచిపెట్టిన నేను కాషాయాంబరాలు ధరించి సన్యాసిగా ఉత్తర భారత మంతా పర్యటించి వచ్చాను. 'వందేమాతరం' ధర్మాన్ని మాత్రం నేను మరిచిపోలేదు. కాని, ప్రభుత్వోద్యోగులకు నన్ను నిర్బంధంలో ఉంచ వలసిన అవసరాన్ని కల్పించలేదు. ప్రజలలో కనక మైత్రినీ ధైర్యమునూ స్థిరం చేయగలిగితే, స్వాతంత్ర్యం తనంతటతానే లభిస్తుందని నా నమ్మకం. కారణాన్ని విడిచిపెట్టి ఫలితం కోసం నేను అన్వేషించ లేదు. అక్కడక్కడా ప్రచారం మాత్రం చేశాను. అందువల్ల కొన్ని చోట్ల పోలీసులు నన్నను

సరించి తిరిగారు. కాగా, ప్రజలతో బాగా కలసి మెలసి సంచరించే అవకాశాలు తగ్గుముఖం పట్టాయి. నా ప్రచారం వల్లనా ఆశయ సిద్ధికి అంత రాయం కలిగింది. అదీకాక నా ప్రసంగాలు విని ప్రజలుమహా ఆశ్చర్యంలో మునిగిపోయేవారు. అందువల్ల ఇతరులకంటే నన్నెక్కువగా గౌరవించడం మొదలుపెట్టారు. ఇది చూసి నేను లోలోన గర్వపడ్డాను కూడా!

"ప్రకృతి ధర్మాలనుంచి చేతలు మొగ్గలు తొడుగుతాయి. మూఢుడు 'నేను చేస్తున్నానని అనుకుంటాడు' - అనే భగవద్గీతా వాక్యాన్ని నేను మాటి మాటికి మననం చేసుకోసాగాను. ఈ వృథా గర్వం నన్ను పూర్తిగా కైవసం చేసుకుని, నన్నెందుకూ పనికిరాని వాణ్ణిగా చేస్తుందేమో అన్న భీతి నాకు కలిగింది. బయటికి తెలియనీయకుండా, ఎవరి ఆదరమునూ అభిమానమునూ ఎదురుచూడకుండా సాధారణమైన సేవ చేసేందుకు నన్ను జగజ్జనని నియోగించిందని తెలుసుకున్నాను. కాగా, ప్రచార సభలలో పాల్గొనడం మానివేశాను. ఆ తర్వాత కొన్నాళ్లకల్లా పోలీసులు నావెంట తిరగడమూ మొదలైనవాటిని నిలిపివేశారు. పాదచారి గానేఎన్నో ఊళ్ళు పర్యటించాను. ఎన్నోవృత్తులు అవలంబించి, చివరికి లాహూర్ నగరం చేరుకున్నాను.

అక్కడ లాలా లజపతిరాయ్ వంటి ప్రముఖులు పలువురిని చూడాలని పించింది. ఆయన్ని దర్శించాను. నేనంటే ఆయనకి నమ్మకం కలిగింది. కోసల దేశంలోని పెక్కు ప్రాంతాలలో దుర్భిక్షం విలయతాండవం చేస్తున్న దనీ, క్షామ పీడిత ప్రజలకు అన్న వస్త్రాలు అందజేసే ఉద్దేశంతో తాను నిధి సేకరిస్తున్నాననీ, ఎందరో యువకులు ఆ నిధిలోంచి డబ్బు తీసుకు వెళ్లి దాంతో క్షామపీడిత ప్రజలకు కావలసిన వాటిని అందజేస్తున్నారనీ చెప్పి, 'ఈ విషయంలో మీరు కూడా సహాయం చెయ్యకూడదా?' అని అడిగారు.

ఆహా! రామచంద్రమూర్తి రాజ్యం చేసిన దేశం! వాల్మీకి మునిపుంగవుడు కీర్తించిన దేశం! అక్కడ అన్న వస్త్రాల కోసం ప్రజలు అలమటిస్తున్నారా! వాళ్ళకి సహాయం చేసేందుకు అక్కడికి వెడతావా? అని అడగాలా! వాళ్లంతా నాకు దైవసములు! వాళ్లకు కావలసిన వాటిని నేను సమకూర్చలేకపోతే, ఈ రక్తమాంసాల శరీరాన్ని నేనెందుకు మోస్తున్నట్టు? లాలాజీ వద్ద సెలవు తీసుకుని కొన్నాళ్లపాటు అక్కడుండి నా ధర్మం నెరవేర్చాను. అక్కడ నేను చూసిన దృశ్యాలను వర్ణించమంటారా! అలాగే.

దేవలోకం గురించి విన్నారు గదా! దేవలోకం కనక మానవలోకంగా మారితే ఎలా ఉంటుందో అలా ఉన్నది రామచంద్ర పరమాత్ముడు రాజ్యం చేసిన భూమి. అక్కడ నేను చూసిన ఘోరాలను ఎందుకు వివరించడం? పుణ్య భూమిని గురించి నీచంగా చెప్పడం వల్ల ఒకవేళ నాకు పాపం కొంచెం సంక్రమించ వచ్చు కూడా! పాపం తప్ప మరేం లభిస్తుందని? నీ వల్ల నా మాతృదేశానికి లాభమేం కలుగుతుంది! లేచిరా, చూద్దాం! ఎన్నాళ్లిలా నిద్రలో మునిగిపోయి, పాడవుతారో యేమో. అయ్యో! పాపజాతి! పాపజాతి! ఇది యిలా ఉంచండి. ఒకటి రెండు నెలలకు తర్వాత, లాలా లజపతిరాయ్ మాకొక జాబు వ్రాశారు, ఆ పనిని ఆపవలసిందంటూ.

నా మనస్సులో చాలా కాలంగా పాతుకుపోయిన ఒక భావం, కోసల దేశంలోని పెక్కు ప్రాంతాలలో క్షామపీడిత ప్రజలకు సేవచేసిన ఆరోజుల్లో మరీ బలపడింది. వెనుకబడిన వర్గాల ప్రజల బాగోగుల విషయంలో అగ్ర వర్ణాలవారమని చెప్పుకునేవారు ఎంత అశ్రద్ధ చేస్తున్నారో, ఆ సంగతి పరిశీలించే కొద్దీ నాకు భరించరాని మనోవ్యథ కలిగింది. దక్షిణదేశంలో వలె ఉత్తర దేశంలోనూ కొందరు తక్కువ జాతి వారని భావించబడు తున్నారు. దక్షిణదేశంలో వలె ఉత్తర దేశంలోనూ, ఈ జాతివారు సాధారణంగా వ్యవసాయం చేస్తుంటారు. వ్యవసాయం చేసేవారు శాస్త్రప్రకారం వైశ్యులు కావాలి. అయితే వీరిలో చాలామంది గొడ్డు మాంసం తినడం వంటి అనాచారాలు పాటించడం వల్ల హిందువులు వీరిని తక్కువగా చూస్తున్నారు. హైందవ నాగరకతలో గోవు అతి ప్రధానమైనది. ఆ నాగరకత వ్యవసాయం మీద ఆధారపడి వుంది. వ్యవసాయానికి ఆవు జీవగర్ర. అందువల్ల హిందువులు ప్రాచీనకాలం నుంచే గోమాంసాన్ని వర్జించారు. కొందరు మాత్రం అలా చెయ్యలేదు. అటువంటి వారిని హిందువులు మరీ తక్కువగా చూడసాగారు. ఇది న్యాయమే. కాని క్షామం వ్యాధి మొదలైన శత్రువుల ముందు మనం మన హెచ్చుతగ్గుల్ని ప్రదర్శించు కోవడం అవివేకం. తక్కువ జాతులవారిని మనం మరీ తక్కువ పరిచాం. ఆ ఫలితాలు మన మిప్పుడు అనుభవిస్తున్నాం. 'మనసుని బాధించే పనులకు మనం స్వస్తి చెపుదాం.'

'పొద్దున చేసింది మాపటివేళ ఫలిస్తుంది.' మనం పళ్లలికీ, పంచములకూ ఏం చేశామో, మనకు విదేశాలలో విదేశీయులు అదే చేస్తున్నారు. మన

శృంగేరి శంకరాచార్యుల వారూ, వానమామలై జీయర్ స్వాములూ నేటాల్, ట్రాన్స్‌వాల్ మొదలైన దేశాలకు కనక వెడితే, ఊరి బయటవున్న గూడెములలో వాళ్లు నివసించాలి. సామాన్యులు నడిచే బాటలమీద నడవకూడదు. పక్కకు తొలిగి నడవాలి. పల్లకీలు, బండ్లు - మొదలైన వాటికోసం ఎదురు చూసే పనిలేదు. సంగ్రహంగా చెప్పాలంటే: మనం మనలోనే కొందరిని నీచులని భావించాము. ఇప్పుడు మనందరినీ ప్రపంచంలోనివారు ఇతర దేశీయుల కంటె నీచులుగా చూస్తున్నారు. మనలో కొందరిని మనం అస్పృశ్యులుగా భావిస్తున్నాము. ఇప్పుడు, వేద మార్గావలంబకులూ మహమ్మదీయులూ అనే అంతర్భాగం కల మన హిందూజాతిని (భారతీయులు) ప్రపంచం అంటరాని జాతిగా భావిస్తున్నది. ప్రపంచంలో అన్ని జాతులలోనూ భేదాలు లేకపోలేదు. అయితే, ఆ భేదాలు శాశ్వతమయ్యే పక్షంలో జాతి దుర్బలమై పోతుంది. అప్పుడు విదేశీయుల దృష్టిలో మనం తక్కువ వారమవుతాము. 'ఊరు కనక రెండు ముక్కలయితే, కోణంగికి కొండాటం.'

1,200 సంవత్సరాలకు మునుపు, ఉత్తర దేశం నుంచి మహమ్మదీయులు పంజాబులో ప్రవేశించినప్పుడు, మనవారు పెట్టే బాధలను భరించలేని పళ్లలూ పంచములూ భేరి కొట్టి, గంటలు వాయిస్తూ శత్రువులకు ఎదురేగి, స్వాగతవచనాలు పలికి, వాళ్లలో కలిసిపోయినట్లుగా ఐతిహ్యం. అప్పుడు మన జాతికి పట్టిన జాడ్యం ఇంకా తీరలేదు. కరువు కాటకాలలో సాధారణంగా పంచములూ మొదలైనవారే మరణిస్తున్నారు. ఈ విషయమై అగ్ర వరాలవారు వహించవలసినంత శ్రద్ధ వహించడం లేదు. ఎక్కడినుంచో వచ్చిన ఇంగ్లీషు ఫాదరీలు క్షామపీడితులకు బహుముఖాలుగా సహాయం చేసి, వందలకొద్ది మనుషుల్ని ముఖ్యంగా దిక్కులేని పిల్లల్ని క్రైస్తవ మతంలో కలుపుకుంటున్నారు. హిందువుల జనసంఖ్య ప్రతియేడూ అతి భయంకరంగా తక్కువవుతోంది. మఠాధిపతులూ పెద్దలూ తమ బొజ్జలు పెరగడం చూసి జ్ఞానం పెరుగుతున్నట్లుగా తలచి సంతోషిస్తున్నారు. హిందువులారా! హిందువులారా! మన నెత్తురు, మన కండరాలు, మన ఎముకలు, మన ప్రాణం – హిందూస్థానపు ప్రజలు – అడిగేవారు లేక ఆకలి బాధకు అసువులు విడుస్తున్నారు.

గోమాంసం తినకుండా ఉండేటట్లు చేసి, పంచముల్ని మన సంఘంలో కలుపుకుని, వారికి చదువు సంధ్యలు, ధర్మచింతన మొదలైనవి కల్పించి, వారిని మనమే ఆదరించాలి. లేకపోతే వాళ్లందరూ మనకు ఆ జన్మ విరోధులుగా తయారవుతారు. ఈ విషయంలో నా అల్పశక్తికి వీలయినంత వరకూ ప్రయత్నం చెయ్యాలనే అభిలాష నా మనస్సులో వ్యాపించింది. వంగదేశంలో అశ్వినీ కుమారదత్తు అనే ఒక దేశ భక్తుడున్నట్లూ, ఆయన ఆ ప్రాంతంలోని 'నామశూద్రులు' అని వ్యవహరించబడే తక్కువ కులం వారిని సమాజంలో కలుపుకుని, వాళ్ల అభ్యుదయానికి పాటుపడుతున్నట్లుగా విన్నాను. ఆయన్ని చూడాలనే ఆశ కలిగింది.

## అధ్యాయం - 4

కలకత్తాలో కొన్నాళ్లు ఉండి, తర్వాత బారిసాలు వెళ్లాను. అక్కడ దోవ కనుక్కొని అశ్వినీకుమారదత్తు యింటికి వెళ్లాను. ఇంటి వాకిట ఒక బెంగాలీ బాబు ఉన్నాడు. 'అశ్వినీబాబు ఉన్నారా?' అని ఆయన్ని అడిగాను. 'లేరు. నిన్ననే ఆయన కాశీ వెళ్లారు' అన్నాడు. అరెరె, అనుకుంటూ నేనక్కడే నుంచున్నాను. నాకాషాయాంబరాలను చూసి ఆయన నన్ను సగౌరవంగా లోపలికి తీసుకుపోయి, దాహశాంతి చేసి, 'ఎవరు, ఎక్కడినుంచి' అంటూ నన్నడిగాడు. నేను నా సంగతి అంతా చెప్పి, నా మనస్సులోని కోరికను కూడా బయట పెట్టాను. 'చూడండి బాబు, మనలో అరులో ఒక వంతు మనుషుల్ని మనం అంటరాని వారుగా ఉంచినట్లయితే, ఆ భగవంతుడు మనకు సద్గతి ప్రసాదిస్తాడా?' అని నేనన్నానో లేదో, ఆయన ముఖంలో విచారం ప్రస్ఫుట మయింది. ఆ ముఖం చూస్తే, కళ్లలో నీళ్లు తిరిగేలా అనిపించింది. అంటరాని వారి పరిస్థితిని తలచుకుని ఆయన పరితపిస్తున్నట్లు నే ననుకున్నాను. 'అయ్యా! మీలా ఇంకా ఒక వందమంది ఆర్ద్ర హృదయులు కనక ఉంటే, మనదేశం బాగుపడుతుంది' అన్నాను.

'స్వామీ! తమ రనుకున్నట్లుగా, నా కింకా ఆ తల్లి అంత ఆర్ద్ర హృదయం అనుగ్రహించలేదు. నిమ్న జాతుల వారిని కాపాడవలెననే విషయంలో నేను కొంచెం శ్రద్ధ వహిస్తున్న మాట నిజమే. అశ్వినీబాబుతో కలిసి తక్కువ జాతివారి అభ్యుదయం విషయంలో నేనూ కొంచెం కృషి

చేశాను. అయినా, నా ముఖంలో మీరు చూసిన విచారం మనలో ఆరులో ఒకవంతు మనుషులు ఇలా హీనంగా ఉన్నారే అని అనుకున్నందు వల్ల ఏర్పడింది కాదు. మీరన్న మాటను యిక్కడికి కొన్నాళ్లకు ముసుపు వచ్చిన ఒక 'మంత్రాజియమ్మ' (మదరాసు నుంచి వచ్చిన స్త్రీ) పదే పదే అనేది. మీ మాట వినగానే, నాకు ఆమె పరిస్థితి గుర్తుకి వచ్చింది. అది తలుచుకుని విచారించాను. ఆహా! ఎంత మంచి గుణం! ఏం అందం! అంత చిన్నవయస్సులోనే మన దేశమంటే ఎంత భక్తి!' అంటూ ఉన్న ట్టుండి ఆగిపోయాడు. తర్వాత నావైపు ఒకటి రెండుసార్లు పరీక్షగా చూశాడు. ఆయన పేరు సతీష్ చంద్రబాబు అని అంతకుముందే తెలియ జేశాడు.

'సతీష్‌బాబూ, ఎందుకిలా నన్ను చూస్తున్నారు?' అని అడిగాను. 'స్వామీజీ, క్షమించాలి. మీరా సన్యాసి, మీరే ప్రాంతలో జన్మించారో కూడా నేను తెలుసుకోలేదు. అయినా, మీ ముఖం చూస్తుంటే, ఆమె పోలికలు మీలో ఉన్నట్లు నా కనిపిస్తోంది. మీ యిద్దరి ముఖాలు ఒకటని నేను చెప్పడం లేదు. కాని మీ ముఖంలో ఆమె పోలికలు ఉన్నట్లు మాత్రం నా కనిపిస్తోంది' అన్నాడు.

మదరాసు ప్రాంతపు స్త్రీ అని ఆయన అనగానే, నా మనస్సులో ఏదో సంచలనం బయలుదేరింది. ఆ తర్వాత, ఆయన చెప్పిన మాటలు వినేసరికి, ఆ సంచలనం మరీ ఎక్కువయింది. కాషాయాంబరాలు ధరించాను. చాలా రోజులుగా సన్యాసిగానే ఉంటున్నాను. వేషంలో ఏముందిరా, గోవిందా, వేషంలో ఏముందిరా ?

మీనాంబ.... అబ్బెబ్బె .... మీనాంబాళ్ మరణించి రెండేళ్లు దాటింది.... అయ్యో, నా ప్రేయసి ఎంత యాతన పడిందో .... ఇలా నా మనస్సు రక రకాలుగా ఆలోచించింది.

'సతీష్‌బాబూ! నేనూ మదరాసు ప్రాంతంలో పుట్టినవాణ్ణే, మీరు చెప్పిన ఆ యువతిని గురించి వింటుంటే, మా బంధువుల అమ్మాయి నాకు గుర్తుకి వచ్చింది. మీరు చెప్పిన ఆ యువతి యెవరు? ఆమె పేరేమిటి? ఆమె యిప్పుడు ఎక్కడుంది? ఆమె యే ఉద్దేశంతో యిక్కడికి వచ్చింది? ఆమెను చూసి మీరెందుకు విచారించా మన్నారు? నా కివన్నీ వివరంగా చెప్పాలి' అని అడిగాను.

సతీష్ బాబు కథ మొదలుపెట్టాడు. ఒక్కొక్క వాక్యమూ నా మనస్సనే కొలిమిలో ఇనుపముక్కలు వేసినట్లనిపించింది. ఆయన చెప్పిన కథను వింటుంటే నా మనస్సులో తోచిన భావాలను వివరించడం మొదలుపెడితే పాఠకులకు విరాకు కలగవచ్చు. కనక ఆయన చెప్పిన విషయాలు మాత్రమే తెలియజేస్తాను. నా మనోభిప్రాయాలను పాఠకులే ఊహించగలరు. సతీష్ బాబు చెప్పసాగాడు.

"ఆ యువతిది తంజావూరు. ఆమె పేరు నాకు తెలీదు. మేమంతా ఆమెను 'దీనమాతా' అనే పేరుతో పిలిచేవాళ్లం. ఆమె అసలు పేరు అశ్వినీ బాబుకి తెలుసు. ఆయనే ఆమె వృత్తాంతాన్ని చాలాసార్లు చెప్పారు. ఆయన చెప్పింది మీా కిప్పుడు చెపుతాను, వినండి. ఆమె పింఛనీ దారయిన ఒక పోలీసు ఉద్యోగి కూతురు. మదరాసుకి చెందిన ఆమె మేనత్త కొడుకుతో ఆమెకు వివాహం కూడా నిశ్చయించారట. అతనేమో వందేమాతరం ఉద్యమంలో చేరాడు. ఆ తర్వాత ఆమె తండ్రి మరో పోలీసు ఉద్యోగి కిచ్చి పెళ్ళి చెయ్యాలని నిశ్చయించాడట. చివ్వరి క్షణంలో, కలలో కనిపించిన ఒక దైవం ఆజ్ఞ చొప్పున ఆమె ఏదో ఒక పచ్చాకు తినగానే, భయంకరమైన వ్యాధి ఆమెకు వచ్చిందట. అందువల్ల ఆ వివాహం కాస్తా ఆగిపోయింది. ఆ తర్వాత ఆమె తండ్రి మరణించాడు. ఈలోగా మదరాసుకి చెందిన ఆమె ప్రియుడు ఏ కారణంవల్లనో, ఆమె మరణించిందని తలచి, సన్యాసం స్వీకరించి యిల్లు విడిచి వెళ్ళాడట ...."

'దుర్బలమైన ఓ మనసా! ధైర్యం వహించు. కొంచెంసేపు ఓపికపట్టు.' అని నాకు నేను ధైర్యం చెప్పుకున్నాను. కాని నిగ్రహించుకో లేకపోయాను. 'అయ్యో, మీానా, మీానా' అన్నాను. 'సతీష్ బాబూ! తర్వాత ఆమె ఏమయింది ? చెప్పండి, చెప్పండి' అని ఆదుర్దాగా అడిగాను.

అసలు విషయం కొంచెమైనా తెలిసి వుంటుంది సతీష్‌బాబుకి. 'ఇప్పుడామె బాగానే ఉంది' అన్నాడు.

"లేదు, లేదు .... మీారు నావద్ద నిజం దాస్తున్నారు. నిజం కనక తెలిస్తే, నే నెక్కడ బాధ పడతానో అని నిజం దాస్తున్నారు. అలా చెయ్యకండి; నేను మరీ బాధపడుతున్నాను. చెప్పండి, చెప్పండి' అని ఆయన్ని తొందరపెట్టాను.

మళ్లీ సతీష్‌బాబు ఏవో అర్థంలేని మాటలు చెప్పి, నాకు ధైర్యం చెప్పడానికి ప్రయత్నించాడు.

'భారతమాత మనస్సాక్షిగానూ భగవద్గీత సాక్షిగానూ అడుగుతున్నాను. మీరు నావద్ద నిజం దాచకండి' అన్నాను. ఈ ప్రమాణాలకు నేటి బెంగాలీలు ఎంత ప్రాధాన్యమిస్తారో నాకు తెలుసు. నేనిలా అనడం వల్ల, ఆయనకి కొంచెం కోపం కూడా వచ్చింది.

'పోవయ్యా, మొండి సన్యాసి .... ఎంతెంత మాటలన్నావ్! ఇప్పుడు నిజం చెపుతున్నాను, విను. 'నామశూద్రు'ల్ని కరువుబాధలోంచి కాపాడేందుకు గాను ఆ అమ్మాయి చాలా అవస్థ పడింది. చలిజ్వరం వచ్చింది. ఇక్కడున్న వైద్యులేమో ఆమె మరణించవచ్చునని చెప్పారు. ఆ తర్వాత, కాశీలో మరణించడం మంచిదని ఆమె అభిలషించింది. అశ్వినీబాబు ఆమెను కాశికి తీసుకువెళ్ళారు. ఉన్న విషయం చెప్పాను' అన్నాడు.

"కాశికా?"

'అవును.'

'కాశీలో ఎక్కడ?'

'అశీ ఘట్టంలో.'

'అశీ ఘట్టంలో ఎక్కడ?'

'అశికి దక్షిణంగా నర్వా అనే ఒక ఊరు. అక్కడ చాలా తోటలూ, బంగళాలూ ఉన్నాయి. అక్కడే త్రైపూర్ మహారాజావారి బంగళాలో అశ్వినీ బాబు దిగుతారు.'

'రైలు చార్జీలకు డబ్బు కావాలి' అని అడిగాను. ఒక పదిరూపాయల నోటు నావైపు విసిరేశాడు. మానాభిమానాల కోసం పాకులాడడం దేనికి? అక్కడి నుంచి ఆ మరుక్షణమే బయటికి దారితీశాను. దోవలో మనస్సుని ఆహారంగా, కన్నీటిని పానీయంగా చేసుకుని కాశీ చేరుకున్నాను.

## అధ్యాయం - 5

కాశీలో హనుమాన్ ఘాట్‌లో నాకు తెలిసినవాళ్ళున్నారు. నా స్నేహితుని బంధువులు అక్కడ ఉంటున్నారు. నేను చెప్పబోయే ఆ చోటు కాశీకి వెళ్ళిన తమిళులకు సుపరిచితమైనదే. సాధారణంగా తమిళులంతా హనుమాన్ ఘాటులోనే దిగువారు. అక్కడ కీళమేర్ అనే ఒక సందు ఉంది కదా! అందులో పడమటి వైపునుంచి మూడవ యిల్లు. ఆ యింటికి శివ మఠం అని

పేరు. యాత్రికులు దిగే యిళ్లను కాశీలో మఠములని వ్యవహరిస్తారు. శివ మఠంలో దిగి, స్నానం చేసి, ఆ మఠంవారు పెట్టిన భోజనం చేసి, వెంటనే అక్కడున్న ఒక కుర్రవాణ్ణి వెంటపెట్టుకుని నర్వాఘాటుకి వెళ్లాను. అక్కడ త్రైపూర్ రాజావారి బంగళా ఏదో కనుక్కుని, బంగళా చేరుకునేసరికి రాత్రి ఏడయింది. వాకిట్లో ఒక గుర్రపుబండి ఆగివుంది. అది బయలు దేరేందుకు సిద్ధంగా ఉంది. బండిలో ఇంగ్లీషువారి దుస్తులు ధరించిన ఒక బెంగాలీ ఆయన కూర్చున్నాడు. బండికి పక్కగా ఒక ముసలాయనా, మరి కొందరూ నిలబడివున్నారు. అశ్వినీకుమారదత్తుగారి చిత్ర పటమును నేను చాలా చోట్ల చూశాను కనక, ఆ ముసలాయనే అశ్వినీ బాబు అని గుర్తుపట్టాను. నన్ను చూడగానే అశ్వినీ బాబు తన పక్కనున్న వ్యక్తితో 'ఎవరో ఒక సన్యాసి వచ్చినట్టున్నాడు. ఆయన్ని లోపల కూర్చోపెట్టు, నే నిప్పుడే వస్తాను' అని అన్నాడు. లోపల ఉన్న రెండు కుర్చీలలో ఒకదాని మీద నేనూ, మరోదాని మీద నా వెంట వచ్చిన కుర్రవాడూ కూర్చున్నాము. బండిలోపల కూర్చున్న ఆయనతో అశ్వినీబాబు ఏం మాట్లాడిందీ నాకు బాగా వినిపించింది.

అశ్వినీ బాబు : డాక్టర్‌సాహబ్ ! నిన్నటికంటె యివాళ కొంచెం నయంగా వుందని నే ననుకుంటున్నాను. మీ రేమంటారు ?

డాక్టర్ : చాలా బలహీనంగానే ఉంది. ఇంకా ఇరవైనాలుగు గంటలు కనక దాటితే, ఆ తర్వాత ప్రాణాపాయం వుండదు.

విషం పూసిన అగ్ని బాణంవలె ఆ మాట నాకు వినిపించింది. 'మీనా, మీనా' అని కేకలు పెట్టాను. ఇంతలో బండి బయలుదేరి వెళ్లిపోయింది. నేను నన్ను మరిచిపోయి వేసిన కేకలకు అశ్వినీ బాబు ఆయన వెంట ఉన్న వారూ గబగబ లోపలికి వచ్చారు. వాళ్లు రావడం చూసి నన్ను నేనెలాగో నిగ్రహించుకుని, లేచి నుంచున్నాను. నమస్కరించాను.

'స్వాములవారిది ఏ ఊరు? ఇక్కడికి ఎందుకు వచ్చారు? ఎందుకలా కేకలు వేశారు?' అని హిందూస్తానీలో అడిగాడు.

'బాబూ - నేను సన్యాసిని కాను. నేను దొంగను. నేను మహా దురదృష్ట వంతుణ్ణి. మీనాంబాళ్ మీకు గోవిందరాజన్ అనే పేరు చెప్పివుంటుంది. ఆ పాపిని నేనే' అన్నాను.

వెంటనే ఆయన నన్ను మేడమీది గదిలోకి ఒంటరిగా తీసుకువెళ్లాడు.

నన్నుద్దేశించి ఆయన, 'నిన్నటి రోజంతా నేను మిమ్మల్ని గురించే మాటి మాటికి అనుకున్నాను. మీరిక్కడికి రావచ్చునని కూడా అనుకున్నాను' అని అన్నాడు.

తర్వాత నన్ను తూర్పుముఖంగా తిరిగి కూర్చోమన్నాడు. అలాగే కూర్చున్నాను. కళ్లు మూసుకోమన్నాడు. రెండు కళ్లూ మూసుకున్నాను. ఆ తర్వాత నా నుదురుని చేత్తో తడువుతూ ఆయన ఏదో ఉచ్చరించినట్లు గ్రహించాను. నన్ను నిద్ర ఆవహిస్తోంది. 'అరె . . . ఇంకా మీనాంబాళని నేను చూడలేదు. నా ప్రియసఖి ప్రాణాపాయ స్థితిలో ఉంది. ఆమెను చూడక ముందే నాకిలా నిద్ర వస్తోంది. ఈయన నాకేదో మంత్రం పెట్టాడు. నా ప్రాణ ప్రాణాన్ని చూడనివ్వకుండా ఈయన నాకు అడ్డు తగులుతున్నాడు. ఈయన మంత్రానికి నేను లోబడ కూడదు. కళ్లు తెరిచి, నుంచుటాను.' ఇలా అనుకుని నేను నిలబడడానికి ప్రయత్నించాను. 'హు' అనే శబ్దం విన వచ్చింది. కళ్లు తెరవాలని యెంతగానో ప్రయత్నించాను. కాని కళ్లు తెరిపిళ్లు పడలేదు. మత్తు ఇంకా ఎక్కువయింది. అలాగే నిద్రపోయాను.

నే నలాగే రెండురోజుల పాటు నిద్రపోయానని లేచిన తర్వాత తెలుసు కున్నాను. ఈ సంగతి పక్కనున్న ఒక వ్యక్తి చెప్పాడు. 'మీనా యెక్కడ ? మీనా కులాసాగా ఉందా !' అని అతన్ని అడిగాను. 'నా కేమీ తెలీదు' అని సమాధాన మిచ్చాడు. నేను మామూలు మనిషిగా ఉన్నట్లయితే, అతన్ని బాగా తన్ని, అడ్డు వచ్చిన వాళ్ళను కూడా తన్ని, పరిగెత్తుకొని వెళ్లి మీనాని చూసి వుండేవాణ్ణి. కాని, యిప్పుడు నా శరీరంలో బడలిక, మనస్సులో ఒక ప్రశాంతత నెలకొని వున్నాయి. నా మనస్సులోని జ్వరం కూడా మటుమాయ మయింది. ఇదంతా ఆ ముసలాయన పన్నిన కుట్ర అనుకున్నాను. ఇంతలో అశ్వినీబాబు నేనున్న గదికి వచ్చి, నా కెదురుగా ఒక కుర్చీమీద కూర్చున్నాడు. నాకు తెలియకుండానే నే నాయనకి నమస్కరించాను.

ఓం అంటూ నన్ను ఆశీర్వదించాడు. 'బాల సన్యాసి, కపట సన్యాసి, అర్జున సన్యాసి, త్రాసు నీవైపే మొగ్గింది' అన్నాడు. మీనా గట్టెక్కిందని గ్రహించాను.

'పూర్తిగా గుణం చిక్కినట్లేగదా ?' అని అడిగాను.

'పూర్తిగా గుణం చిక్కింది. ఒక యాభై సంవత్సరాలు, సముద్రంలోకి విసిరేసినా, ఆమె కెలాంటి కీడూ కలగదు.

'అలా అయితే నేను వెళ్లివస్తాను. ఆమె ఎక్కడ కాలధర్మం చేస్తుందో అనే ఆదుర్దా కొద్దీ నేను నా ధర్మం కూడా మరిచిపోయి ఆమెను చూడాలని రెక్కలు కట్టుకుని యిక్కడికి వాలాను. ఇక ఆమెను చూడాలనీ, ఆమెతో పాటు ఉండాలనీ నేను ఆశించడం లేదు. నేను వెళ్లివస్తాను' అన్నాను.

అశ్వినీ బాబు పకపక నవ్వి, పక్కనే ఉన్న పనివాణ్ణి చూసి 'ఈయనికి కొంచెం పాలు తీసుకురా' అన్నాడు. ముఖం కడుక్కునేందుకు కొంచెం నీళ్లూ, తాగేందుకు పాలూ తీసుకు వచ్చాడు. ఆ పాలు తాగిన మరుక్షణం, కుట్రాలం జలపాతం వద్ద స్నానం చేసిన తర్వాత కలిగే సౌఖ్యం కలిగింది నాకు. బడలిక మటుమాయ మయింది. హాయిగా ఉంది.

'ఇప్పుడేమంటావు ? బయలుదేరి వెడతావా ?' అని అశ్వినీ బాబు నవ్వుతూ అడిగాడు.

'ఒక్కసారి ఆమెను చూసి, ఆమెవద్ద సెలవు తీసుకుని వెడతాను' అన్నాను.

ఉన్నట్టుండి అశ్విని బాబు ముఖంలో కనిపించిన చిరునవ్వు మాయ మయింది. తీక్ష్ణత కానవచ్చింది. ఆ తర్వాత ఆయన 'నాయన, నువ్వు మీనాంబాళని పెళ్లి చేసుకో. మీరిద్దరూ కలిసి మెలిసి జీవించండి. పూర్వ కాలంలోని మునిదంపతులు వేదయజ్ఞం చేసినట్లుగా, మీ జీవితాంతం ఆ తల్లి ప్రీత్యర్థంగా జీవ యజ్ఞం చెయ్యండి' అన్నాడు.

'మరి కాళికాదేవి ఆజ్ఞ !' అని అడిగాను. ఈ జన్మలో నువ్వు గోవిందరాజుని పెళ్లి చేసుకోకూడదని ఆనాడు కాళీమాత మీనాంబాళకి చెప్పి, ఆమె చేత విషం తినిపించిన ఆ వృత్తాంతం యావత్తు ఆయనకు వివరించాను.

'ఆ కథంతా నాకు తెలుసు. మహాశక్తి ఆజ్ఞను పూర్తిగా తెలుసుకో కుండానే మీనాంబాళ్ నీకు జాబు వ్రాసింది. ఆమె జీవితం కొత్తదారి తొక్కాలని ఆ తల్లి చెప్పిన మాటకు అర్థం వేరు. ఆమెను పచ్చాకు తినమని ఆజ్ఞాపించడంలోని ఆంతర్యం, తిన్న తర్వాత ఆమెకు జ్వరం రావాలనీ అందువల్ల అనుకున్న పెళ్లి ఆగిపోవాలనీ ఆ తల్లి అభిప్రాయం. అందుకు మునుపు ఆమె జీవితం వేరు ; ఆ తర్వాత జీవితం వేరు. జగజ్జనని స్పష్టం గానే సెలవిచ్చింది. కాని, మీనాంబాళ్ తనకు నచ్చని వాడితో ఎక్కడ వివాహం జరుగుతుందో అనే ఆదుర్దా కొద్దీ నీకు ఏమేమో వ్రాసింది. నువ్వూ తొందరపడి కాషాయవస్త్రాలు ధరించావు. గురుముఖతః నువ్వు సన్యాసం

స్వీకరించలేదు, అయినా, యిదంతా మీ మంచికోసమే జరిగింది. మీ యిద్దరికీ పరిపూర్ణమైన హృదయ నైర్మలం కలగడానికి యీ యెడబాటు తప్పనిసరి అయింది, ఇక నేను వెడతాను. ఇవాళ సాయంకాలం నాలుగింటికి పూలతోటలో లతా మండపంలో నీ రాకకోసం నిరీక్షిస్తూ మీనాంబాళ్ ఉంటుంది' అని ఆయన వెళ్ళిపోయాడు.

సాయం సమయమయింది. నేను సన్యాసి వేషం మార్చుకుని, నా హోదాకి తగిన దుస్తులు ధరించాను. పూల తోటలో లతా మండపంలో ఏకాంతంగా నేను స్త్రీ రూపం దాల్చిన నా ప్రాణమూ సన్నిహితంగా నుంచున్నట్టు గోచరించింది, నాలుగు రేకులు కలసాయి. ఇద్దరు జీవులు జగజ్జనని సేవలో మునిగిపోయారు. ప్రకృతి రూపంలో కానవచ్చిన జగజ్జనని ముఖంలో మందహాసం చిందులాడింది.

వందే మాతరం

## ఊరికే

నిన్న సాయంకాలం నేను మూడో అంతస్తుకి వెళ్ళి ఏకాంతంగా కూర్చున్నాను. నేనున్న ఇంట్లో రెండో అంతస్తునుంచి మూడో అంతస్తుకి మెట్లు లేవు. అద్దె యిల్లు. ఆ యింటి యజమాని సెట్టిగారితో మెట్లు పెట్టించమని ఎన్నోసార్లు మొరపెట్టుకున్నాను. ఇవాళ రేపు అంటూ ఆయన కాలక్షేపం చేస్తూనే ఉన్నాడు. అందువల్ల, మూడో అంతస్తుకి ఎక్కి వెళ్ళడం చాలా యాతన. ఒక చిన్న పిట్టగోడ ఎక్కి, అక్కడినుంచి ఒక మనిషి ఎత్తుకి పైకి వెళ్ళాలి. మూడో అంతస్తు గోడ చివరి భాగాన్ని చేత్తో అదిమి పట్టుకుని పిట్టగోడ మీదినుంచి ఒక్కసారిగా పైకి దూకాలి. అలా పైకి వెళ్ళేటప్పుడు చెయ్యి కనక కొంచెం జారిందంటే కింద పడక తప్పదు; గాయాలూ తప్పవు. అయితే ఏకాంతమంటే నాకు చాలా ఇష్టం. అందువల్ల, యాతనపడి అయినా మూడో అంతస్తు మీదికి వెళ్ళి కూర్చోవడం అలవాటు.

ఈ ధనుర్మాసంలో చలి యెక్కువ కాబట్టి, ఎండ కాచుకోవడానికి అది చాలా వీలుగా ఉంటుంది. ఇలా, నిన్న సాయంకాలం నేను ఎండ కాచుకుంటూ వుండగా, పొట్టిస్వాములవారూ వేణు ముదలీ వచ్చారు. వాళ్లు రెండో అంతస్తుమీద నుంచుని చప్పట్లు కొడుతూ నన్ను పిలిచారు. దిగి రావాలనే ఉద్దేశంతో నేను ధోవతి సవరించుకుంటూ వుండగా, పొట్టిస్వాములవారు నన్నుద్దేశించి 'నువ్వక్కడే ఉండు ; మేమే వస్తాము' అన్నారు.

ఈ పొట్టిస్వాములవారిని గురించి యింతకు మునుపు ఒకసారి వ్రాసినట్లు పాఠకులకు జ్ఞాపకం ఉండవచ్చు. ఆయన కలియుగ జడ భరతుడు. మహా జ్ఞాని. భూతదయ గలవాడు. రాజయోగం ద్వారా శ్వాసను ఆపగల ప్రముఖుడు. చూడడానికి ఆయన బిచ్చగానివలె ఉంటాడు. చినిగిపోయిన గుడ్డలూ ఆయనాను. అలాగే వీధుల్లోనూ తిరుగుతాడు. ఆయన మహిమ ఎలాగో స్త్రీలకూ పిల్లలకూ మాత్రమే తెలిసింది. వీధిలో ఆయన నడిచి వెడుతుంటే, స్త్రీలు చేతులెత్తి నమస్కరిస్తారు. ఆయన్ని చూస్తే బాలు పిల్లలు, తల్లి వద్దకు పరుగెత్తుకు వెళ్లేలా, పరిగెత్తుకు వెళ్లి ఆయన మోకాలు వాసన చూస్తారు. ఆయనేమో ఒక చిరునవ్వు నవ్వి పిల్లల శిరస్సులు వాసన చూస్తాడు. కాని సామాన్యులకు మాత్రం ఆయన మహిమ ఏమిటో తెలియనే తెలియదు. కళ్లు మూసి కళ్లు తెరిచేలోగా పిట్టగోడ మీదికి ఒక్క దూకు దూకి అక్కడినుంచి యింకో దూకు దూకి పై అంతస్తుకి వచ్చేశాడు. ఆయనలా తానూ ప్రయత్నించాలని అనుకున్న వేణు ముదలి జాగ్రత్తగా పైకి రాకుండా ఒక్క దూకు దూకాడు. పిట్టగోడను బాగానే చేరుకున్నాడు. అక్కడినుంచి పై అంతస్తుకి దూకడంలో ఎలాగో జారిపోయి గుభాలున కింద పడ్డాడు. నడుముదగ్గర, మోకాలిమీద మంచి దెబ్బలు. కనిపించని గాయాలు. నా వంటి వాళ్ళయితే ఆ దెబ్బలకు ఎనిమిది రోజులు పడక వెయ్యవలసిందే. కాని వేణు ముదలి మహా బలిష్ఠుడు. అందువల్ల కొన్ని నిమిషాల్లోనే తేరుకున్నాడు. ఎలాగో బాధకు ఓర్చుకుని, మళ్లీ పైకి రావాలని ప్రయత్నించాడు.

అప్పుడు పొట్టిస్వాములవారు నన్ను చూస్తూ 'మనమూ కిందికి వెడదాం' అన్నారు. సరే అని, వేణుముదలిని పైకి ఎక్కవద్దని అతని ప్రయత్నాన్ని వారించి, మేమిద్దరమూ కిందికి వెళ్లాము. రెండో అంతస్తుమీద బయట మూడు కుర్చీలు తెప్పించి కూర్చున్నాము.

'హనుమంతుడిలా అక్కడికి వెళ్లి యేం చేశారు మీరు?' అని వేణుముదలి నన్ను ప్రశ్నించాడు.

'ఊరికే కూర్చున్నాను' అన్నాను.

అంతే, ఎక్కడలేని కోపం వచ్చింది వేణుముదలికి. ఇక ఆరంభించాడు.

'ఊరికే, ఊరికే, ఊరికే కూర్చోవడం బట్టే హిందూ (భారత) దేశం ఇలా పాడయిపోయింది! ఇంకా ఎందుకు ఊరికే కూర్చోవడం? ఎవణ్ణి చూసినా ఈ దేశంలో ఊరికే కూర్చుంటున్నాడు. లక్షలు లక్షలుగా సన్న్యాసులూ స్వాములవార్లూ మొదలైన సోమరి పోతులు మనకు కనిపిస్తారు. గంజాయి తాగడం, బిచ్చమెత్తుకోవడం, ఊరికే తిరగడం – యివే వాళ్ళ పనులు. రెండు పూటలా భోజనం కనక దొరికితే చాలు, అతను ఏ పనీ చెయ్యడు. జమీందారు, మిరాసీదారు, ఈనాందారు, జాగీర్దారు, మఠాధిపతి, రాజులు—వీళ్ళందరికి ఊరికే కూర్చోవడమే పని, వట్టి సోమరిపోతుల దేశం' అని యింకా ఏమిటేమిటో వేణుముదలి చెపుతూండగా, పడమటి దిక్కుగా తిరిగి సూర్యుణ్ణి చూస్తూ పొట్టిస్వాముల వారు, 'ఊరక ఉండుటయే పరిపూర్ణ తత్త్వమని భావింప తరమే మాకు, పరాపరమే' అన్న తాయుమానవ స్వామివారి చరణాన్ని పాడాడు. వేణుముదలి ఆయన వైపు చూస్తూ ఇలా అన్నాడు. 'స్వాములూ! మీరేదో రాజయోగులని కాళిదాసు చెప్పగా నేను విన్నాను. మీతో నేను మాట్లాడలేదు, కాళిదాసుని అడుగుతున్నాను. సన్యాసి నని చెప్పకుంటూ మీ జీవితాన్ని, చెట్టులా, లాభరహితంగా గడిపే ఘట్టాన్ని చేరుకున్నారు మీరు. చెట్టయినా యితరులకు పళ్లు యిస్తుంది, ఆకు లిస్తుంది, వంట చెరుకు యిస్తుంది. మిమ్మల్ని చెట్టుతో పోల్చడం కూడా తప్పే. మీ వల్ల ఇతరులకు నష్టం. కాని చెట్టు వల్ల ఇతరులకు లాభం.'

ఇలా వేణుముదలి చెబుతూవుండగా, పొట్టిస్వాములవారు

'ఊరక ఉండుట సౌఖ్యమని తలచి యెల్లరు
అమ్మ మాటలను అజ్ఞానమున పెడ చెవిని పెట్టి
బ్రహ్మమాటను సైతము త్రోసి రాజని, అవివేకమున
మాయాటవిని అలమటించిరి, అకటా! నా విధి నావశమా!'

అన్న తాయుమానవ స్వామివారి పాట నొకటి పాడారు.

కింద పడిన బాధను సహించలేకపోయాడు వేణుముదలి. అది కోపంగా

రూపు దాల్చింది. పైగా స్వాములవారేమో నవ్వుతూ పాటలు పాడడంతో, అతను మరీ రెచ్చిపోయాడు. వేణుముదలి యిలా అన్నాడు. 'స్వాములూ, మీరు పాతకాలపు వారు. మీతో నేను తర్కానికి దిగ దలచుకోలేదు. నా గొప్పతనం మీకు తెలియదు. నాకు పన్నెండు భాషలు తెలుసు. మీకు తమిళం ఒక్కటే తెలుసు. ఈ యుద్ధం ముగిసిన వెంటనే, నేను అమెరికా, ఐరోపాలు పర్యటించి ఆయాదేశాల్లో హిందూమతాన్ని సుస్థిరం చేస్తాను. వీధుల్లో బిచ్చ మెత్తుకుంటూ, మఠంలో నిద్రించే వ్యక్తి మీరు. మీకూ నాకూ మధ్య మాట లేమిటి? దేశంకోసం పాటుపడుతున్నానని 'హంబగ్' వేస్తున్న యీ కాళిదాసు ఇలా సోమరిపోతు స్వాములవారితో కలిసి కాలక్షేపం చేయడం చూస్తుంటే నా కెంతో ఆశ్చర్యంగా ఉంది. మిమ్మల్ని చూసి కాబోలు ఆయన కూడా ఇలా ఊరికే ఉండే తత్వాన్ని అలవాటు చేసుకుని వుండవచ్చు.'

మళ్ళీ స్వాములవారు తాయుమానవర్ చెప్పిన యీ పాట పాడారు.

'ఊరక ఉన్నప్పుడు సౌఖ్యము కలుగును
ఎందుకురా ఈ మాయాయోగము ?
సాధించునా ఆత్మజ్ఞానము ?
సర్వము కర్మనిష్ఠము, బాలుడవు నీవు.'

వేణుముదలి వెంటనే నావైపు తిరిగి, 'ఏమయ్యా కాళిదాసూ, ఈ స్వాములవారితో నీ కెన్నాళ్ళుగా పరిచయం ?' అని అడిగాడు.

నేను బదులేమీ చెప్పకుండా 'ఊరికే' ఉండిపోయాను. అప్పుడు పొట్టి స్వాములవారు ఇలా చెప్పసాగారు.

అదంతా నేను చెప్పడం మొదలుపెడితే, యీ కథ చాలా పెరుగుతుంది. సంగ్రహంగా చెప్పినా, కనీసం రెండు పుటలైనా చెప్పాలి. నాలుగైదు భాగాలయినా సరే ఫరవాలేదు.

అంత పెద్ద కథను ఈ కాగితం కరువు రోజుల్లో ఎందుకు రాయాలనుకుంటున్నానో, అదొక ఆశ్చర్యకరమైన కథ అని, పోనుపోను మీకే తెలుస్తుంది. అద్భుతమైన కథ. ఇటువంటి కథను నే నింతవరకు వ్రాయలేదు. ఇతరత్రా కూడా నేను చదవలేదు. వింటే మీరూ ఆశ్చర్యపోతారు. గంతులు వేస్తూ ఆడుతారు ; పాడుతారు కూడా. వినని అద్భుతం విన్నాను ; చూడజాలని అద్భుతం చూశాను. అందువల్ల ప్రపంచంలో ఇంతకు మునుపు

వ్రాయబడిన కథలన్నిటిలోకి అద్భుతమైన కథను మీకు వివరించాలని మొదలుపెట్టాను. కాని ఇప్పటికే యిది దీర్ఘమయింది. తరువాతి భాగంలోనే వివరించాలి. నేను మాట తప్పను. రెండవ భాగం వెంటనే ప్రారంభిస్తాను. కొంచెం ఓపిక పట్టండి.

2

పొట్టిస్వాములవారు చెపుతున్నారు. "తమ్ముడూ, విను. ఊరికే ఉండేవాళ్ల వక్షానికి చెందినవాణ్ణి నేను. నువ్వన్నట్లుగా సన్యాసులు ఊరికే కాలక్షేపం చేసుకొంటూ వుండడం వల్ల ఈ దేశం చెడిపోలేదు. అధర్మం ప్రబలడంవల్ల దేశం పాడయిపోయింది. సన్యాసులు మాత్రమే అధర్మానికి లోను కాలేదు. గృహస్థులు కూడా అధర్మానికి పాల్పడుతున్నారు. అది సన్యాసుల్ని కూడా వశం చేసుకుంది. నిజమైన యోగులింకా యీ దేశంలో వున్నారు. వాళ్లవల్లనే యింకా ఈ దేశం సర్వనాశనం కాకుండా ఏదో యింత మాత్రంగానైనా ఉన్నది. ఇప్పుడు లోకమంతా అల్లకల్లోలంగా ఉంది. కాని హిందూదేశం (భారతదేశం) ఊర్ధ్వముఖంగా పయనిస్తోంది ; ఈ అల్లకల్లోలం నుంచి బయట పడింది. లోకాన్ని ఉత్తేజపరచ వచ్చుననే ధైర్యం హిందూ దేశపు మనస్సులో కలిగింది. ఇంతకు మునుపు కూడా ఎన్నో ప్రళయములనుంచి బతికి బయట పడింది. కొన్నాళ్లకు ముందు జగదీశ చంద్రబోసు కలకత్తాలో తమ నూతన ప్రయోగశాలను ప్రారంభిస్తూ ఏం చెప్పాడో చదివావా ! 'బాబిలోనియాలోనూ నైలునదీ తీరాననూ వర్ధిల్లిన నాగరికతలు మరణించి వేరే జన్మలు ఎత్తాయి. హిందూస్తాన్ ఆ నాటివలె నేడూ సజీవంగా ఉంది. ఎందు కంటే ధర్మము లన్నిటిలోనూ గొప్పధర్మమైన ఆత్మత్యాగం ఈ దేశంలో మరణించక యింకా కొంతమందిలో నైనా అది కనిపిస్తోంది' అని ఆయన అన్నాడు."

ఇలా పొట్టిస్వాములవారు చెబుతుంటే వేణుముదలి 'స్వాములూ ! మీకు ఇంగ్లీషు తెలుసా ? మీరు పత్రిక కూడా చదువుతారా ? జగదీశచంద్ర బోసు మాట్లాడిన ఆ సంగతి మీ కెలా తెలిసింది ?' అని అడిగాడు. అందుకు స్వాముల వారిలా అన్నారు : 'అనవసరమైన ప్రశ్న వెయ్యకు. నేను చెప్పే విషయాలన్నీ శ్రద్ధగా విను. హిందూదేశపు జీవనాడిని యుగయుగాలుగా,

సంరక్షించుకుంటూ వచ్చింది ఆ యోగులే. ఈ ఘోర కలిలో ప్రపంచం తలక్రిందులవుతున్న తరుణంలో కూడా హిందూ దేశం పతనం కాకుండా తానూ గట్టెక్క గలిగి, ఇతరుల్ని కూడా సంరక్షించగల ఆ జీవశక్తి ఈ దేశానికి ఉన్నదంటే అందుకు కారణం ఆ యోగుల తపోబలమే తప్ప మరేమీ కాదు. హ, హ, హ, – ఎన్నెన్నో లేహ్యాలు సేవించి, నూరు నూట యాభైమంది భార్యల్ని ఉంచుకుని, ప్రతిరోజూ ఒకరితో ఒకరు కుక్కలవలె పోట్లాడుకుంటూ, హిమాలయాలకు ఉత్తర దిక్కునుంచి పరాయివారు రాగానే అంతా పచ్చిగోడ మాదిరి కిందికి కూలిపోయి తమతమ రాజ్యాలను వారి వశం చేసిన మీ రాజుల శక్తి సంపన్నత వల్ల ఈ దేశం బతికి బయట పడిందనుకుంటున్నావా! తెల్లవారితే సరి ఎవడు మరణిస్తాడు, సపిండీ కరణం బ్రాహ్మణార్థాలకు ఎవరు పిలుస్తారని తిరుగుతూ, అర్థం తెలుసు కోకుండా వేదమంత్రాలను ఊరికే వల్లెవేసే మీ బ్రాహ్మణులవల్ల ఈ దేశం సజీవంగా ఉన్నదని నువ్వనుకుంటున్నావా? మీ వైశ్యుల లోభ గుణం వల్ల ఈ దేశానికి అమరత్వం సిద్ధించిందని అనుకుంటున్నావా? లేక పోతే శూద్రుల మౌఢ్యం వల్ల అనుకుంటున్నావా? ఎందువల్ల హిందూ దేశానికి అమరత్వం సిద్ధించిందని అనుకుంటున్నావు?"

'ఏం వేణుముదలి, బాగా విను. యుద్ధానంతరం అమెరికా, ఐరోపాలు పర్యటించి హిందూ మతాన్ని అక్కడ సుస్థిరం చెయ్యాలని నువ్వు అభిప్రాయ పడుతున్నావు. హిందూదేశంలోని యోగిపుంగవుల మహిమలను తెలుసు కోకుండా నువ్వు ఆయాదేశాలలో ఎలా హిందూమతాన్ని సుస్థిరం చెయ్య గలుగుతావు? ఈ విషయం తలచుకుంటే నాకు నవ్వు వస్తోంది.'

'వేణుముదలి, శ్రద్ధగా విను. హిందూదేశపు యోగిపుంగవుల మహిమ వల్లనే యీ దేశమింకా సజీవంగా ఉంది. ఈ భూలోకం ఉన్నంతవరకూ సజీవంగా వుండేటట్లు చేస్తుంది కూడా. వేణు ముదలి, చూడు, చూడు, చూడు!'

ఇలా స్వాములవారనగానే నేనూ వేణుముదలీ ఆయన వంక పరీక్షగా చూశాము.

పొట్టిస్వాములవారు పొడుగు స్వాములవారయ్యారు!

నాలుగూ ముప్పావు అడుగులున్నట్టుగా కనిపించినా పొట్టిస్వామి ఏడూ ముప్పావు అడుగుల యెత్తుకి పెరిగారు!

ఒక కన్ను చూడడానికి సూర్యునిలా కనిపించిది. మరో కన్ను చంద్రునిలా కనిపించింది. కుడివైపు ముఖం శివునిలా కనిపించింది. ఎడమవైపు ముఖం పార్వతిలా కనిపించింది. వంగితే వినాయకుని ముఖంలా కనిపించింది. తల పైకెత్తినప్పుడు విష్ణుమూర్తి ముఖంలా కనిపించింది. మళ్లీ పొట్టి స్వాములవారు చెప్పడం మొదలుపెట్టారు.

'వేణుముదలి, శ్రద్ధగా విను. నేను హిందూదేశపు యోగులకు నాయకుణ్ణి నేను మహర్షులలో మొదటివాణ్ణి, దేవతలకు నేను అధిపతిని. నేనే బ్రహ్మను, నేనే శివుణ్ణి, నేనే విష్ణుమూర్తిని. హిందూదేశాన్ని పతనం కాకుండా కాపాడుతున్నాను. ఈ భూలోకంలో ధర్మాన్ని సుస్థిరం చేస్తాను.'

'నేను కృతయుగాన్ని నెలకొల్పుతాను. నేనే పరమపురుషుణ్ణి. ఇంతకు పూర్వం ఆచార్యవర్యులు ఏమని సెలవిచ్చారు? జీవకోటి అంతా ఒక్కటే; అందువల్ల కాకి, పురుగు మొదలైన జీవజాలాన్ని దయతో చూడండి - అన్నారు.'

'ఏం వేణుముదలి, విను.'

'శైవాచార్యులు వైష్ణవాన్ని బహిష్కరించారు; వైష్ణవాచార్యులు శైవాన్ని బహిష్కరించారు.

'నే నొకటి చెబుతాను.'

'కాకిని చూసినప్పుడు జాలిపడకు, నమస్కరించు. చేతులు జోడించి నమస్కరించు. కీటకానికి నమస్కరించు. మట్టినీ గాలినీ కూడా నమస్కరించు- అని నేనంటాను.

'ఇంతకు పూర్వం వేదంలో చెప్పబడిన వాక్యాన్ని యిప్పుడు నేను అనుభవంలోకి తెస్తాను. పురాణాల నన్నిటినీ ఏకముఖం చేస్తాను. హిందూ ధర్మాన్ని సమీకరిస్తాను. ఒరేయ్ వేణు ముదలి, విను. మట్టీ, గాలీ, సూర్యుడూ, చంద్రుడూ, నిన్నూ నన్నూ ఆవరించివున్న ప్రాణులూ, నువ్వూ, నేనూ - సర్వం దైవమని వేదం ఘోషిస్తోంది. ఇవే దైవస్వరూపాలు. కడమవి కావు. మన ముందు కనిపించేవాడు నారాయణుడు. ఈ విషయాన్ని మనసులో నెలకొనేటట్లు చేద్దాం. దానికి నమస్కరిద్దాము; సేవిద్దాము. మనల్ని మనం మరిచిపోదాము.

'అప్పుడు మనవద్ద నారాయణుడు నిలబడతాడు. ఈ దోవను నేను అనుసరించినందువల్ల, మానవత్వాన్ని వదలి దేవత్వాన్ని పొందగలిగాను.

కనుకనే నేను అమరుణ్ణి కాగలిగాను. ఇదే దైవం. ఇది మినహా మరో దైవం లేదు. దేవతలలో నేను శ్రేష్ఠుణ్ణి. నా పేరు విష్ణువు. నేనే శివుణ్ణి; శివుని కుమారుడు షణ్ముఖుణ్ణి. నేనే గణపతిని. నేను అల్లాని; యెహెూవాని. నేనే పరిశుద్ధాత్మను; యేసుక్రీస్తుని. నేనే గంధర్వుణ్ణి. నేనే అసురుణ్ణి. నేనే పురుషోత్తముణ్ణి; సర్వజీవరాశిని కూడా!

'పంచభూతములూ నేనే. అహం సత్. నేను కృతయుగాన్ని. ఆజ్ఞాపిస్తున్నాను. కనుక కృతయుగం వస్తుంది. ఏ జంతువూ మరో జంతువుని హింసించక, జంతువులన్నీ యితర జంతువుల్ని దేవతా స్వరూపాలుగా భావించి గౌరవించే విధానం కనక ఏర్పడితే అదే కృతయుగం. దాన్ని నేను కల్పిస్తాను. వేణుముదలి, నేను నీ ముందు నుంచున్నాను. నన్ను తెలుసుకో' అన్నారు పొట్టి స్వాములవారు. నే నీలోపల మూర్ఛపోయాను.

సుమారు అరగంట అయిన తర్వాత నాకు మళ్లీ ప్రజ్ఞ వచ్చింది. అప్పుడు చూశాను. వేణుముదలి నాకు దగ్గరలో మూర్ఛపోయి వున్నాడు. ఉపచారం చేసి అతన్ని లేపాను.

'పొట్టి స్వాములవారెక్కడ?' అని వేణుముదలి నా భార్యను అడిగాడు.

పొట్టి స్వాములవారు ఇలా మెట్లు దిగి వచ్చారు. కొంచెం పాయసమూ ఒక అరటిపండూ ఇచ్చాను. తీసుకున్నారు. పిల్లలకీ నాకూ విభూతి పెట్టి, దీవించి వెళ్లారు. మీరింత సేపు మేడమీద ఏం మాట్లాడుతూ వున్నారని ఆయన్ని అడిగాను. రెట్టభాష అంటే యేమిటని ఆ మూర్ఖుడు వేణుముదలి అడిగాడు— అంటూ నవ్వి వెళ్లిపోయారు' అని ఆమె బదులు చెప్పింది.

## చీకటి

విద్యానగర మనే పట్టణంలో ఎనిమిది వందల యేళ్లకు మునుపు దృఢ చిత్తుడు అనే ఒకరాజు ఉండేవాడు. అతని బంధువులలో కొందరు, పగ కొద్దీ, అతనిని బాధించసాగారు. ఒకరోజు రాజు నిద్రపోతూ వుండగా, అంతఃపుర పరిచారకులు కొందరిని వశం చేసుకుని, విరోధులు లోపలకి

ప్రవేశించారు. అతని కాళ్లు కట్టేసి, దగ్గరలో ఉన్న కొండచరియలో ఒక గుహలో బంధించారు. ఆ గుహ ద్వారాన్ని ఒక పెద్ద బండతో మూసివేశారు. ఇంత జరిగినా అతను కళ్లు తెరవకుండా వుండేందుకు గాను అతని ముక్కులో మత్తు కమ్మే పచ్చాకు పసరు పిండారు.

చాలా సేపయిన తర్వాత, పచ్చాకు పసరు ప్రభావం తగ్గగానే, రాజు కళ్లు తెరిచి చూశాడు. కాళ్లూ చేతులూ కట్టబడి వున్నాయి. తాను కటిక చీకట్లో ఉన్నట్టు గ్రహించాడు. ఎక్కడున్నానా అని ఆలోచించాడు. చోటు ఫలానా అని తెలీదు. నా కెవరు ఈ విధంగా ద్రోహం తలపెట్టి వుంటారు? అని ఆలోచించాడు. ఏమీ సరిగా తెలీలేదు. లేచి నుంచోడానికి ప్రయత్నించాడు. వీలు కాలేదు. దాహం వేసింది. నాలుక పిడచకట్టుకు పోయింది. కళ్లు తిరిగాయి. గుండె కొట్టుకోసాగింది. భగవంతుడా! నన్ను చంపాలని నిశ్చయించావా? అని అరిచాడు.

'అవును' అనే మాట వినవచ్చింది.

'అవునంటున్నావే, నువ్వెవరివి?' అని అడిగాడు.

'నేను యముణ్ణి. నీ ప్రాణం తీసుకుపోవడానికే వచ్చాను' అని ఆ గొంతు మళ్లీ వినిపించింది.

అప్పుడు దృఢచిత్తుడు, 'నేను యౌవనంలో ఉన్నాను. తెలివితేటలూ ప్రేమా గల నా భార్యనూ, సింహ కిశోరం వంటి నా కొడుకునీ, సిరి సంపదలు గల నా దేశాన్నీ విడిచి పెట్టి నీతో రావడానికి నాకు మనస్కరించడం లేదు. ఇక్కడినుంచి వెళ్లిపో' అన్నాడు.

ఆ కంఠం ఫక్కుమని నవ్వింది.

'అయితే నన్నెప్పుడు తీసుకువెడతావు?' అని దృఢచిత్తుడు అడిగాడు.

'ఇంకా ఒక జాములోపల' అని జవాబు వచ్చింది.

ఇది వినగానే దృఢచిత్తుడు బెంబేలు పడిపోయాడు. మునపటికంటె యిప్పుడు కళ్లు మరీ తిరిగాయి. గుండె బాగా కొట్టుకోసాగింది. కాళ్లు వణికాయి.

అప్పు డతనికి వాళ్ల అమ్మ చెప్పిన మంత్ర మొకటి స్ఫురణకు వచ్చింది. వెంటనే ఆ మంత్రం చదివాడు. మరణ సమయంలో ఆమె అతన్ని దగ్గరికి రమ్మని పిలిచి చెవిలో ఆ మంత్రం ఉపదేశించింది. 'నాయనా, నీ కెలాంటి ఆపద వచ్చినా సరే అప్పుడు దీన్ని చదువు ; నీ ఆపద కాస్తా తొలగిపోతుంది'

అని చెప్పింది. ఇప్పుడా మంత్రం చదివాడు. 'కరోమి' (చేస్తాను) అన్నదే ఆ మంత్రం. కరోమి, కరోమి, కరోమి - అని మూడు సార్లు అన్నాడు.

ఒక పాము అతని కాలు కరిచింది.

'అమ్మా, నువ్వు చెప్పిన మంత్రానికి యిదేనా ఫలితం!' అన్నాడు.

'భయపడకు, మంత్రం ఉచ్చరించు. మంత్రం ఉచ్చరించు, మంత్రం ఉచ్చరించు' అని అశరీరవాణి వినవచ్చింది.

ఈ కొత్తకంఠం వింటుంటే అతనికి వాళ్ల అమ్మ గొంతు విన్నట్లనిపించింది.

కరోమి, కరోమి, కరోమి - అని పునః ఉచ్చరించాడు.

'కురు, కురు, కురు (చేయుము)' అని వినిపించింది అశరీరవాణి.

వెంటనే ఊపిరి పీల్చి మహావేగంగా చేతులు విదిల్చాడు. చేతికట్లు తెగిపోయాయి. కరవాలం పైకి తీశాడు. కురు, కురు, కురు అని మళ్లీ వినిపించింది. పాము కరిచిన ఆ కాలి వేలు కోసి విసిరేశాడు. కురు, కురు, కురు - అని మళ్లీ వినిపించింది.

ఒంటిమీద ఉన్న గుడ్డను చింపి, మట్టిలో పొర్లించి, మరీ నెత్తురు కారకుండా దాన్ని కాలికి చుట్టాడు.

మళ్లీ కురు, కురు, కురు అని వినిపించింది. కట్లను కత్తితో కోసేశాడు.

అప్పుడు అతనికి మళ్లీ అలసట వచ్చింది. అలాగే పడిపోయాడు. జ్వరం వచ్చింది. అంతులేని దాహం వేసింది.

'అయ్యో, దాహం భరించలేకపోతున్నాను. ఏం చెయ్యను?' అని బాధ పడ్డాడు.

'మంత్రం జపించు' అని వినిపించింది అశరీరవాణి. 'కరోమి, కరోమి, కరోమి' అని తల్లి చెప్పిన మంత్రం మళ్లీ జపించాడు.

'కురు' అని బదులు వచ్చింది.

'ఏం చెయ్యాలి' అని మథనపడ్డాడు.

'అధైర్య పడకు, పని చెయ్' అని వినిపించింది.

'ఏం చెయ్యాలి?' అని మళ్లీ అడిగాడు.

'ఆ బండను తొలగించు' అని జవాబు వచ్చింది.

లేచి వచ్చి, ద్వారాన్ని మూసివేసిన ఆ బండను తలతో మోటించి తోశాడు. తల పగిలి, ప్రాణాలు పోయినా పరవాలేదనుకుని ఆ పని చేశాడు. తల పగల

లేదు. గుహ ద్వారాన్ని బండతో మూసివేసి వెళ్లే తొందరలో, వాళ్లు బండను సరిగా పెట్టలేదు. అందువల్ల ఆ బండ కాస్తా దొర్లి కింద పడిపోయింది. రాజు బయటికి వచ్చి చూశాడు. సూర్యోదయ మయింది. 'కరోమి, కరోమి, కరోమి' చేస్తాను, చేస్తాను - అంటూ అతను తన రాజధానికి వెళ్లాడు. ఆ తర్వాత అతనికి విరోధులంటూ యెవరూ లేరు.

## కొత్త కోణంగి

(బుడబుక్కలవాడు)

వేదపురంలో కొత్తరకం బుడబుక్కల వాడొకడు బయలుదేరాడు. ఢక్క వాయించడంలో ముప్పయ్యేదు తాళభేదాలూ వాటిలో అంతర్భేదాలూ ప్రదర్శిస్తున్నాడు. తాళం విషయంలో మహాఘటికుడు. ఒంటి మీద బోలెడు గుడ్డలు వేసుకోడు. మంచి తెల్లని ధోవతి కట్టుకుని, తెల్ల చొక్కా వేసుకుంటాడు. ఎర్రని గుడ్డతో వలయాలు వలయాలుగా చుట్టిన పెద్ద తలపాగా ధరిస్తాడు. ఆ తలపాగా చూస్తే నెల్లూరు బియ్యం బస్తాలో సగం ఉంటుంది. నుదుట పెద్ద కుంకుమ బొట్టు. ఆ మీసాలకూ చెంపలకూ తగినట్టుగా విశాలమైన ముఖం. ఎర్రని ఒళ్లు. ఆ ముఖానికి ఆ కుంకుమ బొట్టు ఎంతో నిండుదన మిచ్చింది. సన్నగా ఉంటాడు. బలిష్ఠుడు. కాళ్లకు హైదరాబాదు చెప్పులు. నిన్న పొద్దున అతను మా వీధిలోకి వచ్చాడు. ఢక్కమీద తాన ప్రస్తారం చేస్తున్నాడు. ప్రముఖ మృదంగ విద్వాసునిలా వాయిస్తున్నాడు. ఘటికుడు. అతను అన్నాడు గదా :

'గుడుగుడు గుడుగుడు గుడుగుడు గుడుగుడు
మంచి కాలం వస్తుంది, మంచి కాలం వస్తుంది
జాతులు కలిసిపోతున్నాయి, జగడాలు తొలగిపోతున్నాయి
చెప్పవే చెప్పవే, అంబా జగదంబికా
వేదపురం వారికి మంచి కలుగుతుంది

దారిద్ర్యం తొలగుతుంది, ధనం వస్తుంది.
చదువులు పెరుగుతున్నాయి పాపం తరుగుతోంది
చదువుకున్నవాడు కనక జూద మాడితే
పోతాడు, పోతాడు, నశించిపోతాడు.
వేదపురంలో వ్యాపారం పెరుగుతోంది.
పరిశ్రమ పెరుగుతోంది, కార్మికుడు బాగుపడతాడు.
శాస్త్రం పెరుగుతోంది, సూత్రం తెలుస్తోంది
యంత్రం పెరుగుతోంది తంత్రం పెరుగుతోంది
మంత్రా లెన్నో పెరుగుతున్నాయి, పెరుగుతున్నాయి.
గుడుగుడు గుడుగుడు గుడుగుడు గుడుగుడు
చెప్పవే చెప్పవే చండికా కాళీ
గుడుగుడు గుడుగుడు —'

ఇలా అతను చెప్పుకు పోవడాన్ని పరుపుమీద పడుకున్న నేను విన్నాను. ఇదేమిట్రా కొత్తగా ఉన్నదే వ్యవహారం అనుకుని ఆశ్చర్యపడి, అతన్ని ఆగమన్నాను. ఆగాడు. కిందికి దిగి వచ్చి, అతన్ని దగ్గరకి పిలిచి, 'ఏ ఊరు?' అని అడిగాను. 'సామీ! బుడబుక్కల వాడికి ఊరేమిటి, నాడేమిటి? ఎక్కడో పుట్టాను, ఎక్కడో పెరిగాను, ఎక్కడెక్కడో తిరిగి తిరిగి యిక్కడికి వచ్చాను' అన్నాడు. అప్పుడు నే నన్నాను.

'నిన్ను చూస్తుంటే కొత్తరకం బుడబుక్కలవాడిలా వున్నావు. మామూలు వాడివిలా లేవు. నీ పుట్టుపూర్వోత్తరాలు వీలయినంత వరకూ వివరంగా చెప్పు, నీకు మంచి జరీధోవతి యిస్తాను.'

అందుకు బుడబుక్కలవాడు ఇలా అన్నాడు. 'సామీ, నే నెక్కడ పుట్టానో నాకు తెలీదు. మా అమ్మ ముఖంకూడా చూడలేదు. మా నాన్నగారికిదే వృత్తి. ఆయన దక్షిణాది వాడు. తొమ్మిది కంబళత్తార్ అనేది మా కులం. నా పదోయేట, నన్ను మా నాన్నగారు తంజావూరికి పిలుచుకు వెళ్లారు. అక్కడ మశూచి వచ్చి ఆయన మరణించారు. ఆనాటి నుంచీ నే నిదే వృత్తి వేసుకుంటూ ఎన్నో ఊళ్లు తిరిగి హైదరాబాదు చేరుకున్నాను. అప్పుడు నాకు ఇరవైయేళ్ళు. అక్కడికి జాన్సన్ అనే దొర వచ్చాడు. మంచివాడు, అతను ఒక కంపెనీ ఏజంటు. ఇండియానుంచి బోగం వారు, నట్టువకత్తెలు. ఐంద్రజాలికులు మొదలైన వివిధ వృత్తుల వారిని జీతాలిచ్చి తెల్లవారి

దేశాలకు తీసుకు వెళ్లి వాళ్లచేత ఆటలు ఆడించడం ఆ కంపెనీ వాళ్ల పని. విధివశాన నేను ఆ జాన్సన్ దొర కంపెనీలో చేరాను. ఇంగ్లాండు, ఫ్రాంసు మొదలైన ఐరోపీయ దేశాలలో పర్యటించాను. అమెరికా కూడా వెళ్లాను. రెండేళ్లకు మునుపు - యుద్ధం ప్రారంభ మయ్యేందుకు ముందు - కంపెనీ మూత పడింది. మాకందరికీ డబ్బిచ్చి ఇండియాకి పంపివేశారు మమ్మల్ని. బతికున్నంత దాకా అన్నానికి లోటులేనంత డబ్బు కూడ బెట్టాను. అయి నప్పటికీ మా కులవృత్తిని విడిచిపెట్టడం మంచిది కాదనుకుని, యిక్కడికి వచ్చిన తర్వాత కూడా ఎన్నో ఊళ్లు తిరిగాను.'

'ఐరోపా మొదలైన దేశాలను పర్యటించిన రోజుల్లో యితర పగటి వేషగాళ్లవలె లంకా వృధా చెయ్యకుండా ఆయా దేశాల భాషలు కూడా నేర్చుకున్నాను. నాకు ఇంగ్లీషు బాగా తెలుసు. మరి కొన్ని భాషలు కూడా తెలుసు. చాలా పుస్తకాలు చదివాను. ఇక్కడికి వచ్చిన తరువాత, అక్కడి వారి కంటె యిక్కడి వారు ఎన్నో విషయాలలో వెనకపడి వున్నట్లు తెలుసు కున్నాను.'

'మా కులవృత్తిని ఆధారం చేసుకునే యిక్కడి వారికి వీలయినంతవరకూ కొన్ని విషయాలు వివరించాలని నేనిలా బయలుదేరాను. ఇదే నా వృత్తాంతం.'

ఒక జరీధోవతి యివ్వబోయాను. పోయిన దీపావళికి కొన్నది. మంచిదే.

'సామీ! వద్దు' అని, మళ్లీ ఢక్క వాయించుకుంటూ వెళ్లిపోయాడు. వెడుతూ యిలా మొదలు పెట్టాడు,

'గుడుగుడు గుడుగుడు గుడుగుడు గుడుగుడు.
అయ్యగార్లకు ధైర్యం అధిక మవుతోంది
బొజ్జ కరుగుతోంది ఉత్సాహం పెరుగుతోంది
అష్ట లక్ష్మలు అనుగ్రహిస్తున్నారు
భయం తొలగుతోంది పాపం తొలగుతోంది
శాస్త్రం పెరుగుతోంది జాతి తరుగుతోంది
నిజాయతీ పెరుగుతోంది న్యాయం తెలుస్తోంది
పాత కాలపు పైత్యం తొలగి పోతోంది
వీరత్వం పెరుగుతోంది మంచి కలుగుతోంది
చెప్పవే శక్తి, మలయాళ భగవతీ
ధర్మం పెరుగుతోంది ధర్మం పెరుగుతోంది –'

అంటూ వెళ్లిపోయాడు. అతని వైపు చూస్తూ భగవంతుని స్మరిస్తూ, ఒక నమస్కారం పెట్టాను.

## అర్జునుని సందేహం

హస్తినాపురంలో ద్రోణాచార్యుని పాఠశాలలో పాండుమహారాజు కుమారులూ దుర్యోధనాదులూ చదివేరోజుల్లో, ఒక రోజు సాయంకాలం వేళ వాహ్యాళినుంచి వస్తూ అర్జునుడు కర్ణుని చూసి, 'ఏం కర్ణా! సమరము మంచిదా? శాంతి మంచిదా? అని అడిగాడు. (ఇది మహాభారతంలోని ఒక ఉపకథ; శాస్త్రప్రమాణం కలది; వట్టి కల్పన కాదు.)

'శాంతి మంచిది' అన్నాడు కర్ణుడు.

'కారణం?' అని కిరీటి అడిగాడు.

'ఏమోయ్ అర్జునా, యుద్ధం కనక వస్తే, నేను నీతో పోరాడాలి. అందువల్ల నీకు యిబ్బంది. నాదేమో జాలిగుండె. నీకు కనక కష్టం కలిగితే, నేనది చూసి సహించలేను. కనక మన యిద్దరికీ కష్టం కలుగుతుంది. అందువల్ల శాంతి మంచిది' అని కర్ణుడు చెప్పాడు.

అర్జునుడు ఇలా అన్నాడు. 'కర్ణా! మన యిద్దరిని మనస్సులో ఉంచుకుని నే నీ విషయం అడగలేదు. సాధారణంగా లోకంలో యుద్ధం మంచిదా? శాంతి మంచిదా?' అని అడిగాను.

'ఉమ్మడి విషయాలను గురించి ఆలోచించడంలో నా కంతగా అభిరుచి లేదు' అని బదులు చెప్పాడు కర్ణుడు.

వీణ్ణి చంపి పారవేయాలని అర్జునుడు తన మనస్సులో అనుకున్నాడు. తర్వాత అర్జునుడు ద్రోణాచార్యుల వద్దకు వెళ్లి అదే ప్రశ్న అడిగాడు.

'కలహం మంచిది' అన్నాడు ద్రోణాచార్యుడు.

'ఎందుకు?' అని పార్థుని ప్రశ్న.

అప్పుడు ద్రోణాచార్యుల వారిలా చెప్పారు. 'నాయనా విజయా ! కలహం వల్ల ధనమూ కీర్తి కలుగుతాయి. లేకపోతే మరణం కలుగుతుంది. శాంతి వల్ల అంతా సందేహమే. . .'

ఆ తర్వాత అర్జునుడు భీష్మాచార్యులవారి వద్దకు వెళ్లాడు. 'తాతయ్యా ! పోరూ లాభమా, పొందు లాభమా ?' అని అడిగాడు. అప్పుడా వృద్ధుడు ఇలా బదులు చెప్పాడు. 'బిడ్డా, అర్జునా ! శాంతే మంచిది. యుద్ధంవల్ల మన క్షత్రియకులానికి లాభం ఉంది ; అయితే శాంతి వల్ల లోకానికే లాభం.'

'మీ మాట న్యాయసమ్మతంగా లేదు' అన్నాడు అర్జునుడు.

'మొట్ట మొదట కారణం చెప్పి, ఆ తర్వాత నిర్ణయాన్ని చెప్పాలి అర్జునా' అన్నాడు వృద్ధుడు.

'తాతగారూ, శాంతి వల్ల కర్ణు డేమో పైమెట్టులోనూ నే నే మోకింది మెట్టులోనూ వున్నాము. యుద్ధం కనక వస్తే నిజం బయటపడుతుంది' అన్నాడు.

అందుకు భీష్మాచార్యులవారు, 'నాయనా, ఎప్పుడూ ధర్మానిదే పైచెయ్యి. యుద్ధం వున్నప్పుడు కాని లేనప్పుడుకాని ధర్మమే జయిస్తుంది. అందువల్ల నీ మనస్సులో కోపం చంపుకుని, శాంతిని కోరుకో. మానవు లంతా తోడ బుట్టిన వాళ్లు. వాళ్లు పరస్పరం ప్రేమించుకోవాలి. ప్రేమ తారక మంత్రం. ముమ్మాటికీ చెపుతున్నాను. ప్రేమే తారకమంత్రం' అన్నాడు. ఆయన కళ్లు చెమ్మగిల్లాయి.

కొన్నాళ్లయిన తర్వాత, వేదవ్యాసులవారు హస్తినాపురానికి వచ్చారు. అర్జునుడు ఆయన్ని సమీపించి యుద్ధం మంచిదా, శాంతి మంచిదా ? అని ప్రశ్నించాడు.

'రెండూ మంచివే. సమయానికి తగినట్లుగా వ్యవహరించాలి' అని ఆయన చెప్పాడు.

చాలా సంవత్సరాలకు తరువాతి మాట. వనవాసం చేసే రోజుల్లో దుర్యోధనాదుల వద్దకు రాయబారం పంపించేందుకు ముందు అర్జునుడు, శ్రీకృష్ణుని సమీపించి, 'యుద్ధం మంచిదా ? శాంతి మంచిదా ?' అని అడిగాడు.

అందుకు కృష్ణుడు, 'ప్రస్తుతానికి శాంతి మంచిది. అందువల్లనే నేను శాంతి కోసమని హస్తినాపురానికి బయలుదేరుతున్నాను' అన్నాడట !

# వేపచెట్టు

వసంతకాలంలో నే నొకరోజు పొద్దునపూట మలయగిరి ప్రాంతాన ఒంటరిగా అటూ యిటూ తిరుగుతున్నాను. చాలాదూరం నడిచినందువల్ల నాకు కొంచెం అలసట అనిపించింది. ఆ అలసట తీర్చుకునేందుకు అక్కడున్న ఒక తోపులోకి వెళ్లి, ఒక వేపచెట్టునీడను పడుకున్నాను. గాలి కమ్మగా వీస్తోంది. పడుకున్నకొంచెం సేపటికల్లా మంచినిద్ర పట్టింది. అప్పుడు నాకు వచ్చిన అపూర్వమైన కలను వివరిస్తాను.

నేను పడుకుని వుండగా, 'ఓ నరుడా, ఓ నరుడా లే లే అని అశరీరవాణి ఒకటి వినిపించింది. వినిపించగానే, నేను కళ్లు తెరిచాననుకుంటున్నారేమో, కలలో కళ్లు తెరిచినట్లుగా కలగన్నాను.

'ఎవరు పిలిచారు?' అని అడిగాను.

'నేనే వేపచెట్టుని. నేనే పిలిచాను. లే' అని జవాబు వచ్చింది.

వెంటనే నేను ఆలోచనలో పడ్డాను.

ఇది దయ్యమో, భూతమో, లేకపోతే యక్ష కిన్నర గంధర్వ వర్గానికి చెందిందో, వన దేవత వచ్చిందో — అని యిలా అనుకున్నాను. లేకపోతే వేపచెట్టు ఎక్కడైనా మాట్లాడినట్లు విన్నానా? దయ్యమేమిటి గియ్యమేమిటి. అదంతా వట్టి కట్టుకథ. నేను నిజంగా కళ్లు తెరిచి జాగ్రదావస్థలోకి రాలేదు. ఇంకా కలగంటూనే వున్నాను. ఈ మాటలు కలలో వినిపించిన మాటలు - ఇలా నాలో నేను తర్కించుకుంటూ వుండగా 'నరుడా, లే . . . నిన్నే' అని మళ్లీ వినిపించింది.

'ఎవరు నువ్వు?' అని మళ్లీ అడిగాను.

'నేను వేపచెట్టుని. నా నీడనే నువ్వు పడుకున్నావు. నీకు మంచిసంగతులు కొన్ని చెప్పాలనే వుద్దేశంతో నిన్ను లేపుతున్నాను' అని బదులు వచ్చింది.

అప్పుడు నేనిలా అనుకున్నాను. 'మనకు తెలియని సంగతులు లోకంలో ఎన్నో ఉన్నాయి - అని షేక్స్పియర్ సెలవిచ్చాడు. కనక చెట్లకు మాట్లాడే

శక్తి వుండవచ్చు. ఆ విషయం నా కింతవరకూ తెలిసివుండక పోవచ్చు-అందువల్ల ఈ చెట్టుతో సంభాషణ సాగించి అసలు సంగతి తెలుసుకుందాం అనుకుని కళ్లు తెరిచి నుంచున్నాను. (నిజంగా నుంచోలేదు. లేచి నుంచున్నట్టుగా కల గన్నాను.)

'ఓ వేపచెట్టా - నీ కెలా వచ్చింది యీ మానవ భాష? మనుషులవలె గుండె, గొంతు, నాలుక, పళ్లు, పెదవులు మొదలైనవి లేకుండా మానవభాష మాట్లాడడానికి వీలు కలుగదు గదా! మాలో పళ్లు లేనివారి ఉచ్చారణ సరిగా ఉండదు. కొండనాలుక లేనివారు మూగవారై పోతున్నారు. అటువంటప్పుడు నువ్వు మానవ శరీరం లేకుండానే మానవభాష ఎలా మాట్లాడ గలుగుతున్నావు?' అని అడిగాను.

అప్పుడు వేపచెట్టు యిలా చెప్పింది.

'ఓ నరుడా, విను. మానవుడికి ఒకే నోరుంది. నాకు దేహమంతా నోళ్లే. మానవభాష మాట్లాడడానికి నోరు మొదలైన బాహ్య సాధనాలు మానవులకు వున్నట్లుగా వుండాలని నువ్వనుకుంటున్నావు! సాధారణ పరిస్థితిలో అది అవసరమే. కాని నేను అగస్త్యముని శిష్యుణ్ణి. తమిళభాషలో నాకుగల పాండిత్యం ఈ రోజుల్లో అగస్త్యుల వారికి తప్ప మరెవ్వరికీ లేదు.'

వేపచెట్టు యింకా యిలా చెప్పసాగింది.

'జరిగిన కథను మొదటినుంచి చెపుతాను. నరుడా! శ్రద్ధగా విను. నా కిప్పుడు ముప్ఫయ్యేళ్లు. నేను లేతచెట్టుని. పదిహేను సంవత్సరాలకు మునుపు ఒకరోజు వసంతకాలంలో రాత్రివేళ చక్కని వెన్నెల కాస్తోంది. నేను మేలుకునే వున్నాను. సాధారణంగా మానవుల వలె చెట్లు పగలంతా మేల్కొనే వుంటాయి. రాత్రి కాగానే నిద్రపోతాయి. కాని ఆరోజు రాత్రి ఎందువల్లనో నాకు నిద్ర పట్టలేదు. వెన్నెలనూ, ఆకాశాన్ని, చుట్టూవున్న చెట్టుచేమల్నీ చూస్తూ ఆనందంలో మునిగిపోయాను. అప్పుడు సుందరుడైన పదహారేళ్ల ఒక యువకుడూ (మానవుడు), అతనికంటె బాలా అందగత్తె అయిన పదకొండేళ్ల యువతీ — అదుగో కనిపిస్తోందే — ఆ నదిలో ఆడుతూవుండడం చూశాను. కొంచెం సేపటికల్లా ఆ యిద్దరూ మామూలు మానవులు కారని స్పష్ట మయింది. రెక్కలు లేకుండానే వాళ్లు ఆకాశానికి ఎగిరి క్రీడించడం చూశాను. తర్వాత వాళ్లిద్దరి మాటలను బట్టి వాళ్లు

ఫలానా అని గ్రహించాను. వాళ్ళిద్దరూ అగస్త్యమహర్షి, తామ్రపర్ణి దేవీను. మామూలుగా అయితే, అగస్త్యుడు అంగుష్ఠ మాత్రుడని నాకు తెలుసు. కాని ఆయన కామరూపి. అనగా, అనుకున్నప్పుడు అనుకున్న రూపం ధరించగల డన్నమాట! తామ్రపర్ణిదేవి కూడా అంతే. అందువల్ల వాళ్ళిద్దరూ అప్పుడు అత్యంత మనోహరాకృతులు ధరించి మానవులై ఆటల్లో మునిగివున్నారు. వాళ్ళక్రీడ తెల్లవారుజాము దాకా సాగింది. ఆ తర్వాత తామ్రపర్ణి అదృశ్య మయింది. . . . .'

వేపచెట్టు యింకా చెపుతున్నది. 'నరుడా, విను, శ్రద్ధగా విను. తామ్ర పర్ణిదేవి తెల్లవారగానే అదృశ్య మయింది. అగస్త్యుడు మాత్రం ఒంటరిగా వచ్చి, నా (చెట్టు) మొదట్లో నువ్వు సుంచున్న చోట యోగ నిద్రలో మునిగి పోయాడు. అప్పుడు నాకు అగస్త్యుల వారి శక్తులన్నీ బాగా తెలియవు. అందు వల్ల ఆయన యోగ నిద్రలో ఉన్నట్లు తెలుసుకోలేక పోయిన నేను, జలక్రీడ వల్ల అలసి సొలసి మామూలు నిద్రపోతున్నారని అనుకున్నాను. తెల్లవారి, సుమారు ఒక జామవుతోంది. అప్పుడు, అదుగో నీ కెదురుగా ఒక చింత చెట్టు వున్నది చూశావూ, ఆ చెట్టు మొదట్లో వున్న పుట్టలోంచి ఒక మంచి నాగుపాము బుస్సుమంటూ అగస్త్యులవారు పడుకున్న చోటికి రావడం నేను చూశాను. చూడడం తరువాయి, నేను జడుసుకున్నాను. అయ్యో! ఈ దుష్ట నాగం ఈ మహా పురుషుని చంపనున్నది కదా! ఆయన చేత కళ్లు తెరిపించే టట్లు చేస్తే, ఆయన తన తపశ్శక్తి వల్ల పాముని లొంగ దీసుకుంటారు – అనుకొని నేను నా ఆకుల్ని ఆయన మీద పడేలా చేశాను. ఆయన కళ్లు తెరవాలనే నా ఉద్దేశం. కాని ఆయన కళ్లు తెరవలేదు. ఈ లోగా పాము ఆయన్ని సమీపించింది. పాదాన్ని రెండు సార్లు కరిచింది. మూడోసారి కరవాలని పడగను పైకెత్తింది. సరిగ్గా ఆ సమయానికి ఆయన కళ్లు తెరిచి చూసి, తాడుని పైకి ఎత్తినట్లుగా, పాముని చేత్తో తీసుకుని మెడలో వలయా కారంగా వేసుకున్నాడు. ఆ పాము కూడా తాడులా ఏమీ చెయ్యకుండా మహా సాధువులా ఆయన మెడలో తిష్ఠ వేసింది. అది కరిచిన చోట నెత్తురు కారుతోంది. ఆయన కొంచెము మట్టి తడిమాడు. పుండు ఆరిపోయి మామూలు చర్మ మయింది. ఇది చూసి నేను చాలా ఆశ్చర్య పోయాను. అటువంటి మహనీయునితో ఒక్క మాటయినా మాట్లాడలేని పరిస్థితిలో, మూగ చెట్టుగా జన్మించానే అని చాలా విచారించాను. ఎలాగయినా సరే

నా అభిప్రాయాన్ని ఆయనకి తెలియ జేయాలనే వుద్దేశంతో ఆయన పాదాల మీద కొన్ని పువ్వులూ ఆకులూ రాల్చాను. ఆయన తల పైకెత్తి 'వేప చెట్టూ' అని పిలిచాడు.

వేపచెట్టు తరువాతి కథను వివరించసాగింది.

'నరుడా, విను. శ్రద్ధగా విను. నన్నిలా అగస్త్యుల వారు పిలవగానే, నాకు తెలియకుండానే, నా కొమ్మలలోని నోళ్ల నుంచి 'ఏం మునివర్యా?' అనే తమిళ శబ్దాలు వెలువడ్డాయి. నా శరీర మంతా గగుర్పొడిచింది. మరో జన్మ నెత్త రహస్యం తెలుసుకున్నాను. వేపచెట్టు జన్మ పోయి మానవజన్మ వచ్చినట్లు గ్రహించ గలిగాను. శరీరం మారలేదు. శరీరం మారితే యేం మారకపోతే యేం? నేను శరీరాన్ని కాను; ఆత్మను, నేను జ్ఞాన్నాన్ని. ఉన్నట్లుండి నాకు వేపచెట్టు ఆత్మ తొలగిపోయి మానవాత్మ వచ్చింది. మానవాత్మ రానిదే మానవ భాష మాత్రం ఎలా వస్తుంది? కోటి జన్మలలో నేను పొందవలసిన లాభాన్ని ఆ మునిపుంగవుడు నాకు ఒకే ఒక క్షణంలో ప్రసాదించాడు. అందువల్ల నాకు కలిగిన ఆ ఆనందోత్సాహంలో ఆయన పాదాల మీద ఎన్నో పువ్వులూ ఆకులూ రాల్చాను. ఆయన కూడా సంతోషించి 'ఓ వేపచెట్టా! నిన్న రాత్రి నేనూ తామ్రపర్ణీ యిక్కడ రామనదిలో జలక్రీడలో మునిగి వుండగా ఎంతో సంతోషంతో మమ్మల్ని ఆశీర్వదించావు. నేనావిషయాన్ని నా జ్ఞానదృష్టి వల్ల గ్రహించాను. తర్వాత కొంచెం సేపటికి ముందు నేను యోగనిద్రలో వుండగా ఈ పాము నన్ను సమీపించడం చూసి నన్ను కాపాడాలనే నిమిత్తం నన్ను లేపాలని నా మీద పువ్వులూ ఆకులూ రాల్చావు. ఇలా నువ్వు నాపట్ల చూపిన భక్తికి ప్రత్యుపకారంగా నేను ఋషిజ్ఞానం అనుగ్రహిస్తున్నాను. ఇందువల్ల నీకు సకల జంతువుల భాషలతోను మంచి పరిచయం సహజంగానే కలుగుతుంది. సకల జంతువుల యందూ సమదృష్టి యేర్పడుతుంది. అన్నిటినీ సరిసమానంగా ప్రేమించ గలుగుతావు. అందువల్ల నీకు జీవన్ముక్తి కలుగుతుంది –' అన్నాడు. ఆనాటి నుంచీ ఆయన చెప్పిన శక్తులన్నీ నాకు అలవడినాయి. ఏ చీకూ చింతా లేకుండా, ఏ విధమైన భయమూ లేకుండా, జీవన్ముక్తిని పొంది నివసిస్తున్నాను.''

వెంటనే నేనా వేపచెట్టుకి సాష్టాంగ నమస్కారం చేశాను. 'నీకేం కావాలి?' అని అడిగింది. అప్పుడా వేపచెట్టు నుద్దేశించి, అగస్త్యుల వారు నీ

కెలా గురువో నాకు నువ్వే గురువ్వి. నీకా మహనీయుడు ప్రసాదించిన జీవన్ముక్తిని నాకు నువ్వు అనుగ్రహించాలి' అని ప్రార్థించాను.

'అలాగే' అంది వేపచెట్టు.

ఈ సమయంలో నేను నిజంగానే నిద్రనుంచి లేచి కళ్లు తెరిచి చూశాను. పిచ్చుకలూ మొదలైనవి రకరకాల ధ్వనులు కావిస్తూ ఎగురుతూ ఆటల్లో మునిగి తేలుతున్నాయి. ఉడుతలూ మొదలైనవి అటూ యిటూ పరుగెత్తుతూ వున్నాయి. కాకులు చిలుకలూ గద్దలూ ఇంకా రకరకాల పులుగులూ పిట్టలూ కాంతి ప్రవాహంలో ఈదులాడుతున్నట్టు కనిపించాయి. కంటికి కనిపించకుండా మరుగున వుండి ఒక మగ కోయిలా ఒక ఆడ కోయిలా ప్రేమ గీతాలు ఆలపిస్తున్నాయి.

మగ కోయిల పాడుతోంది :

'తుహూ, తుహూ, తుహూ
తుహూ, తుహూ, తుహూ
రాధా రే'

(దీని భావం :
నీవు నీవు నీవు
నీవు నీవు నీవు
రాధవే)

ఆడ కోయిల పాడుతోంది :

'తుహూ, తుహూ, తుహూ
రాధా కృష్ణ, కృష్ణ, కృష్ణ'

వేపచెట్టు తన మెత్తని ఆకుల్ని ఎండలో మెలమెల్లగా కదిలించ సాగింది. 'ఆశ్చర్యకరమైన కలగన్నాను' అనుకున్నాను మనస్సులో. ఈ లోగా ఎండ ఎక్కువయింది. నాకా ఆకలి వేస్తోంది. వేపచెట్టుకి ఒక నమస్కారం చేసి తోపులోంచి బయటపడి యిల్లు చేరుకున్నాను.

## కాంతామణి

'కాంతామణి, మీా నాన్నగారి పేరేమిటి?' అని అవ్వ అడిగింది. ఒక బావి వద్ద జరిగిన ముచ్చట. ఎండాకాలం. ప్రాతఃకాలం. ఆకాశంలో బాల భానుడు విసుగూ విరామం లేకుండా కిరణాలతో ఆడుకుంటున్నాడు. ఎదురుగా నల్లని కొండ, పచ్చని చెట్లు. ఆవులు. చాలామంది మనుషులు. కొన్ని గాడిదలు. ఎండ దేనిమీాద పడితే, అది మనోహరంగా కనిపిస్తుందని షెల్లీ అనే ఆంగ్లకవి సెలవిచ్చాడు. నాకు ఎప్పుడు చూసినా ప్రతి వస్తువూ మనోహరంగానే కనిపిస్తుంది.

అయితే, పొద్దుటిపూట మనుషుల్లో కొంచెం ఉత్సాహం, చురుకుదనం ఎక్కువ పాలులోనే ఉండడం వల్ల, లోకం చాలా సంతోషకరంగా ఉన్నట్లు కానవస్తుంది.

తోటకు మధ్యగా ఒక బావి. ఆ తోటలో కొన్ని ఎర్రగన్నేరు చెట్లు; కొన్ని మల్లెపూల మొక్కలు. మరికొన్ని గులాబి చెట్లు. పై వీధి వాళ్లు కూడా వచ్చి ఆ బావిలోంచి నీళ్ళు తోడుకొని వెడుతూ వుంటారు.

ఈ కథ ప్రారంభమైన ఆరోజు ఉదయం అక్కడ కాంతామణీ, ఆ అవ్వా కాక, ఒక గుడ్డి ముసలాయన నీళ్ళు తోడుకుని స్నానం చేస్తున్నాడు. పోలీసు వుద్యోగం నుంచి విరమించుకుని తన శేష జీవితాన్ని రామనామ జపం ద్వారా గడుపుదామనుకుని ఆ గ్రామానికి వచ్చిన పార్థసారథి అయ్యంగారు ఒక పక్కగా నిలబడి అవ్వను పరీక్షగా చూస్తున్నాడు.

బావికి దగ్గర్లో ఒక పిట్టగోడ. దాని వెనక ఒక వేపతోట. అక్కడ చాలా మూలికలున్నాయి. వాటిలో ఒకటి చాలా ఆకలి కలిగించేదని నా కొక సన్న్యాసి చెప్పాడు. అందువల్ల ఆ మూలికను తీసుకువద్దామనే వుద్దేశంతో నేనా తోపులోకి వెళ్లాను. ఆకాశ వీధిలో పక్షులు పాడుతున్నాయి. కాకులేమో 'కావు కావు' మంటూ ఉపదేశిస్తున్నాయి. అంతరిక్షాన కాంతి నాట్యం చేస్తున్నది. ఎదురుగా కాంతామణి దివ్యవిగ్రహం కనిపిస్తున్నది.

'మీ నాన్న పేరేమిటి?' అని అవ్వ కాంతామణిని అడిగింది.

'మా నాన్న పేరు పార్థసారథి అయ్యంగారు' అని కాంతామణి పిల్లన గ్రోవిలా ఊదుతూ చెప్పింది. పోలీసు పార్థసారథి అయ్యంగారుని ఒక్కసారి పరీక్షగా చూసింది అవ్వ. పోలీసు పార్థసారథి అయ్యంగారుకి చేతులూ కాళ్లూ వణికాయి. ఆయన తల ముగ్గుబుట్ట అయినా, తొంభైయేళ్ల ముసలి వాడిలా కనిపించినా, ఆయన శరీరం మాత్రం దృఢంగా ఉంది; పదహారేళ్ల సైనికుని శరీరంలా ఉంది. మగపులుల్ని వేటాడడంలో శిక్షణపొందిన వాడని ప్రతీతి. పాము సూటిగా వచ్చి పైబడినా భయపడనని ఆయన నాతో పది పది హేనుసార్లు చెప్పాడు.

అటువంటి వీరాధి వీరుడైన పార్థసారథి అయ్యంగారు కేవలం ఒక అవ్వ చూపులకి అలా వణికిపోవడం చూసి నేను దిగ్భ్రమ చెందాను.

ఆ తర్వాత ఆ అవ్వ పోలీసు పార్థసారథి అయ్యంగారుని వేలితో చూపిస్తూ, 'ఇదిగో నుంచున్నాడే ఆ బ్రాహ్మడు — ఆయనేనా మీ నాన్న?' అని కాంతామణిని అడిగింది.

అందుకు కాంతామణి రెండు చేతులూ పైకెత్తి, పక పక నవ్వుతూ 'అబ్బెబ్బె, ఆయన కాదు; ఆయన నల్లని నలుపుగా అచారిలా ఉన్నాడు – మానాన్న దబ్బ పండులా పచ్చగా ఉంటాడు. ఆయన తల నెరిసిన ముసలి వాడు; మా నాన్న యువకుడు' అంది.

అప్పుడు పార్థసారథి అయ్యంగారు 'మీ నాన్నకు ఏ ఊళ్లో ఉద్యోగం?' అని అడిగాడు.

'మా నాన్న శంకరనాథన్ కోయిల్లో సబిన్‌స్పెక్టరు' అంది కాంతామణి. పార్థసారథి అయ్యంగారు తల ఆడించాడు. సబిన్‌స్పెక్టర్ అని వింటే చాలు ఆయనకి మహా భయం. ఆ తర్వాత అవ్వకూ కాంతామణికి మధ్య ఇలా సంభాషణ సాగింది.

'అక్కా చెల్లెళ్లు మీ రెంతమంది?'

'మా అక్కయ్యకు పద్దెనిమిదేళ్ళు. పోయిన నెలలో శ్రీ వైకుంఠంలో కార్యం జరిగింది. నాకు వచ్చేనెలలో. మా చెల్లెలికి కార్యం జరగాలి. మేము ముగ్గురం ఆడపిల్లలం కావడం మూలాన, మగపిల్లలు లేరని మా నాన్నకి అంతులేని విచారం. ఏం చేస్తాం చెప్పండి. పెరుమాళ్ల అనుగ్రహం ఉండాలి కదా దేనికైనా? మా నాన్న జాతకం చూపించుకున్నారు. మా అమ్మ కింక

మగపిల్లవాడు పుట్టడని ఆ పాడు జ్యోతిష్కుడు చెప్పాడు. అది వేదవాక్య మనుకుని, పిచ్చివాడయిన మా నాన్న వచ్చే నెలలో మన్నారు కోయిల్లో ఒక అమ్మాయిని పెళ్లి చేసుకోడానికి నిశ్చయించుకున్నాడు. లగ్నం కూడా పెట్టుకున్నారు.'

'మన్నారు కోయిల్లో మీ నాన్నకి పిల్లనిచ్చే ఆ మామగారి పేరేమిటి?' అని అవ్వ అడిగింది. 'ఆయన పేరు గోవింద రాజయ్యంగారట! ఆ ఊళ్లో ఆయన పెద్ద భూస్వామట. ఆయనకి ఒకే కుమార్తె. కాళ్ళు మొదలుకుని తలదాకా అంతా బంగారు తొడుగు! రంభ మాదిరిగా ఉంటుందట ఆ అమ్మాయి' అంది కాంతామణి.

'మరి, అటువంటి రంభను, ధనవంతుల బిడ్డను, రెండో పెళ్లివాడికి ఎందుకిస్తున్నారట?' అవ్వ అడిగింది.

'ఆ అమ్మాయి పెద్దమనిషయి మూడేళ్లయిందట. తల్లి యేమో మరణించింది. ఆ అమ్మాయి వేషభాషలూ అన్నీ తెల్లవాళ్ల మాదిరట! అందువల్ల యింతవరకూ దాన్ని పెళ్లి చేసుకోవడానికి ఎవరూ ముందుకి రాలేదు. పెద్దమనిషయిన పిల్లయితే మాత్రమే మనుకుని మా నాన్న ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవడానికి నిశ్చయించుకున్నాడు. నిజానికి మా నాన్నకి మనస్సులో సంతోషమే, పెద్దమనిషయిన పిల్ల దొరుకుతున్నందుకు. ఇవాళ పొద్దున కూడా మా అమ్మా మా నాన్న మాట్లాడుకున్నారు. మేము ఈ వూరి సత్రంలో దిగి ఒక వారం రోజులయింది. మాటల్లో, మా అమ్మ అందిగదా! 'మన్నార్ కోయిల్ అమ్మాయి పెద్దమనిషయి మూడేళ్లయినట్లు ఈ వూళ్లో కూడా అనుకుంటున్నారు. ఆడా మగా అంతా యిదే చెప్పుకుంటున్నారు' అప్పుడు మా నాన్న అన్నాడు గదా: 'నెవర్‌మైండ్. ఆ పిల్ల పెద్దమనిషి కావడం వల్ల మనకు రెండు విధాల లాభం. మనకేమో డబ్బు వస్తుంది. మగపిల్లవాడు పుడతాడు. అమ్మాయేమో అందాల బరిణ. ఇటువంటి విషయంలో ఐ డోన్ట్ కేర్, ఎ డామ్ అబౌట్ శాస్త్రాస్, శాస్త్రాలు నాకు గడ్డిపోచతో సమానం . . . . . .' అని కాంతామణి చెప్పింది.

వీళ్లిలా మాట్లాడుకోవడం నా చెవుల్లో పడింది. నా చూపంతా పోలీసు పార్థసారథి అయ్యంగారి మీద కేంద్రీకృత మయింది. ఆయన్ని అలా చూస్తున్న కొద్దీ, ఉన్నట్టుండి నా మనసులో ఒక ఆలోచన మెరిసింది. అక్కడున్న వాళ్లల్లో కాంతామణి ముఖం నాకు కొత్తది. పార్థసారథి

అయ్యంగారు నాకు తెలుసు. ఆ అవ్వ కూడా తెలుసు. అవ్వ అయ్యంగారుది కాదు. స్మార్తులది. ఆమె ఆ గ్రామం మునుసుబు గారి చెల్లెలు. ఆమెకూ పార్థసారథి అయ్యంగారికీ చిన్నతనంలో ప్రగాఢమైన ప్రేమానుబంధం ఏర్పడిందనీ, అందువల్ల పోలీసు పార్థసారథి అయ్యంగారుకీ మునసబు గారికి యుద్ధాలు జరిగాయనీ, ఆ యుద్ధాలలో ఒకసారి పార్థసారథి అయ్యంగారికి ఒక కంటికి మంచి దెబ్బ తగిలిందనీ, తత్ఫలితంగా అది కాస్తా లొట్ట అయిందనీ నేను విన్నాను. ఆ విషయాలన్నీ గుర్తు చేసుకుంటూనే, ఆ ఆడవాళ్ల మాటలు వింటూన్నంత సేపు అయ్యంగారి ముఖం పాలిపోవడం చూసి, నేను చివరికి యిలా గ్రహించగలిగాను.

అవ్వను చూస్తున్నప్పుడు తమ పాతప్రేమ గుర్తుకి వస్తున్నదనీ, ఆ సంగతిని అవ్వ కిప్పుడు స్పష్టం చెయ్యాలని తాను తహతహ లాడుతున్నట్లు, కాంతామణి వంటి యువతుల్ని చూసినప్పుడు కూడా ఆ అవ్వ ఆకృతి తనకు ప్రత్యక్ష మవుతున్నదనీ — వీటిని అవ్వకు తెలియజేయాలని అయ్యంగారి అభిలాష. అయితే ఆయన హావభావాలలో కొంత నటన కూడా లేకపోలేదు.

ఎందుకంటే, కాంతామణినీ ఆ అవ్వనూ ఒకే చేత్తో సృష్టించిన ఆ బ్రహ్మదేవుడు కూడా కాంతామణి సమక్షంలో అవ్వను చూడడానికి యిష్టపడడు. అటువంటప్పుడు, ప్రేమ వీక్షణాన్ని ఒకే చోట కేంద్రీకృతం చెయ్యడానికి అభిలషించిన పోలీసు పార్థసారథి అయ్యంగారి ప్రయత్నం నమ్మదగింది కాదు.

ఇక్కడ మరో విషయం కూడా ప్రస్తావించాలి. నేను చెట్టు చాటునుంచి అయ్యంగారు వాలకాన్ని గమనిస్తున్నట్లుగానే కాంతామణీ ఆ అవ్వా మాటి మాటికీ ఓరచూపులతో ఆయన్ని గమనిస్తూనే వున్నారు. ఆడవాళ్లవి పాము చెవులు. గద్ద చూపుకంటె యింకా తీక్ష్ణమైన చూపు. కాగా పార్థసారథి అయ్యంగారి అంతస్తత్వాన్ని నేను గ్రహించినట్లుగానే, వాళ్లూ గ్రహించ గలిగారని వాళ్ల ముఖ కవళికలను బట్టి నేను తెలుసుకున్నాను.

నన్ను మాత్రం ఆ ముగ్గురిలో ఎవరూ చూడలేదు. చెట్టు చేమల చాటున వున్నాను కాబట్టి వాళ్ళు నన్ను గమనించి వుండరు.

ఇలా ఉండగా, అక్కడికి ఒక యిరవైయేళ్ల మలయాళీ కుర్రవాడు యింగువ తీసుకుని వచ్చాడు. చిల్లరగా యింగువ అమ్ముకోవడం అతని వృత్తి. అతను చాలాసార్లు యింగువ అమ్ముకోవడానికి ఆ గ్రామానికి రావడం నేను

చూశాను. అయితే అతన్ని గురించి ఎన్నడూ వాకబు చెయ్యలేదు. చూడ డానికి మన్మథుడిలా ఉంటాడు. నల్లని కళ్లు, కోటేరు లాంటి ముక్కూ, ఉంగరాలు తిరిగిన పిలక జుట్టు - అతన్ని చూస్తుంటే నాకే అతని మీద మోహం పుట్టుకు వచ్చింది.

ఆ మలయాళీ బావి వద్దకు వచ్చి తాగడానికి మంచి నీళ్లిమ్మని అవ్వను అడిగాడు. అతన్ని చూసిందో లేదో కాంతామణి వణికి పోవడాన్ని నేను గమనించాను. ఆ తరువాత ఆ మలయాళీ కాంతామణిని ఒక్కసారి ఎగాదిగా చూశాడు. ఆమె తన చంకనున్న బిందెని నీళ్లతో కిందికి జారవిడిచింది. అది దభాలున పడింది. వంగి దాన్ని తీస్తూ కాంతామణి, 'అయ్యో, నే నిప్పుడేం చెయ్యను? అరంగుళం సొట్ట పోయిందే యిది, మా అమ్మ యివాళ నాకు ఉరిశిక్ష విధిస్తుందే?' అని నిట్టూర్పు విడిచింది.

ఆమె పమిట కొంగు తొలగింది. పొదియల్ కొండ వరుసల్ని చూడ సాగింది.

ఆ మలయాళీ కుర్రవాణ్ణి కాంతామణి హద్దుమీరి ప్రేమించినట్లు నేను గ్రహించక పోలేదు. ఆ తరువాత వాకబు చెయ్యగా తెలియ వచ్చిం దేమిటంటే: కాంతామణి తండ్రి పార్థసారథి అయ్యంగారు చాలా కాలం మలబారులో ఉద్యోగం చేశాడనీ, ఆ రోజుల్లో చిన్నతనం నుంచే ఆ మలయాళీ కుర్రవాడూ కాంతామణీ ఒకరినొకరు ప్రేమించుకున్నారనీ, ఆ ప్రేమ దినదినాభివృద్ధి చెందిందనీ తెలిసింది. సబిన్‌స్పెక్టరు అయ్యంగారు డబ్బు కోసమని కాంతామణిని పింఛనీ దారయిన డిప్టీ కలెక్టరూ కందలా పురం జమీందారు గారి దివానూ అయిన యాభై అయిదేళ్ల కోళంబాడు శ్రీనివాసాచారియార్ అనే ఆయన కిచ్చి వివాహం చేశాడు. ఆ శ్రీనివాసా చారియారుతో కాపరం చెయ్యడానికి కాంతామణికి నచ్చలేదు. ఈ విషయాలన్నీ ఆ తర్వాతనే నాకు తెలిశాయి.

ఆ రోజు బావి వద్ద నా కళ్లముందు జరిగిన మిగిలిన విషయాలను కూడా చెబుతాను. కాంతామణి బిందెను చంకను పెట్టుకుని 'ఇవాళ మా అమ్మ నన్ను శాపనార్థాలు పెడుతుంది; ఏం చెయ్యను?' అని యేడుస్తూ వెళ్లిపోయింది. అయితే ఆమె వాళ్ళున్న సత్రం వైపుగా వెళ్లలేదు. ఆ గ్రామానికి పశ్చిమంగా వున్న నది వద్దకు దారి తీసింది. మంచి నీళ్ళు తాగి దాహం తీర్చుకున్న ఆ మలయాళీ కూడా ఆ ఏటి ఒడ్డుకి దారి తీశాడు. ఈ లోగా సంధ్యా వందన

సమయం దాటిపోవడం వల్ల, నూ అనే బావి వద్దనుంచి యింటి ముఖం పట్టాను. ఆ రోజు సాయంకాలం మా యింటికి ఆ ఊరి బడి పంతులు సుందరశాస్త్రి గారు వచ్చారు. వచ్చీ రావడంతోనే ఆయన, 'విన్నారా! యీ సంగతి. ఎంత ఆశ్చర్యం, ఎంత ఆశ్చర్యం!' అంటూ వాపోయాడు.

'ఏమిటయ్యా అంత ఆశ్చర్యం! మొట్టమొదట ఆ సంగతేమిటో చెప్పి ఆ తర్వాత అఘోరిద్దురు గాని' అన్నాను.

'సత్రంలో సబిన్స్పెక్టరు పార్థసారథి అయ్యంగారు - శంకరనాథన్ కోయిల్ నుంచి వచ్చాడు చూశారూ .... ఆయనతోపాటు వాళ్ల అమ్మాయి కూడా వచ్చింది. ఆ అమ్మాయి చాలా అందగత్తెట! తిలోత్తమ, రంభ మొదలైన వాళ్లంతా ఆ అందం ముందు బలాదూరట! ఆ అమ్మాయి పేరు కాంతామణి. చెబుతుంటేనే నాలుక లొట్టలు వేస్తోంది. కాంతామణి, కాంతామణి, ఎంత చక్కని పేరు .... ఎంత ముద్దుగా వుంది. ....'

ఇలా సుందరశాస్త్రి కాంతామణిని వర్ణిస్తుంటే నే నాయనకి అడ్డు తగిలి, 'ఆ తర్వాత ఏం జరిగిందో చెప్పవయ్యా' అన్నాను.

'ఆ కాంతామణి పొద్దుటి నుంచి కనిపించడం లేదనివెతుకుతున్నారు. ఇప్పుడే అంబాసముద్రం నుంచి టెలిగ్రాం వచ్చింది. ఇవాళ మధ్యాహ్నం మూడింటికి ఆ కాంతామణి ఒక మలయాళీ కుర్రవాణ్ణి ఒక చర్చిలో వివాహం చేసుకున్నట్లు ఆ టెలిగ్రాంలో ఉందట' అన్నాడు.

కొన్నాళ్లకు తర్వాత యింకొక వింత జరిగింది. మాజీ పోలీసు వుద్యోగీ, తల నెరిసిన పార్థసారథి అయ్యంగారూ, ఆ రోజు బావి వద్ద ఆయన ప్రేమ వీక్షణాలకు బంది అయిన ఆ అవ్వా కలిసి రంగూనుకి పారిపోయారు. ఆ తర్వాత ఆ అవ్వ జుట్టు పెంచుకున్నదనీ పార్థసారథి అయ్యంగారూ ఆమె దంపతులుగా కాపరం చేస్తున్నారనీ, అయ్యంగారు అక్కడ ఒక నాటుకోట సెట్టిగారి దగ్గర పని చూస్తున్నారనీ, మంచి జీతం వస్తున్నదనీ, హాయిగా వాళ్లిద్దరూ కాలక్షేపం చేస్తున్నారనీ రంగూను నుంచి తెలియవచ్చింది.

# ఉజ్జయిని

"మనం శక్తి ధర్మాన్ని అనుసరిస్తున్నాము. నాకు నువ్వే శక్తివి. నువ్వు కనక మరణిస్తే, నేను సహగమనం చేస్తాను' అని విక్రమాదిత్య మహారాజు తన సర్వస్వమైన శ్రీముఖితో చెప్పాడు. అప్పు డామె, 'ఉజ్జయినీ నగరంలోని మహాకాళి అనుగ్రహంవల్ల నీకు వెయ్యి సంవత్సరాల ఆయుస్సు వుంది. ఒకవేళ వెయ్యిలో ఒక యేడు కనక తక్కువయితే నేనూ వుంటాను' అంది.

'నాకు ఆయుస్సు తొమ్మిదివందల తొంభై తొమ్మిదేళ్లే అనుకుంటాను' అని విక్రమాదిత్యుడు నిట్టూర్పు విడిచాడు.

'నువ్వు నా కుమారుడివి. నా మాట విను. ధర్మ మన్నది స్త్రీ వల్ల యేర్పాటు చేయబడింది. వ్రతం, నోము, పూజ, ఆహారం, ఇల్లు, బడి - అన్నిటినీ యేర్పాటు చేసింది స్త్రీయే. ధర్మం స్త్రీ వల్ల కలుగుతోంది. స్త్రీ తల్లి. స్త్రీ తనలో అర్ధ భాగమని తలవక, ఆమె తనకు లోబడి వుండాలనీ, అర్ధ భాగమని గౌరవించకుండాను పురుషుడు బహుకాలంగా వ్యవహరిస్తున్నాడు. అందువల్ల స్త్రీ పురుషుని మీద పగ తీర్చుకుంటోంది. అలా పగ సాధించడం మూలాన, ఆ దుఃఖంలో ఆమె కూడా మరణిస్తోంది.

'శివుడు సగం, శక్తి సగం. ఆ విధంగా అర్ధ భాగమని ఎప్పుడైతే పురుషుడు స్త్రీని భావిస్తాడో, అప్పుడు పురుషుడికి ఎక్కడ లేని బలం కలుగుతుంది. కలియుగాంతంలో ఇది ముమ్మాటికి సంభవిస్తుంది' అని ఆమె అన్నది.

'అప్పుడు మన మహాకాళికి పేరేమిటి?' అని విక్రమాదిత్యుడు అడిగాడు.

అందుకు శ్రీముఖి యిలా చెప్పింది. 'అప్పుడు మహాకాళికి నిత్యకళ్యాణి ఉజ్జయిని అనిపేరు.'

'ఇందుకు ఎవరెవరు సాక్షులు?' అడిగాడు విక్రమాదిత్యుడు.

'దేవతలు సాక్షి; పంచభూతాలు సాక్షి. మనుష్య, మృగ, పక్షి, కీట కాదులు సాక్షి. ఇందుకు ఆ మహాకాళియే సాక్షి' అని శ్రీముఖి చెప్పింది.

'సరే' అని విక్రమాదిత్యుడు మౌనం వహించాడు. ఆ మరునాడు ఉదయం ఇద్దరూ ఆలయానికి వెళ్లారు. కాళికాదేవి కిరీటం మీద నిత్యకల్యాణి ఉజ్జయిని అని వజ్రపుటక్షరాలలో వ్రాయబడి వుంది. అది చూసి యిద్దరూ ఆనందించారు. దేవిని ఆరాధించారు. ఆ మరునాడు విక్రమాదిత్యుడు తన అంతఃపురంలో ఒక బంగారు స్తంభం నాటి దానిమీద 'కన్యను అభిలషించే వారు కళ్లను అభిలషిస్తారు. స్త్రీకి కళ్ళు వున్నాయి. స్త్రీ తల్లి. వందే మాతరం' అని వ్రాయించాడు. ఈ కథ శాక్త శాస్త్రంలో ఉల్లేఖించబడింది. లోకోపకారార్థం ఈ కథను వివరించాను.

## సముద్రం

ఒకరోజు సాయంకాలం నేను వేదపురం సముద్రతీరాన ఏకాంతంగా ఇసుక మీద పడుకున్నాను. మధ్యాహ్నం చాలా దూరం నడిచినందువల్ల కలిగిన ఆయాసం కారణంగా పడుకున్నానో లేదో అలాగే నిద్ర పట్టింది. ఆ నిద్రలో వచ్చిన కలను వివరిస్తున్నాను.

నట్టనడి సముద్రంలో ఒక ద్వీపం. దాని మధ్య పెద్ద అంతఃపురం. అంతఃపురానికి దగ్గర్లో సుందరోద్యానం. అందులో ఒక జలయంత్రం. దానికి దగ్గరగా పచ్చిక నేల మీద పదహారేళ్ల కన్నెపడుచు కూర్చుని వుంది. నన్ను చూసిందే తడవుగా ఆమె గబుక్కున లేచి అంతఃపురంలోకి పారిపోయింది. నేనామెను అనుసరించాను. దోవలో ఒక పెద్ద పాము. నన్ను చూసిన వెంటనే అది పడగ విప్పి కరవడానికి నా మీదికి రాబోయింది. నేను పరుగెత్తాను. అది నన్ను తరుముకుంటూ వచ్చింది. పరుగెత్తి పరుగెత్తి సముద్రతీరం చేరుకున్నాను. పాము కాళ్ల దగ్గరికి వచ్చింది. సముద్రంలోకి దూకాను. సముద్రంలో తుఫాను వల్ల ఒక అల లేచి మూడు తాటిచెట్ల దూరానికి వెళ్ళి పడింది. మరొక అల మూడు తాటిచెట్ల లోతున పడింది. ఎలాగో ఆ అలలధాటికి తట్టుకున్నాను. చాలాసేపటికి అలల హెూరు తగ్గింది. ఈత కొడుతూనే వున్నాను. ఎలాగో ఈదుకుంటూ వస్తున్నాను. కాని తీరం మాత్రం కనిపించలేదు. ఆ తర్వాత చేతులలో నొప్పి బయలు దేరింది. నేనింక ఈదలేక పోయాను. నా కులదైవం పేరు స్మరించాను. ఒక

వృద్ధుడు పడవ నడుపుకుంటూ అక్కడికి వచ్చాడు. 'బాబూ, బాబూ నన్ను నీ పడవలో యెక్కించుకో. తుఫాను దెబ్బకి నేను చాలా నలిగిపోయాను' అని మొర పెట్టుకున్నాను. అతను నన్ను తన పడవలోకి ఎక్కించుకున్నాడు. పడవ నడుపుకుంటూ సముద్రంలో వెడుతున్నాము. తీరం ఎక్కడా కనిపించడం లేదు. 'బాబూ, ఒడ్డు ఎప్పట్లో చేరుకుంటాము?' అని అడిగాను. ఆ వృద్ధుడు కొంచెం బియ్యపు పిండీ, ఒక పాత్రలో మంచినీళ్ళు యిచ్చి, తినమన్నాడు. బాగా అలసి వుండడంవల్ల, నిద్ర ముంచుకు వచ్చింది. (కలలోనే ఒక నిద్ర.) బడలిక తగ్గగానే, కళ్ళు తెరచి చూశాను. ఒడ్డు తెలియవచ్చింది. నన్ను ఒడ్డున దిగమని చెప్పి, ఆ వృద్ధుడు పడవ నడుపుకుంటూ మళ్ళీ సముద్రంలోకి వెళ్లాడు.

నే నతనిని ఏవేవో ప్రశ్నలు అడిగాను. అతను దేనికీ జవాబు చెప్పలేదు. కనిపించినంత వరకూ పడవను చూస్తూనే వున్నాను. ఆ ద్వీపంలో కొంచెం దూరం వెళ్లేసరికి, మళ్లీ ఆ అంతఃపురం కనిపించింది. దానికి దగ్గరగా సుందరోద్యానం, ఆ జలయంత్రం, ఆ అమ్మాయి అలాగే పచ్చిక నేలమీద కూర్చుని వుండడం — చూశాను. నన్ను చూసిందో లేదో ఆమె లోపలికి పరుగుతీసింది. అయితే యీసారి నే నామెను అనుసరించ లేదు. అలా వెడితే, దోవలో ఆ పాము మళ్లీ కనిపిస్తుందనే భయంతో, మళ్ళీ సముద్ర తీరం వైపుగా ఎక్కడలేని వేగంతో పరిగెత్తాను. పరిగెత్తేటప్పుడు పాము రాలేదు. ఒడ్డుకి రాగానే, ఈ ద్వీపం లోంచి ఎలా బయటపడడమా అని ఆలోచించాను. ఆ అమ్మాయి యెవరో మొట్టమొదట తెలుసుకుని, ఆ తర్వాత అక్కడినుంచి బయలుదేరాలని తర్వాత అనుకున్నాను. కాని ఒకవైపు ఆకలి మరొకవైపు బడలిక. వీటిని తీర్చుకుని బయలుదేరుదా మనుకున్నాను. అటూ యిటూ తిరిగి చూశాను. ఒడ్డు వెంబడి చాలాదూరం నడవగా, నడవగా ఒక గుడిసె కనిపించింది. ఆ గుడిసెలోకి వెళ్లాను. లోపల ఒక వినాయకుడి విగ్రహం. విగ్రహానికి ముందు ఒక విస్తరిలో అన్నం, కూర, పాయసం, పిండి వంటలు మొదలైనవి వున్నాయి. విస్తరి పక్కన ఒక బిందెలో మంచి నీళ్ళు, పువ్వులు, గంధం మొదలైన పూజాద్రవ్యాలూ ఉన్నాయి. ఆకలి బాధను సహించలేని నేను ఆ పదార్థాలను స్వాహా చేద్దామా అనుకున్నాను. ఇంతలో మళ్ళీ ఒక ఆలోచన. పోయిన జన్మలో ఏం పాపం చేశానో, ఈ జన్మలో యీ ద్వీపానికి రావడం యిక్కడ యాతన పడడం జరుగుతోంది.

ఆకలి బాధకు లోనయి, ఏ పుణ్యాత్ముడో పూజకోసమని యివన్నీ యిక్కడ యేర్పాటు చేసుకున్న వాటిని నేను స్వాహా చేయడం మహా పాపమనుకున్నాను. అందువల్ల వాటిని తాకరాదని నిర్ణయించుకున్నాను. ఆకలి మరీ ఎక్కువయింది. పోనీ నేనే ఆ పూజ చేసి, నైవేద్యం పెట్టి, తర్వాత భోజనం చేద్దామనుకున్నాను. స్నానం చేసే చోటు ఎక్కడైనా కనిపిస్తుందా అని వెతగ్గా, కొంచెం దూరంలో ఒక కోన కనిపించింది. అందులో స్నానం చేసి, సంధ్యా వందనం మొదలైన వాటిని ముగించుకుని, మళ్ళీ గుడిసెలోకి వచ్చి చూద్దును గదా, వినాయకుడి విగ్రహం మాత్రమే ఉంది. అన్నం, గారెలు, మంచినీళ్ళు, పువ్వులు, గంధం – ఏవీ లేవు. నాకు ఎక్కడలేని చిరాకు కలిగింది. 'ఓ గణపతీ, గణపతీ, నేను మా వేదపురం చేరగానే నీకు ముప్ఫయి మూడు టెంకాయలు కొట్టి, పూజ చేస్తాను. నాకీ విపత్సమయంలో నువ్వు సహాయం చెయ్యవా !' అని ప్రార్థించాను.

ఈ స్థితిలో నా కలకు అంతరాయం కలిగింది. ఎన్నో ఉపద్రవాలు. అన్నీ సరిగా జ్ఞాపకం లేవు. మళ్ళీ నేను సముద్రపుటలల మీద తేలియాడుతూ వెళ్ళడం చూశాను. ఏదో ప్రళయం మాదిరి కనిపించింది. చేతులు మొద్దు బారినాయి. కళ్ళు కనిపించలేదు. ప్రజ్ఞ లేదు. సముద్రాన్ని క్రమక్రమంగా నాశనం చెయ్యాలనే తలంపుతో గాలి వీస్తున్నట్లుగా నా కనిపించింది. అలలు నా శరీరాన్ని బంతిగా చేసుకున్నాయి. నా ప్రాణాన్ని యమదూతలు బంతిగా చేసుకుని ఆడుతున్నట్లు అనిపించింది. మళ్ళీ నేను మా కులదైవం పేరు స్మరించాను. వినాయకుణ్ణి స్మరిస్తూ 'ఓ గణపతీ! నన్ను కనుక వేదపురం సముద్ర తీరం చేర్చావంటే నీకు మూడు వేల మూడు వందల టెంకాయలు కొడతాను. నన్ను కాపాడాలి, కాపాడాలి' అని మొక్కుకున్నాను. కొంచెం సేపటికల్లా తుఫాను ఆగిపోయింది. నా ముందు ఒక పడవ కనిపించింది. ఆ పడవ ఎంత అందమయిందో చెప్పలేను. నెమలి ఆకారంలో ఉంది. బంగారం రంగులో ఉంది. హంస ఈదుకుంటూ వచ్చినట్లుగా, ఆ పడవ మెలమెల్లగా నా వద్దకు వచ్చింది. అందులో ఒక బాలుడు కూర్చుని వున్నాడు. అతని ముఖ వర్చస్సు కొట్టి వచ్చినట్టుగా ఉంది. పడవను చూసిన వెంటనే నేను చేతులు జోడించాను. పడవలోకి ఎక్కించుకోవలిసిందిగా పడవవాణ్ణి ఆ బాలుడు ఆజ్ఞాపించాడు. వాళ్ళు నన్ను ఎక్కించుకున్నారు. పడవ ఎక్కిన వెంటనే నా మానసిక, శారీరక దుఃఖములన్నీ తొలగిపోయినాయి. నేను రాజోచిత

మైన దుస్తులు ధరించాను. పదహారేళ్ల పడుచువాడిలా కనిపించాను. పడవ మధ్యలో ఉన్న రాజుగారి చేతిలో వేలాయుధం (సుబ్రహ్మణ్య స్వామి చేత ధరించే ఆయుధం) కనిపించింది. అప్పుడు కళ్ళు తెరిచాను. వేదపురం సముద్రతీరం. సాయం సమయం. ఇసుక మీద నేను పడుకొని ఉన్నాను.

నమ్మకం కలగలేదు. కళ్ళు బాగా నులుపుకొని చూశాను. ద్వీపమూ తుఫానూ కల అని తెలుసుకున్నాను. ఆ ద్వీపంలో నన్ను చూసిన వెంటనే పరుగెత్తుకుపోయి అదృశ్యమైన ఆ యువతి నా కళ్ల ముందు నుంచిని వున్నట్లు గ్రహించాను. తర్వాత పడవలో కనిపించిన రాజుగారి ఆకృతి కూడా తెలియవచ్చింది. ఇల్లు చేరుకున్నాను.

వేదపురంలో మౌనస్వాముల వారని ఒకాయన ఉన్నారు. ఆయనకి నా స్వప్న వృత్తాంతం వివరించి, ఆ ద్వీపంలో నేను చూసిన యువతి ఎవరని అడిగాను. 'ఆ అమ్మాయి నిన్ను ప్రేమించింది. నిన్నెవరు కాపాడారో నువ్వు తెలుసుకోలేదు. రెండోసారి పడవలో యువరాజు చేతిలో వేలాయుధం ఉండడం చూశావా ? అదే నీకు స్త్రీ రూపంగా కనిపించింది. నిన్ను సముద్రంలో తోసిన స్త్రీయే తరువాత వేలాయుధంగా కనిపించి నిన్ను కష్టాల నుంచి కాపాడింది' అని ఆయన చెప్పాడు. శక్తియే వేలాయుధమనీ, అదే జీవితానికి తోడు నీడవంటిదనీ గ్రహించాను. త్వరలోనే మంచి రోజు చూసి, వేదపురంలోని బీద వినాయకుడికి మూడు వేల మూడు వందల టెంకాయలు కొట్టాలని నిర్ణయించుకున్నాను.

# కత్తి యుద్ధం

డిశంబరు నెలలో ఆఖరివారం. అనగా, చలి యెక్కువన్న మాట. అందులోనూ వేదపురం సముద్ర తీరాన ఉన్న పట్టణం. భరించరాని చలి. ఒకనాటి రాత్రి, చలికి భయపడి, ఆరోగ్య విధుల్నికూడా లెక్క పెట్టక, నేను గదికి వున్న నాలుగు కిటికీలు మూసి పడుకున్నాను.

తెల్లవారడానికి యింకా రెండు జాములుండనగా లేచాను. అందుకు కూడా కారణం చలే. చలిగాలి వీస్తోంది. ఉత్తరపు కిటికీ తలుపుల గాలికి అవంతట అవే తెరుచుకున్నాయి. లేచి వెళ్లి, కిటికీ తలుపులు ముయ్యాలన్నా

బద్ధకంగా ఉంది. దుప్పటిని తొలగించి, యీ చలిలో ఎవడు వెళ్ళి తలుపులు వేస్తాడని? ఏం చేద్దామా అని మధన పడసాగాను. ఈలోగా పెద్దవాన కురవ సాగింది. భరించరాని చలిగాలి వీస్తోంది.

ప్రాణానికి వెరవక, ధైర్యంగా లేచి కిటికీ తలుపులు మూద్దామని లేచాను. అప్పుడు ఒక పండారం (తత్త్వాలు పాడుతూ జీవయాత్ర చేసే సాధువు) జేగంట వాయిస్తూ పాట పాడుకుంటూ వచ్చాడు. ఏడాది పొడువునా ఒక వళ్లువన్ (వళ్లువన్ అనే జాతికి చెందినవాడు, వైతాళికుడు) జేగంట వాయిస్తూ అర్ధరాత్రి పూట వేదపురం వీధులు తిరిగేవాడు, తిరువాచకం చదువుతూను. అతనే ఈ సంవత్సరం కూడా వచ్చాడనుకుని, ఆ సాధువు వంక నేను సరిగా చూడలేదు. కాని అతని పాట శ్రావ్యంగా ఉంది. ఆ గొంతు మామూలుగా వచ్చే వళ్లువన్ గొంతు కాదు. ఇదేదో కొత్తకంఠంగా ఉన్న దనుకుని, గజ గజ లాడించే చలినికూడా లెక్కపెట్టక కిటికీ పక్కగా నిలబడి చూశాను. జోరున వాన. అప్పటికే నాకు వణుకు పుట్టుకు వచ్చింది.

వసంతకాలంలో, సాయం సమయాన, పూలతోటలో రాజకుమారుడు వాహ్యాళికి వెడలినంత ఠీవిగా నడుస్తూ ఆ సాధువు ఆ వర్షంలో ముందుకి సాగిపోతున్నాడు. బ్రహ్మానందంగా తిరువాచకం పాడుతున్నాడు.

'అలదికొనును భస్మము, భూషణమ్ము పాము,
పలుకులేమో ధ్వనించు శ్రుతుల విభాతి.'

ఈ పాట, అతను పాడిన రాగం నా మనస్సుని పూర్తిగా వశం చేసుకున్నాయి. అది మానవ సంగీతంగా కనిపించలేదు. గంధర్వ గానంగా ఉంది. 'ఎవరయ్యా సాధువు! కొంచెం ఆగు' అన్నాను. అతను ఆగాడు. 'పోయిన సంవత్సరం తిరుప్పళ్లియెళుచ్చి (ప్రాబోధకీ స్తుతి) పాడిన వాడి వేనా నువ్వు ? నువ్వెవరివి?' అని అడిగాను. 'పోయిన సంవత్సరం పాడిన తని కొడుకుని నేను. ఇప్పుడు నేను పాడింది తిరువ్చాళల్' అన్నాడు. 'నీ పేరేమిటి ?' అని అడిగాను. 'నా పేరు నెట్టైమాడన్' అని బదులు చెప్పాడు. 'అలాగా, వెళ్లు' — అన్నాను. అతను రెండడుగులు ముందుకి వేసి మళ్లీ నా దగ్గరికి వచ్చి 'అయ్యా! మీ పేరేమిటి ?' అని అడిగాడు.

'నా పేరు కాళిదాసన్' అన్నాను.

'ఓహో! పత్రికలలో కథలు రాస్తారే, మీరేనా ఆ కాళిదాసుగారు ?' అన్నాడు.

'అలాగా. వీడు పత్రికలు కూడా చదువుతున్నాడన్న మాట!' అని మనస్సులో అనుకుని, 'నాయనా, నెట్టిమాడా! నీ కెవరు నేర్పించారు సంగీతం ? ఇన్నాళ్లూ ఏ వూళ్లో కాలక్షేపం చేశావు ?' అని అడిగాను.

'అయ్యా, నేను వానలో తడుస్తున్నాను. నువ్వేమో గదిలో నుంచుని పురాణం మొదలుపెట్టావు, మేడ దిగి కిందికి రా. వీధి అరుగు మీద కూర్చుని మాట్లాడుదాం. నేనూ నిన్ను ఎన్నో విషయాలడగాలని చాలా రోజులుగా అనుకుంటూ వున్నాను. కిందికి దిగి వస్తారా?' అని అతను అడిగాడు.

'వీడేదో పిడుగులా వున్నాడే' అనుకుంటూ, ఆశ్చర్యపోయాను. కిందికి దిగి రావడానికి ఒప్పుకున్నాను, అతను గడప యెక్కి అరుగు మీద కూర్చున్నాడు. నేను కిందికి దిగుతూ ఒక లాంతరు వెలిగించుకుని వెళ్లాను. అతని చేతిలోనూ ఒక లాంతరు ఉంది. అరుగు మీద నేను కూర్చోగానే, మేమిద్దరం ఒకరి నొకరు చూసుకున్నాము. అతనిది బోడితల. బక్కపలచగా వున్నాడు. కండ లేదు. కాని దృఢమైన శరీరం. పైన ఉత్తరీయం లేదు. నడుముకి ఒక గుడ్డ చుట్టుకున్నాడు. ఒంటి మీద కారుతున్న వాన నీటిని అతను తుడుచుకోనైనా తుడుచుకోలేదు. చలివల్ల అతని ముఖం అసహ్యంగా కనిపించలేదు. అతన్ని చూడగావే ఎందువల్లనో హంస జ్ఞాపకం వచ్చింది. అవును, అవును. అతను నడిచి వెడుతుంటే నేను మనసులో అనుకున్నాను. 'ఏమిట్రా, వీడు హంసలా నడిచి వెడుతున్నాడు' అని. మనిషిని చూస్తుంటే ఆలయంలోని హంస వాహనం ఎంత గంభీరంగా సహనం మూర్తీభవించి నట్టుగా ఉంటుందో అంత గాంభీర్యమూ, సహనమూ అతని ముఖంలో కనిపించాయి.

'నన్నేదో అడగాలని చాలా రోజులుగా నువ్వు అనుకుంటున్నట్టుగా చెప్పావు. ఏమిటో అడుగు' అన్నాను. అందుకు నెట్టిమాడన్ యిలా అన్నాడు.

'నిన్ను ప్రశ్నలడగాలని నేననలేదు. నీతో మాట్లాడాలని మాత్రం నేను అభిలషించాను. నువ్వేదైనా ప్రశ్న వేస్తే, నేను దానికి బదులు చెపుతాను. అదే నాకు తెలిసిన సంభాషణ.'

ఏమిటే ధర్మసంకటం అనుకుంటూ యింతకు ముసుపు అడిగిన వాటినే అడిగాను. 'నువ్వు సంగీతం ఎక్కడ నేర్చుకున్నావు? ఇంతకాలం ఏయే వూళ్లోలో వున్నావు ?'

'అరివూర్ వీణ రఘునాథ భట్టర్ కుమారుడు ఆంజనేయ భట్టరు దగ్గర నేను సంగీతం అభ్యసించాను. ఇంతవరకూ నేనక్కడే నివసించాను' అన్నాడు.

'నాయనా నెట్టైమాడా ! నువ్వు వళ్లువజాతివాడివి కదా (నిమ్న జాతి). రఘునాథ భట్టర్, ఆంజనేయభట్టర్ అనే పేర్లు బ్రాహ్మణులపేర్లుగా వున్నాయి. మీ జాతివారు బ్రాహ్మణుల్ని సమీపిస్తే అంటరాని దోషం అనడం అలవాటు కదా ! అటువంటప్పుడు నువ్వు ఆయన వద్ద సంగీతం ఎలా నేర్చుకున్నావు ?' అని అడిగాను.

'నువ్వడిగిన యీ ప్రశ్నకు జవాబు చెప్పదలచుకుంటే నా కథను మొట్ట మొదటి నుంచీ ప్రారంభించాలి. మరి ఆ కథనంతా ఓపిగ్గా నువ్వు వింటావా ?' అన్నాడు.

వింటానని నా సమ్మతిని తెలియజేశాను. అప్పుడు నెట్టైమాడన్ యిలా మొదలు పెట్టాడు.

'ఇరవై ఆరేళ్లకు మునుపు నేను వేదపురంలో జన్మించాను. నేను నాలుగేళ్ళ పిల్లవాణ్ణిగా వున్నప్పుడు, తిండి గడవక నన్ను మా నాన్నగారు ఒక సర్కస్ కంపెనీ వారికి అమ్మివేశాడు. ఆ కంపెనీలో చెప్పుకోదగిన పను లెన్నో చేసి పేరు పెంపులు గడించాను. నే నప్పుడు పన్నెండేళ్లవాణ్ణి. అప్పుడు అరివూరుకి వెళ్లాను. ఆ కంపెనీ యజమాని అయిన మహారాష్ట్ర బ్రాహ్మణుడికి నే నంటే చాలా అభిమానం. కొండ ప్రాంతంలోని ఒక పెద్ద జమీందారు గారికి అరివూర్ ముఖ్య పట్టణం. ఆ ఊళ్లో సర్కస్ రెండు నెలలు సాగింది. ఆ రోజుల్లో మా యజమాని రాయరుగారు సర్కస్ కంపెనీని మూసివేసి పండరీ పురానికి వెళ్లి, అక్కడ యిల్లు కొనుక్కుని తన వార్ధక్యాన్ని హరినామ స్మరణలో గడపాలని అనుకున్నాడు. ఆయనకీ జమీందారు గారికీ గాఢమైన స్నేహం ఏర్పడింది. కత్తియుద్ధంలో ఘటికుడైన యువకుడు తనకు అంగరక్షకుడుగా కుదిరితే బాగుండునని జమీందారుగారు తన అభిప్రాయం తెలియజేశారు. అప్పుడు రాయరు నన్ను సిఫార్సు చేశారు. ఇది యిలా వుండగా, మా నాన్న గారికీ రాయరు గారికీ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూ వుండేవి. మా నాన్నగారు కూడా ఆయా వూళ్లకు వచ్చి నన్ను చూసి వెడుతూ వుండే వారు. అరివూర్ జమీందారుగారు నన్ను అంతఃపురంలోనే వుండనిచ్చి, అన్నంపెట్టి, సొంత కొడుకులా చూసుకునేవారు. ఆయన ఆస్థాన సంగీత విద్వాంసులైన ఆంజనేయ భట్టరుగారి వద్ద నేను సంగీతం నేర్చుకున్నాను.

యోగాభ్యాసం కూడా చేశాను. కత్తి యుద్ధంలో మంచిపేరు సంపాదించాను. ఆరు భాషలలో మాట్లాడతాను. పాడతాను. నాట్యం చేస్తాను. మృదంగం వాయిస్తాను. ఏను గెక్కడం, గుఱ్ఱపుస్వారీ, మల్లయుద్ధం - మొదలైనవి కూడా నాకు తెలుసు.'

ఈలోగా తెల్లవారింది. సూర్యోదయమైన తర్వాత, చూడడానికి అతను చాలా బాగున్నాడు.

'ఇవ్వాళ్ల నువ్వు మా యింట్లోనే భోజనం చెయ్యి. నీ కత్తిసాము నాకు కొంచెం చూపించు చూద్దాం' అన్నాను. అతను అలాగే అన్నాడు. తర్వాత, 'ఈ వూళ్లో నాతో సరిసమానంగా కత్తిసాము చేసే వ్యక్తి ఒకే ఒకతను వున్నాడు. నేను మా యింటికి వెళ్లి కత్తులు తీసుకువస్తాను. అలాగే అతన్ని కూడా పిలుచుకుని వస్తాను' అని చెప్పి వెళ్లిపోయాడు, మళ్లీ అయిదింటికి వచ్చాడు. అతను నిజంగానే యుద్ధంలో ఉపయోగించే ఖడ్గాలు తెస్తాడని నే ననుకున్నాను. కాని రెండు కత్తులు తీసుకువచ్చాడు. సర్కసులో వెన్నను కోసే కత్తులవి. తనతో సరిసమానంగా యుద్ధం చెయ్యగల వీరుణ్ణి పిలుచు కుని వస్తానన్న అతను ఒంటరిగానే వచ్చాడు. ఆ వ్యక్తి కోసం గాలించినట్లూ అతను కనిపించ లేదనీ, యింకొక నాడు అతన్ని పిలుచుకు వస్తాననీ, యివాళ్లకి తానొక్కడే కత్తిసాముచేసి చూపిస్తాననీ చెప్పాడు. సరేనని, అతనికి మంచి కాఫీ, యిడ్లీలు తెప్పించాను. అతను అవి తింటూ వుండగా, అక్కడికి పొట్టి స్వాముల వారనే యోగీశ్వరుడు వచ్చాడు. ఆయన్ని చూడగానే నెట్టై మాడన్ లేచి నమస్కరించి, 'రామ్, రామ్ మహారాజ్' అన్నాడు. అతన్ని వుద్దేశించి ఆయన కూడా 'రామ్, రామ్' అన్నాడు. ఆ తర్వాత వాళ్లిద్దరూ మలయాళంలో చాలా సేపు మాట్లాడుకున్నారు. నాకు మలయాళం తెలీదు కనక, వాళ్ల మాటలు నేను వినలేదు. పొట్టి స్వాముల వారిని నేను నా గురు వుగా భావించినందు వల్ల, దుకాణం నుంచి అరటిపళ్లు తీసుకువచ్చి, ఆయనకి పాలూ పళ్లూ యిచ్చాను. ఇద్దరూ ఫలహారం ముగించారు. తర్వాత తాంబూలం పళ్లెం తీసుకుని మేడమీది పూజా గృహానికి వెడదామని వాళ్లిద్దరినీ పిలిచాను పైకి రమ్మని. ఇద్దరూ మేడమీదికి వచ్చారు. వాళ్లని ఉయ్యాల బల్లమీద కూర్చోమని చెప్పి, తాంబూల మిచ్చాను. తాంబూలం సేవించారు. తర్వాత నెట్టై మాడన్ బయటి ముంగిలి నుంచి ఒక కుర్చీ తీసుకువచ్చాడు. దానిమీద నుంచుని ఉయ్యాల గొలుసులు ఊడ దీశాడు. ఆ మరుక్షణం ఉయ్యాల

బల్లనూ గొలుసుల్నీ తీసుకువెళ్ళి గోడ పక్కగా పెట్టాడు. ఆ తరవాత నా వంక చూస్తూ, 'నాతో సరి సమానంగా కత్తిసాము చెయ్యగల వ్యక్తి యీ వూళ్లో ఒక్కరే ఒక్కరున్నారని చెప్పాను కదా, ఆయనే యీ స్వాముల వారు' అన్నాడు పొట్టి స్వాముల వారిని చూపిస్తూ. నేను ఆశ్చర్యంలో మునిగి పోయాను.

ఒక్క క్షణంలో యిద్దరూ కత్తిసాము చెయ్యడం మొదలుపెట్టారు. ఆ యుద్ధం చాలా సేపు జరిగింది. అది చూస్తూ నేనలాగే కూర్చుండి పోయాను. అంత ఆశ్చర్యకరంగా వాళ్లిద్దరూ కత్తులు తిప్పారు. ఒక్కరికీ గాయం తగల లేదు. అయితే అప్పుడప్పుడు మాత్రం అతని తల యెగురుతుందేమో, ఇతని తల యెగురుతుందేమో అనుకొని నేను చాలా భయపడ్డాను.

అనంతరం కత్తులు కిందపెట్టి, అలసట అనేది యెరగనివారై, వాళ్లిద్దరూ మళ్లీ మలయాళంలో సంభాషణకు దిగారు. కొంత సేపటికి నెట్టెమాడన్ వెళ్ళిపోయాడు. పొట్టి స్వాములవారు, 'నాయనా కాళిదాసూ, ఈ నెటె మాడన్ రాజయోగంవల్ల మనస్సుని అదుపులో ఉంచుకున్నాడు. యోగ సిద్ధికి భగవంతుడితనికి కత్తిసాముని మార్గంగా చూపించాడు. ఇతనికి సమానంగా కత్తి తిప్పడంలో యీ భూమండలంలో ఎవ్వరూ లేరనవచ్చు. అయితే, తనను కరవడానికి వచ్చే పాముని కూడా చంపకూడదనే అహింసా వ్రతాన్ని అవలంబిస్తున్న మహా యోగి. అందువల్ల, హింసకు వుపయోగపడే ఖడ్గాన్ని యితడు చేత్తోకూడా తాకడు. శరీరాన్ని బాగా స్వాధీనంలో వుంచు కునేందుకు గాను హఠయోగ విద్యలలో యిదికూడా ఒకటనుకుని, నీ వంటి అభిమానులకు మాత్రమే తన శక్తిని సర్కస్ కత్తుల నాధారంగా చేసుకుని ప్రదర్శిస్తూ వుంటాడు. మన వూళ్లోనే వళ్లువర్ కులంలో జన్మించిన యిటు వంటి మహనీయుడొకడు వుండడం నీకు ఆశ్చర్యంగా వుండవచ్చు. ఇక మీద యిటువంటి విషయాలు చూసి నువ్వేమీ ఆశ్చర్యపడవద్దు. భారత దేశంలోని సాధువులపట్ల ఆదర పూర్వకంగా ప్రవర్తించు. సాధువు వేషానికి నమస్కరించు. ఏ పుట్టలో యే పాముందో? నీకు ముమ్ముందు మహనీయుల సందర్శన భాగ్యం యింకా కలుగుతుంది' అన్నాడు.

భారత దేశపు మహిమను తలుచుకుని నేను వందేమాతరం అంటూ పొట్టి స్వాముల వారికి చేతులెత్తి నమస్కరించాను. ఆయన 'వర్ధిల్లు' అని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

# వ్యాసములు : మహిళలు

1. స్త్రీ
2. తమిళ దేశపు చైతన్యం
3. పతివ్రత
4. స్త్రీ స్వాతంత్ర్యం
5. తమిళదేశపు నాగరకత



వేదపురంలో ధర్మవీధిలో ఆచార్య భ్రమరాయ అయ్యరు అనే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన శాక్త మతానుయాయుడు. శక్తి పూజ చేసేవారిలో కొందరు మధువు సేవిస్తారు. మాంసం ఆరగిస్తారు. కాని యీ ఆచార్యుడు అలాంటి వాడుకాదు. ఆయన పూర్తిగా శాకాహారి. అంటే, మేక పిల్లనైనా మాంసం తినేటట్లు చెయ్యవచ్చునేమో కాని, ఆయన్ని మాత్రం మాంసం రుచి చూసేటట్లు చెయ్యలేము. ఆయన ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలలో మహా పండితుడు. సంస్కృతం కూడా కొంచెం వచ్చు. భగవద్గీత, వాల్మీకి రామాయణం, కుమార సంభవం – బాగా చదివాడు. వేదాంత విచారంలో ఘటికుడు. హరికథా కాలక్షేపం, పురాణ పఠనం మొదలైన వాటికి తప్పకుండా హాజరవుతాడు. కథంతా విని సాధారణంగా ఆయన అసంతృప్తితోనే యింటికి తిరిగివస్తాడు. ఆ తర్వాత పౌరాణికుల అభి ప్రాయాలను ఒక నెలరోజుల పాటు మిత్రులతో చర్చించేవాడు. 'హిందువులు పూర్వకాలంలో మేధా సంపన్నులై ఉండేవారు. ఇంకా ఉచ్చస్థితికి వస్తారు. కాని యీనాడు పండితులమని చెప్పుకునేవారు చేసే ప్రసంగాలు, హరి కథలు మొదలైనవి వింటుంటే, వాళ్లలో నూటికి తొంభైమంది వంటపనికి అర్హులని నా అభిప్రాయం. అది విడిచిపెట్టి, లోకానికి జ్ఞానోపదేశం చెయ్యాలని బయలుదేరారు. ఇది బాధాకరమైన విషయం; ఎంతో యిబ్బంది పెడుతున్నారు; హింసిస్తున్నారు. హిందూ జాతి చాలా మౌఢ్యంగా ఉంది. మనవాళ్ల మెదడులో బొద్దింకలు చేరాయి. హిందువుల మేధని తలుచు కున్నప్పుడల్లా నాకు ఎక్కడలేని మంట కలుగుతోంది. పెటగోనియా దేశంలో కూడా మన దేశంలో వలె యింతమంది మూఢులుంటారని నే ననుకోను' అని బహువిధాలుగా మన దేశస్థుల మౌఢ్యం గురించి విమర్శిస్తూ వుంటాడు.

భ్రమరాయ అయ్యరుకి తమిళంలోనూ కొంచెం ప్రవేశం ఉంది. ఐరోపీయుల శాస్త్రాలెన్నిటినో ఆయన తమిళం చేశాడు. అప్పుడప్పుడు కవిత

కూడా వ్రాస్తూవుంటాడు. అయితే ఆ కవిత అంత ప్రశస్తమైనదీ కాదు ; అంత అప్రశస్తమైనదీ కాదు. ఒక పాటి రచన అది. సంగీతంలోనూ ప్రవేశ ముంది. అయితే పాడలేడు. శారీరం అంత మంచిది కాదు. తాళం విషయంలో చాలా ఘటికుడు. మహా మహా మృదంగ విద్వాంసులు కూడా ఆయన్ని చూస్తే భయపడతారు.

ఆయన యీ వీధిలో మాట్లాడింది మూడో వీధికి వినిపిస్తుంది. పగలు బడి అయిపోయిన తర్వాత, యింటికి వచ్చి, సాయంకాలం ఆరింటినుంచి ఎనిమిదింటిదాకా తమ యింటి అరుగుమీద కూర్చుని మిత్రులతో మాట్లాడుతూ - అనగా— గర్జిస్తూ వుంటాడు. ఆ తర్వాత భోజనానికి వెడతాడు. భోజనం చేసి, చెయ్యి కడుక్కుని, ఆ తడికూడా ఆరకముందే, మళ్లీ అరుగు మీద రంకెలు వెయ్యడం మొదలుపెడతాడు. ఆయన యింటి తిన్నెను ఇరుగు పొరుగువారు 'పిడుగుల పాఠశాల' అని అంటారు. ఆ పాఠశాలకు ప్రతి రోజు సాయంకాలం కనీసం నలుగురైదుగురన్నా వచ్చి ఆయన మాటలు వింటూవుంటారు. ఆ నలుగురైదుగురికీ యింకా చెవుడు రాకపోవడం నిజంగా ఆశ్చర్యకరమైన విషయమే.

అయ్యరుగారూ నేనూ స్నేహితులం. అప్పుడప్పుడు నేను పిడుగుల పాఠశాలకు వెళ్లి ఆయన మాటలు వింటూ ఉండేవాణ్ణి. హిందువులు పరమ మూఢులు – అన్న ఆయన అభిప్రాయాన్ని మాత్రం నేను శిరసావహించను. పోతే, యితర విషయాలలో ఆయన మాటలు నిజమనే నా కనిపిస్తుంది.

ఒక ఆదివారం సాయంకాలం పూట వానజల్లు పడుతూనే ఉంది. అందువల్ల నేను వాహ్యాళికి వెళ్లలేదు. కాని కాలక్షేపం కోసమని పిడుగుల పాఠశాలకు వెళ్లాను. అక్కడ ఆచార్యుల గర్జన అట్టహాసంగా సాగుతోంది. శ్రోతల జాబితాని ఉదాహరిస్తున్నాను.

(1) వీరాసామి నాయక్కర్. (ఈ నాయక్కర్ గున్న యేనుగులా ఉంటాడు. ప్రభుత్వోద్యోగి. ముప్ఫయి మూడేళ్లవాడు. బట్ట తల. వ్యవహార జ్ఞానం కలవాడు. నోరెప్పుడూ మాట్లాడదు. కోపం వచ్చినప్పుడు కొంచెం నశ్యం పీలుస్తాడు.)

(2) కొంగణ భట్టర్ (ఈయన పెరుమాళ్ల కోవిలలో అర్చకుడు. ఏడున్నర అడుగుల యెత్తు. ఎవరైనా సరే యీయన్ని చీవాట్లు పెట్టవచ్చు ; ధోవతి పట్టి లాగవచ్చు. వీరాసామి నాయక్కర్ ప్రతి పావుగంట కొకసారి ఆయన తల

మీద ఒక మొట్టికాయ మొట్టుతూ వుంటాడు. ఆయనకి మాత్రం కోపం రాదు. ఆయన జాతకంలో కోపకారణమైన గ్రహాలు ఒకచోట చేరలేదని అంటారు.)

(3) నారాయణ సెట్టియార్ (ధనికుడు. వామనుడు. వడ్డీకి యివ్వడం, వడ్డీ పుచ్చుకోవడం, పిడుగుల పాఠశాలకు హాజరవడం – ఈ రెండూ తప్ప మూడోపని ఆయనకి లేదు. వారాని కొకసారి, శుక్రవారం నాడు విఘ్నేశ్వరుడి గుడికి వెడతాడు. అంతే తప్ప, యిల్లు విడిచి బయటికి కదలడు. ఆయన్ని అంతఃపురం సెట్టియార్ అనడం కద్దు.)

(4) గురుసామి భాగవతర్. (సంగీత విద్వాంసుడు. పిల్లలకి పాటా, పద్యమూ నేర్పుతూ వుంటాడు. బండ గొంతు.)

ఈ సదస్యుల మధ్య నేనూ చేరాను. భ్రమరాయ అయ్యరు నన్ను చూడగానే ఎంతో సంతోషించాడు.

'రండి, రండి, మీకూ బాగా నచ్చే విషయం గురించే మాటాడుతున్నాము' అన్నాడు.

'అంటే దేన్ని గురించి ?' అని అడిగాను.

'స్త్రీల విషయం' అని బదులు వచ్చింది.

'స్త్రీలను గురించా ? సరే, ఉపన్యాసం కానివ్వండి' అన్నాను. అయ్యరు గర్జన మొదలుపెట్టాడు.

'నేను చెప్పిన విషయాన్ని శక్తి దాసులకు (భారతి నామాంతరం) సంగ్రహంగా వివరిస్తాను. అప్పుడుగాని ఆయన యిక చెప్పబోయే విషయాన్ని అర్థం చేసుకోలేరు' అని పూర్వ కథను మొదలుపెట్టాడు.

సరిగ్గా అప్పుడే వీరాసామి నాయక్కర్ ఒక చిటికెడు నశ్యం పట్టించి, కొంగణ భట్టర్ తలమీద ఒక మొట్టికాయ మొట్టాడు.

'ఈ చిలిపి చేష్టలు చాలు. ఆచార్యుల ప్రసంగం విందాం' అన్నాను.

ఆయన గర్జన ప్రారంభించాడు.

'ఇండియాలో మగవారికి కూడా ఓటింగు హక్కు లేదు. అనగా, ప్రజల అభీష్టం అనుసరించి, వ్యక్తుల్ని ఎన్నుకొని ప్రజాసభ ద్వారా రాజ్యం చేసే హక్కు హిందువులకు లేదు. హిందువులకు తెలివితేటలు తక్కువ. మన దేశంలో మగవారికికూడా లేని ఓటింగు హక్కు ఇతర కొన్ని దేశాలలో స్త్రీలకు ఉన్నది. అంటే, రాజ్యాంగం యిలా నడవాలని నిర్దేశించే బాధ్యత అక్కడ స్త్రీలకూ ఉన్నదన్నమాట !

'ఆస్ట్రేలియా, న్యూజిలాండు, డెన్మార్కు, నార్వే, యునైటెడ్ స్టేట్సులో సగం, కెనడా - ఈ దేశాలలో స్త్రీలకు ఓటింగు హక్కు వున్నది. ఇంగ్లాండులో కూడా ఈ విధానం ఏర్పడాలని చాలామంది కోరుతున్నారు. మాజీ మంత్రి ఆస్క్విత్ ఈ విధానాన్ని చాలా కాలం ప్రతిఘటించినా, యిటీవల దీన్ని ఆమోదిస్తూ మాట్లాడినట్లు వినికిడి. ఇది యిలా వుంచండి.

'టర్కీ దేశం పేరు విన్నారా ? మొన మొన్నటివరకూ అక్కడ స్త్రీలను ఘోషాలో వుంచడం అలవాటు. కస్తూరి మాత్రల్ని డబ్బాలో వేసి వుంచుతున్నారు చూడండి, అలాగన్న మాట ! తెరిస్తే వాసన యెక్కడ పోతుందో అని మన దేశంలో కూడా పలువురు ఆ విధంగానే చేస్తున్నారు. హిందూ స్త్రీ చాలావరకు బానిసగానే వుంది. మన యిళ్లల్లో గదుల్లో బంధించడం లేదు. అలా బందిస్తే మాత్రం అందువల్ల వచ్చే ముప్పు యేముంది కనక ? బానిసను నీళ్లు తెమ్మని వీధిలోకి పంపించిన మాత్రాన ఏం ఒరిగిందని ; ఇదికూడా పనికిరాదని గదిలోనే వుంచి తాళం వేస్తే మాత్రం యేం ? ఏ స్థితిలో వున్నా బానిస బానిసే. అయ్యా, మనిషికి రెండే రెండు పద్ధతులున్నాయి. ప్రతిదీ తన యిష్టం ప్రకారం చెయ్యడం, అందువల్ల కలిగే లాభనష్టాలకు తానే బాధ్యత వహించడం - యిదొక పద్ధతి. దీన్నే స్వాతంత్ర్యం అందాం. అలా కాకుండా, ఇతరుల యిష్ట ప్రకారం, తనకు యిష్టం లేకపోయినా సరే, ప్రవర్తించాలనే పద్ధతి. దీన్నే అస్వతంత్రం లేదా బానిస పద్ధతి అందాం. మన స్త్రీలు యిలాగే వున్నారు. ఊరికే అబదపు కథలు చెప్పడం కలిగే లాభం ఏముంటుంది. చెప్పండి ? మన స్త్రీలు బానిసలు. ఇందులో సందేహం లేదు. హిందువులలో పురుషులకే రాజ్యాంగంలో ఓటింగు హక్కు లేదు. వాళ్లల్లో స్త్రీలు బానిసలు. హైందవ స్త్రీల కంటె యిప్పుడు టర్కీ స్త్రీలు మంచి స్థితిలో వున్నారు. మిస్ ఎలిసన్ అనే ఒక ఆంగ్ల వనిత ఒక పుస్తకం వ్రాసింది. అది నిన్ననే ఒక పత్రికలో సమీక్ష చెయ్యబడింది కూడా. సమీక్షకులు సింహళ దేశపు బౌద్ధుడు. ఆయన పేరు జినరాజదాస్. ఆయన ఒక ఆంగ్ల వనితను పెళ్లి చేసుకున్నాడు. టర్కీ స్త్రీల చదువు సంధ్యలు, రాజ్యాంగంలో వారికిగల శ్రద్ధ మొదలైన వాటిలో ప్రగతి యెంతో గానవస్తున్నదని ఆ పుస్తకంలో చెప్పబడినట్లు ఆ బౌద్ధుడు పేర్కొన్నాడు. అయ్యో, రామా, రాఘవా, కేశవా, విశ్వామిత్రా – సంధ్యావందనం కూడా మరిచిపోయాను.

ఇలా ఆయన కొంచెం ఊపిరి తీసుకునేందుకు ఒక హాస్యోక్తిని ఉపయోగించాడో లేదో, ఆయన ముఖ్య శిష్యుడైన కొంగణ భట్టర్ గొల్లుమని నవ్వాడు. వెంటనే వీరాసామి నాయక్కర్ భట్టర్ తలమీద ఒక మొట్టికాయ మొట్టి, తానొక చిటికెడు నశ్యం వేసుకున్నాడు.

అయ్యరు మళ్ళీ ప్రారంభించాడు తన ఉపన్యాసం.

'రజస్వల అయిన తర్వాత, స్త్రీ యిష్టప్రకారం ఆమెకు పెళ్లి చెయ్యాలి. భర్త పెట్టే బాధల్ని సహించలేని పక్షంలో, స్త్రీ అతనికి విడాకులు యిచ్చేందుకు తగిన వీలు చట్టంలో కల్పించబడాలి. ఊరివారు ఆమెను దూషించకూడదు. స్త్రీ కష్టపడి జీవించలేదు. ఈ విషయంలో ఐరోపాలో స్త్రీ స్వాతంత్ర్యాన్ని అభిలషించే వారి అభిప్రాయాన్ని నేను శిరసావహించ లేను. స్త్రీ యేదో వృత్తి చేసుకుని జీవించకూడదు. ఆమెకు పిత్రార్జితంలో భాగం వుండాలి. పెళ్లి చేసుకుంటే, భర్త ఆస్తి ఆమెదే అని భావించాలి. (భార్య చేతికి డబ్బు యివ్వకూడదని వాదించే పురుషులు ఉండనే వున్నారు.) తన యిచ్ఛ వచ్చినట్లు స్త్రీ సంచరించ వచ్చు. కొన్నిచోట్ల స్త్రీని చూసినప్పుడు, ఆమెకు గౌరవ పూర్వకంగా నమస్కరించాలి. అలా ఏ మగవాడైతే వ్యవహరించనట్లు తెలియవస్తుందో, అతన్ని గృహస్థులు వెలివెయ్యాలి. అతనితో మాట్లాడకూడదు. స్త్రీ వీధిలోనో, బజారులోనో, రైలులోనో, కాశీకో ఒంటరిగా వెళ్లినా కూడా పురుషులు ఆమెను చూసి నమస్కరించేటట్లు చెయ్యడం యీ దేశంలో చాలా కష్టమైన పని. ఏం చేద్దాం? హిందువులలో నూటికి తొంభై మంది మూఢులు. వాళ్లెలా పోయినాసరే, చదువుకుని గౌరవంగా సంసారం సాగించే వారిలోనైనా 'స్త్రీలు స్వేచ్ఛగా మాట్లాడవచ్చు, స్వేచ్ఛగా సంచరించవచ్చు' అనే ఒక షరతు విధించాలి. ఇది వీలయ్యేటందుకుగాను పురుషుల్ని దండించాలి. అయితే దండించి మాత్రం ఏం ప్రయోజనం? ఎన్నాళ్లని యీ దేశస్థులు ఆ పాత చెత్తచెదారంలోనే మగ్గుతారో! నత్తలా స్త్రీ పురుషులు ఒకటిగానే జన్మిస్తున్నారు. తోడబుట్టిన వాడేమో ప్రభువు; తోబుట్టువేమో బానిస! అయ్యో! వర్తి పామరులు!' అని ముగించాడు.

అప్పుడే అక్కడికి వచ్చిన మా అమ్మాయి నన్ను భోజనానికి రమ్మని పిలిచింది. నేను లేచాను. 'భ్రమరాయ అయ్యరుగారు చెపుతున్న విషయాలు విన్నారుగా; మీ అభిప్రాయం ఏమిటి?' అని కొంగణ భట్టర్ నన్ను అడిగాడు.

నేను చెప్పడానికి ముందే వీరాసామి నాయక్కర్, భట్టర్ తలమీద ఒక మొట్టికాయ మొట్టి, 'మీరు మాట్లాడకుండా కూర్చోండి' అన్నాడు. తర్వాత నేను, ''లోకంలోని విషయాలతో నాకు పని లేదు. ఎవరికి ఏ పని నెరవేరాలన్నా 'ఓం శక్తి, ఓం శక్తి' అని అంటే, ఆ పని నెరవేరుతుంది. ఇదే నాకు తెలిసిన సంగతి' అని చెప్పాను.

అయ్యరుగారు 'ఇది సత్యం' అన్నారు. పిడుగుల పాఠశాల అంతా 'నిజమే' అని ఒప్పుకున్నది. నేను భోజనానికి వెళ్లాను.

# తమిళదేశపు చైతన్యం

జీవహింస తగదు. మధు మాంసములవల్ల చాలా మందికి అపకారం జరుగుతోంది. మధు మాంసములను దగ్గరికి రానీయక పోవడం బ్రాహ్మణులకు కీర్తి హేతువు. అదొక గొప్ప తపస్సు. అది కృతయుగానికి అర్హమైన విధానం.

కాని తామొక పని చేయలేనప్పుడు, దాన్నే యితరులు చేస్తున్నప్పుడు అసూయ చెందకూడదు.

ఆహారం, దుస్తులు, స్త్రీ - ఇచ్చిపుచ్చుకునే సందర్భాలలో మూఢంగా నియమాలూ కట్టుబాట్లూ ఆంక్షలూ మొదలైనవి విధించడం వల్ల ప్రయోజనమేమీ ఉండదు.

పైగా, ప్రపంచంలోని మానవులందరూ ఒకే జాతికి చెందినవారు : 'ఈ యుద్ధంలో ఇంతమంది ఐరోపీయులు అన్యాయంగా మరణిస్తున్నారే' అని తలుచుకున్నప్పుడల్లా నేను కంట తడి పెట్టాను. కాని నేను స్వదేశాభిమానం కలవాణ్ణి. అయినప్పటికీ ఐరోపీయులు మరణించడం నేను అంగీకరించను. మానవు లందరూ ఒకే వర్గం.

సకల జనులూ సహోదరులు. మనుష్య జాతి ఒక ప్రాణం. అటువంటప్పుడు మనం ఒక యింట్లో మూఢాచారముల కుడ్యాలు నిర్మించి నా జాతి వేరు, బావమరిది మరోజాతి, మా యిద్దరి మధ్య పంక్తిభోజనం లేదు, అతన్ని

వెలివెయ్యాలి అనడం కేవలం మౌఢ్యం తప్ప మరేమీ కాదని తెలియజెప్ప డానికే నేనింత దూరం వ్రాశాను.

తమిళనాడులో జాతి భేదాలూ మూఢ విశ్వాసాలూ పటా పంచలవు తున్నాయి.

మరొక విషయం స్త్రీ స్వాతంత్ర్యం. తమిళనాడులో స్త్రీ స్వాతంత్ర్యం కోరే పక్షానికి న్యాయమూర్తి శ్రీ సదాశివయ్యరుగారి సతీమణి మంగళాంబిక నాయకత్వం వహిస్తున్నారు. శ్రీమతి అనీబిసెంటు ఈ విషయంలో ఆమెకు మారదర్శకురాలూ, ప్రోత్సాహ శక్తీను.

ప్రస్తుతం భారతదేశంలో నిజంగానే స్త్రీ స్వాతంత్ర్యం ఏర్పడడానికి ఈ యిద్దరూ కారణమయ్యారు. వీరిద్దరికీ తమిళనాడు ఋణపడి వుంది. వీళ్లవాదం ఏమిటంటే స్త్రీలకు ప్రాణం వుంది. మనస్సు వుంది. తెలివితేట లున్నాయి. పంచేంద్రియాలున్నాయి. వాళ్లు చచ్చిపోయిన యంత్రాలు కారు. ప్రాణమున్న చెట్టుచేమల వంటివారూ కారు. పురుషుల వంటి వారే. బాహ్యేంద్రియాలు భిన్నములైనా, ఆత్మ మాత్రం ఒకటే.'

ఇవన్నీ మరిచిపోయి, వాళ్లని కొందరు గానుగెద్దులుగా భావిస్తున్నారు. దూది దిళ్లగా భావించేవారు మరికొందరూను. ఈ రెండూ పొరపాటే.

స్త్రీలు తమకు నచ్చినవారిని పెళ్లి చేసుకోవచ్చు. పెళ్లి చేసుకున్న పురుషునికి స్త్రీ బానిస కాదు; సహధర్మచారిణి. జీవితానికి ఊతకర్ర. ప్రాణంలో ఒక భాగం. శివపార్వతుల వంటి వారు. లక్ష్మీనారాయణుల వంటివారు. శివకేశవు లిద్దరూ ఒకరినొకరు కొట్టుకున్నారన్న అబద్ధపు పురాణాలలో కూడా లక్ష్మిని విష్ణువు కొట్టాడని కాని, శివుడు పార్వతికి సంకెళ్లు తగిలించాడని కాని కథలు లేవు. శివుడు పార్వతిని తన శరీరంలో అర్ధభాగంగా చేసుకున్నాడు. లక్ష్మిని విష్ణువు వక్షస్థలంలో ఉంచుకున్నాడు. బ్రహ్మ తన భార్యను నాలుక మీదనే నిలుపుకున్నాడు. లోకమునకు ఆధార భూతమైన ఆ మహాదైవం స్త్రీ పురుషా కృతులలో భాసిస్తున్నది. ఇద్దరూ సమానులే. స్త్రీని కొంచెం ఎక్కువగా భావించడం సముచితం.

కాగా, నేడు తమిళనాడులో మాత్రమే కాక ప్రపంచమంతటా స్త్రీని తక్కువగానూ, పురుషుని ఎక్కువగానూ భావించి ప్రవర్తించడం చాలా పొర పాటు. ఈ విధానం అన్ని దుఃఖాలకు పునాది ; అన్యాయాలకు ఆలవాలం ; కలియుగానికి పుట్టిల్లు.

ఈ విషయం తమిళనాడులో చాలామంది బుద్ధిమంతులను ఆకర్షించడమూ, స్త్రీ స్వాతంత్ర్య వాదానికి తమిళనాడులో పుష్టి కలగడమూ చూసి నేను చాలా సంతోషిస్తున్నాను. ఈ విషయంలోనూ సర్వ ప్రపంచానికి తమిళనాడు మార్గదర్శకం కాగలదని ఆశించవచ్చు.

తరువాతి విషయం మత భేదాలకు సంబంధించింది. భారతదేశం - ముఖ్యంగా తమిళనాడు - నాడూ నేడూ కూడా ఈ విషయంలో అగ్రతాంబూలం వహించిన విషయం అందరికీ తెలిసిందే. రామానుజులు తమిళనాడులో జన్మించినవారే కదా! ఆళ్వారులూ, నాయన్మారులూ అవతరించింది తమిళనాడులోనే కదా! మాలవాణ్ణి దైవసముడైన నాయన్మారుగా చేసి ఆలయంలో ప్రతిష్ఠించింది తమిళనాడులోనే కదా! చిదంబరం ఆలయంలో నటరాజు కొక సన్నిధి, పెరుమాళ్లకొక సన్నిధి. శ్రీరంగంలో పెరుమాళ్లకి ఒక తురుష్క స్త్రీని దేవిగా చేసి తులక్క (తురుష్క) నాచ్చియార్ అనే పేరుతో ఆమెను ప్రార్థిస్తున్నాము. 'ఏ మతమైనా సమ్మతమే' అన్నారు రామలింగస్వామి.

లోకంలోని మతభేదా లన్నిటినీ సమూలంగా నిర్మూలించి సర్వమత సమరస లక్ష్యాన్ని నెలకొనేటట్టు చెయ్యాలంటే, అందుకు తమిళనాడే తగిన రంగం. లోక మంతటా మత భేదాలు లేకుండా ఒకే దైవమును ఆరాధించేటట్లు చెయ్యగల మహనీయులు ప్రస్తుతం తమిళనాడులో ఉన్నారు. ఈ విషయమై ప్రపంచంలో కొత్త చైతన్యం తమిళనాడు నుంచి గ్రహించగలదని భావిస్తున్నాను.

పైన పేర్కొన్నట్లుగా, 'పరిపూర్ణ సమత్వం లేనిచోట మేము మగవారితో జీవించము' అని చెప్పడంవల్ల మనకు మన పురుషులవల్లనూ పురుష సమూహం వల్లనూ సంభవించదగిన యిబ్బందులు ఎన్నో వున్నప్పటికీ, అవి యెటువంటివైనా మనం భయపడకూడదు. సహోదరీ మణులారా! ఎలాగైనా మరణం తప్పదు. ధర్మంకోసం మరణించేవారూ ఉంటారు. కనుక మీరు స్త్రీ స్వాతంత్ర్యం కోసం ధర్మయుద్ధం ప్రారంభించండి. మనకు జయం కలుగుతుంది. మనకు పరాశక్తి సహాయం చేస్తుంది. వందేమాతరం.

# పతివ్రత

ఈ రోజుల్లో అబద్ధాలెన్నో చెరిగిపోతున్నాయి. ఎన్నో పాత అభిప్రాయాలు కరిగిపోతున్నాయి. ఎన్నో అన్యాయాలు తొలగిపోతున్నాయి. అవినీతి పరులు అధఃపాతాళానికి వెడుతున్నారు.

ఈ రోజుల్లో, ఎవరికో భయపడి మనకు తోచే సత్యాలను దాచకూడదు. ప్రస్తుతం నిజం చెప్పడానికి పత్రికలే తగిన సాధనం. పత్రికా సంపాదకులు ఈ రోజుల్లో సత్యానికి ప్రతినిధులుగా వ్యవహరిస్తున్నారు.

'స్త్రీలు పతివ్రతలై ఉండాలి! అని అందరూ అభిలషిస్తున్నారు. అయితే యిందులో వచ్చిన యిబ్బంది యేమిటంటే, మగవారు మంచివాళ్లు కారు. పురుషులలో ప్రతి ఒక్కడూ తన భార్య, సంతానం పతివ్రతలై ఉండాలని ఎంతగానో ఆశిస్తున్నాడు; కాని ఆ అభిలాషను ఇతర స్త్రీల పాతివ్రత్య విషయంలో పాటించడం లేదు. ఒక్కొక్కడూ తన కులంలోని స్త్రీలు పతివ్రతలని నమ్ముతున్నాడు.

స్త్రీ పురుషులు ఒకరికొకరు నిజాయితీగా మెలిగే పక్షంలో మంచి కలుగుతుంది. పతివ్రతకు అప్పుడు ఎక్కువ శక్తీ ధైర్యమూ కలుగుతుంది. సావిత్రి తన భర్తను యముని బారినుంచి తప్పించిన కథలో సత్యం ఇమిడి వున్నది. అయితే, పతివ్రత కాదనుకొని, ఒక స్త్రీని కొట్టి తన్ని హింసించి కులం నుంచి వెలివేసి, అందరిలో నగుబాటు చేసి, ఆమెతో యెవరూ మాట్లాడకూడదని కట్టడి చేసి, ఆమెను నీచపరిచి, ఆమెను వీధిలోనే మరణించేటట్లు చెయ్యడం అన్యాయాలలో కల్లా అన్యాయం.

పరమ మూఢులారా! మగవారు కాలు జారితే స్త్రీలు ఎలా పతివ్రతలుగా వుండగలుగుతారు? మాటవరసకు యిలా అనుకుందాం. ఒక పట్టణం జనాభా లక్షమంది. అందులో యాభైవేలు స్త్రీలు; యాభైవేలు పురుషులు. నలభైయైదు వేలమంది పురుషులు పరస్త్రీలను ఆశిస్తున్నట్టు అనుకుందాం. అందువల్ల కనీసం నలభై అయిదువేల మంది స్త్రీలు

పరపురుషుల కోరికకు తల ఒగ్గవలసి వస్తున్నది. వీరిలో, ఒక యిరవై వేల మంది పురుషులు తమ కోరికను కొంతవరకు తీర్చుకున్నట్లు అనుకుందాము. అనగా, కనీసం యిరవైవేల మంది స్త్రీలు వ్యభిచారిణులు కావలసి వస్తున్నది. ఆ యిరవైవేల మందిలోనూ వందమంది స్త్రీలను మాత్రం వెలివేస్తున్నారు. మిగిలినవారు తమ భర్తలతో కాపరం చేస్తున్నారు. అయితే, తమ భార్యలు వ్యభిచారిణులని వారి భర్తలకు స్పష్టంగా తెలియకపోవచ్చు. ఒకవేళ తెలిసినా ఊరికే వుండేవారూ కొందరు వీరిలో వుండవచ్చు.

కాగా, చాలామంది వ్యభిచారిణులతో కాపరం చేస్తున్నారు. పాతివ్రత్యాన్ని కాపాడే నిమిత్తం పురుషులు స్త్రీలను తిట్టడం, కొట్టడం, హింసించడం మొదలైనవి జరుగుతున్నవి. ఛీ ఛీ ! పురుషులకు ఘోర పరాజయం! బాధించి లాభం లేదు.

ఏమిటిది ! 'నువ్వు నన్నెందుకు కోరడం లేదు !' అని స్త్రీని కొట్టడంలో అర్ధం ఏముంది ! ఇటువంటి మౌఢ్యం ముల్లోకాలలో ఎక్కడా లేదు.

ఒక వస్తువు మన కంటికి బాగున్నట్లు కనిపిస్తే, దానిమీద మనకు సహజంగానే కోరిక కలుగుతుంది. చిలుకను చూసి అది అందమైనదని మానవులు అనుకుంటారు. కప్ప అందమైనది కాదని వారి భావన. అందుకని, మనుషుల్ని కొట్టి, తిట్టి, ఖైదు చేసి హింసించే శక్తి కప్పలకు వుందని మనం అనుకుందాం. ఒకవేళ అవి కనక అలా చేస్తే, మనం అవి చేసింది న్యాయమని చెప్పగలమా ?

కొన్ని దేశాలలో పరాయివారు నిరంకుశంగా పరిపాలిస్తున్నారు. వారి పట్ల ఆయాదేశాల ప్రజలు రాజభక్తి ప్రదర్శించాలనీ, అలా కనక చెయ్యకపోతే వారికి కారాగారవాసమని చెపుతున్నారు. అటువంటి పరిపాలకుల్ని ప్రపంచంలోని నీతిపరులు గౌరవించడం లేదు.

అవినీతికి పాల్పడ్డ ప్రభుత్వం వంటిదే స్త్రీల మీద పురుషులు చెలాయించే అధికారమూను - అని అందరికీ కరతలామలకం కావాలి. 'నన్ను ప్రేమించు' అని ఆజ్ఞాపించడం అవమానకరం కాదా ?

స్త్రీలు పురుషుల్ని ప్రేమించాలంటే, పురుషులు స్త్రీల పట్ల అచంచలమైన భక్తిని ప్రదర్శించాలి. భక్తియే భక్తికి మూలం. మన ఆత్మవంటిదే అయిన మరొక ఆత్మ భయంవల్ల కట్టుబడి వుంటుందనుకొనే వాడు రాజయినాసరే, భర్త అయినా సరే, గురువైనా సరే అతను మూఢుడు తప్ప మరొకడు

కాదు. అతని కోరిక నెరవేరదు. భయంవల్ల మానవాత్మ బయటికి బానిసగా నటించినా, లోపల ద్రోహచింతన కలిగివుంటుంది.

భయంతో ప్రేమను కలిగించలేము.

# స్త్రీ స్వాతంత్ర్యం

1

ఇంగ్లాండులో స్త్రీలకు ఓటింగు హక్కు యివ్వబడినట్లు కొన్నాళ్లకు ముందు రాయిటర్ వార్త వచ్చింది. ఆ విషయమై 'స్త్రీల విజయం' అనే శీర్షికతో స్వదేశమిత్రన్ పత్రికలో ఆ సంపాదకులు ఒక సూచన చేశారు. నిన్న సాయంకాలం నేనూ నా మిత్రులు వేదాంత శిరోమణి రామారావు మొదలైనవారు మాట్లాడుతూ వుండగా పై పత్రిక ప్రతితో మిట్టవీధి గోపాలయ్యర్ సతీమణి మా వద్దకు వచ్చింది. ఆమె పేరు వేదవల్లి అమ్మ.

వేదవల్లికి నలభైయేళ్లుంటాయి. తమిళమూ, ఇంగ్లీషూ బాగా చదువుకున్నది. సంస్కృతం కూడా కొంచెం తెలుసు. ఆమె భర్త గోపాలయ్యరు ధనగర్వం కొద్దీ ఉన్నత ప్రభుత్వోద్యోగం నుంచి తప్పుకొని, సతీసమేతంగా నలుగురు పిల్లలతోనూ వేదపురంలో హాయిగా నివసిస్తున్నాడు. వేదవల్లికి ఆయన స్వాతంత్ర్యం యిచ్చాడు. ఎక్కడికైనా వెళ్లవచ్చు. ఎవరితోనైనా మాట్లాడవచ్చు. వంటపని ముదలైనవి ఒక అవ్వ చూస్తోంది. వేదవల్లి పుస్తకాలు, పత్రికలు, శాస్త్ర పరిశోధన, సమావేశాలు మొదలైన వాటితో కాలక్షేపం చేస్తుంది.

వేదవల్లి వచ్చే సమయానికి నేను వేదవ్యాసులవారు రచించిన బ్రహ్మ సూత్రాలకు శంకరాచార్యులవారు సంతరించిన అద్వైత భాష్యం చదువుతూ మిత్రులతో తర్కిస్తూ వున్నాను. అప్పుడన్న మాట వేదవల్లి లోపలికి వచ్చింది. (ఏక, బహు వచనములు రెండూ స్త్రీలకు గౌరవ కారణములు.) ఆమెకు కుర్చీ చూపించాము. కూర్చున్నది. తాగడానికి కొంచెము మంచి నీళ్లు తెమ్మన్నది. పక్కనున్న కుర్రవాణ్ణి వంటింట్లోనుంచి నీళ్లు తెమ్మని పురమా

యించాను. అంతలో, 'ఏమిటో శాస్త్ర పరిశోధన చేస్తున్నారు' అని అడిగింది. శంకర భాష్యమని బదులు చెప్పాను. వేదవల్లి నవ్వింది. "శంకర భాష్యమా బాగుంది! హిందువులకు రాజ్యాధికారం కావాలని వాదించడానికి వెళ్లిన అనీబిసెంటు వలలో తగులుకుంది. ఆమె బ్రిటిష్ వనిత. మన దేశంలోని వీరాధి వీరులైన పురుష సింహాలు శంకర భాష్యం చదివి అర్థం తెలుసుకో డానికి ప్రయత్నిస్తున్నారు. బాగుంది! బాగుంది! చాలా బాగుంది!' అంది.

రామారావుకి వెంటనే కోపం వచ్చింది. "సరే లేవమ్మా అంతటితో ఆగు. తమకు తెలిసిన రాజకీయపు ఎత్తులు ఇతరులకు తెలీవని అనుకోవద్దు" అన్నాడు.

'ఇంగ్లాండులో ఓటింగు హక్కు యిచ్చేశారు' అంటూ వేదవల్లి తన చేతిలోని స్వదేశమిత్రన్ పత్రికని యించు మించు రామారావు ముఖం మీద పడేటట్లుగా విసిరివేసింది. చేత్తో దాన్ని ఆపి, కింద పడ్డ పత్రికను తీసి మెల్లిగా మేజామీద వుంచి తలకు చుట్టుకున్న ఉత్తరీయాన్ని చూస్తూ ఏదో ఆలోచనలో పడ్డాడు రామారావు. లోపలికి వెళ్లిన కుర్రవాడు మంచినీళ్లు తెచ్చాడు. కొంచెం కూడా మిగల్చకుండా మంచి నీళ్లు తాగింది. 'ఏమిటి రామారావుగారూ, పైకి చూస్తున్నారూ? పైన యేం రాసివుందని! బ్రహ్మం సత్యం, లోకం మిథ్య. అందువల్ల విద్వాంసులు ఎప్పుడూ అబద్ధాలాడుతూ వుండడం మంచిది అని రాసివుందా?' అని అడిగింది.

రామారావు గారి ముఖం కందగడ్డ అయింది. ఒకసారి మీసాలు తిప్పు కున్నాడు. గడ్డం రెండుసార్లు దువ్వుకున్నాడు. పెద్దగా నవ్వ సాగాడు. శ్రీమతి అనీబిసెంటు రాజకీయాలలో తలదూర్చి స్వదేశాభిమానం తారక మంత్రమనీ వందేమాతరం ఒకటే సజీవ మంత్రమనీ చెప్పడం రామారావుకి నచ్చలేదు. వేదాంతులు ఎప్పుడూ పరబ్రహ్మమును గురించే చింతించాలి. లౌకిక విషయాలను గురించి రవంత కూడా ఆలోచించ కూడ దని ఆయన అభిమతం.

వేదవల్లి రామారావు నుద్దేశించి యిలా చెప్పసాగింది: 'ప్రతి విషయానికీ అనీబిసెంటు చెప్పిందే ప్రమాణ మని గొంతు బొంగురు పొయ్యేలా మొన్నటిదాకా అరిచారు. ఇప్పుడు ఆవిడ స్వరాజ్యం మంచిదని వాదిస్తుంటే, ఆవిణ్ణి దుయ్య పడుతున్నారు. అయ్యో! సిగ్గు చేటు! పురుష జన్మ! స్త్రీలకు గల శక్తిలో నాలుగులో ఒక వంతయినా మగవారికి లేదుకదా! అన్ని

దేశాలలోనూ పురుషులకంటె స్త్రీలకే. ఆయుస్సు ఎక్కువ. అందువల్ల శరీర దార్ఢ్యం కూడా ఎక్కువనే స్పష్ట మయింది. తెలివితేటలూ ఎక్కువే. రామాయణంలో అబద్ధపులేడిని చూసి నిజమైన లేడి అనుకొని మోసపోయింది సీత – అని నిన్న మా యింటికి వచ్చిన ఒక తాతగారు మాటల్లో అన్నారు. సీత మాటలకు కట్టువడి దాన్ని బంధించి తీసుకురావాలని బయలుదేరిన రాముడికంటె సీతకు తెలివి యెక్కువా తక్కువా అని నేనడిగాను. తాతగారు తలవంచుకుని నోట్లో ఉంగ్రాయి పెట్టుకుని మౌనం వహించారు. అన్ని విషయాలలోనూ స్త్రీయే మిన్న. ఇందులో సందేహం లేదు.'

'ఆడవాళ్లకి మాట్లాడే నేర్పు ఎక్కువ' అన్నాడు రామారావు.

'అనీబిసెంటుకి సరిసమానమైన వ్యక్తి మన మగవాళ్లలో ఒక్కరూ లేరు. ఆవిడ గవర్నరుతోనే సంభాషించడం చూశారా? మీ రావిధంగా గవర్నరుతో మాట్లాడతారా?' అని వేదవల్లి అడిగింది.

వెంటనే రామారావు "నేను మా యింటిదాకా వెళ్లివస్తాను'' అంటూ లేచాడు. ఇరుపక్షాల వారిని ఎలాగో నేను శాంతింపజేశాను. మగవాళ్లను గురించి ఎంత ఘాటుగా మాట్లాడినా ఫరవాలేదు. కాని రామారావుగారిని మాత్రం ఉద్దేశించి ఒక మాట కూడా మాట్లాడరాదని వేదవల్లి గారికి విజ్ఞప్తి చేశాను. ఆ తర్వాత ఆమె యిలా చెప్పసాగింది.

'హిందూ స్త్రీలు రాజకీయాలలో పాల్గొని పాటు పడనంతవరకూ, యిక్కడున్న మగవారికి స్వాతంత్ర్యం కలగడానికి వీలులేదు. ఈ దేశంలో ఆదికాలపు పురుషులు ఎలాగో వున్నట్లు మనం కథలలో చదివాము. కాని యిప్పటి పురుషులను గురించి మాట్లాడడానికే ఆస్కారం లేదు. హిందూ స్త్రీలు రాజకీయాలలో ప్రవేశిస్తూ, అనీబిసెంటుకి సరిసమానంగా వాళ్లు పని చేస్తారు. కనుక ఇక్కడున్న మగవారు వేదాంత విచారానికీ గుమస్తా వుద్యోగానికీ మాత్రమే పనికివస్తారు. దేశక్షేమం దృష్ట్యా ధైర్యంగా కార్యం నెరవేరేటంత దాకా పాటుపడేశక్తి యీ దేశంలోని పురుషులకు లేదు. సరోజినీనాయుడు ఎంత ధైర్యంగా మాట్లాడుతున్నదో చూశారా? లోకంలో పురుషులకంటె స్త్రీలే తెలివితేటల్లో ఎక్కువైనవారనీ, ధైర్యం కలవారనీ నేననుకుంటున్నాను. ఇతర దేశాల మాట ఎలా వున్నా యిక్కడి స్త్రీలల్లో గల ధైర్యమూ తెలివీ మగవారికి ఏ మాత్రం లేవు. ఇంగ్లాండులో మగవారిని లోబరుచుకుని ఎంత సులభంగా వాళ్లు ఓటింగు హక్కు సంపాదించారని!

ఓహ్! ఈసారి యిక్కడి నుంచి కాంగ్రెసు వారు స్వరాజ్యం అడగ డానికిగాను ఇంగ్లాండుకి వెళ్లినప్పుడు, అక్కడున్న మగవారిని బతిమాలితే లాభం లేదు. స్త్రీలని బతిమాలాలి. అందుకు యిక్కడి నుంచి పురుషులు మాత్రం వెడితే లాభం లేదు. ఈ దేశపు పురుషుల్ని అక్కడి స్త్రీలు లక్ష్య పెట్టరు. కనుక కాంగ్రెసువారు మన స్త్రీలను పంపడం న్యాయం. నాకు ఇంగ్లీషు తెలుసు. నన్ను కనక పంపిస్తే, అక్కడి స్త్రీలను బతిమాలి ఇండియాకి ఓటింగు హక్కు వచ్చేటట్లు చూస్తాను. స్త్రీ గొప్పతనం స్త్రీకే తెలుసు. మీ వద మాట్లాడి ప్రయోజనం లేదు.'

'మరోవిషయం మాట్లాడుకుందాం' అన్నారు రామారావుగారు. తాను మాట్లాడుతూవుంటే, మధ్యలో రామారావు మాట్లాడడం వేదవల్లికి కోప కారణ మయింది. 'నేనాయన్ని ఉద్దేశించి ఒక్కమాట మాట్లాడరాదనీ, ఈయన మౌనం వహించి వుండాలనీ మొదట్లో మనం చేసుకున్న తీర్మానాన్ని అప్పుడే యీయన మరచిపోయాడు' అంటూ, కోపంతో వేదవల్లి వెళ్ళిపోయింది.

రాజీ కుదర్చడానికి నేను ప్రయత్నించాను. లాభం లేకపోయింది. 'రామారావు గారున్నచోట నే నుండ కూడదు' అని ఆమె అన్నది. ఆవిడ వెళ్లిపోయిన తర్వాత, రామారావు లోలోపల గొణుక్కున్నాడు. "ఏమం టున్నారు?" అని అడిగాను.

స్త్రీలకు స్వాతంత్ర్యం యివ్వడం చాలా అవసరమని రామారావుగారు చెప్పారు. మళ్లీ మేము శంకర భాష్యంలో మునిగిపోయాము.

## స్త్రీ స్వాతంత్ర్యం

## 2

బానిస లెవరైనాసరే, వాళ్ళకు కనక స్వాతంత్ర్య మిస్తే, తత్ఫలితంగా యుగ ప్రళయం తప్పనిసరిగా ఏర్పడి, కుడ్యాలు కూలిపోయి, ప్రపంచ మే

పతన మవుతుందని చెప్పడం, వాళ్లనింకా బానిసలుగా చేసుకోవాలని అభిలషించే పాలకుల అలవాటు.

ఇరవై ముప్ఫయి సంవత్సరాలకు మునుపు, స్త్రీవిద్య కనక ప్రచారంలోకి వస్తే, స్త్రీలు శీలభ్రష్టులవుతారని తమిళనాడులో చాలామంది పేర్కొన్నారు. ప్రస్తుతం తమిళనాడులో స్త్రీవిద్య సర్వసాధారణ మయింది. ప్రపంచ కుడ్యాలు యింకా కూలలేదు. ఇంతవరకూ బాగానే వున్నాయి. అయితే, యిప్పుడు స్త్రీలకు కనక స్వాతంత్ర్య మిస్తే ఏడులోకాలూ తప్పకుండా ముక్కలై భూమిమీద పడతాయనీ, తోకచుక్క మొదలైనవి మధ్య చిక్కుకుని పచ్చడి అవుతాయనీ పలువురు భయపడుతున్నారు. 'మదరాస్ మెయిల్' అనే ఆంగ్లదిన పత్రికా సంపాదకుని వద్దకు వెళ్లి ఇండియాకి కనక స్వరాజ్యం వస్తే యేమవుతుందని అడిగి చూడండి : 'ఓహో! హో! ఇండియాకి కనక స్వరాజ్య మి— పంజాబీవారు రాజపుత్రుల్ని చంపుతారు. తర్వాత, రాజపుత్రులు మహారాష్ట్రుల్ని మింగివేస్తారు. ఆ తర్వాత, మహారాష్ట్రులు తెలుగువారినీ కన్నడిగుల్నీ, మలయాళీలనూ నమిలి పారేస్తారు. అనంతరం మలయాళీలు తమిళబ్రాహ్మణుల్నీ తమిళ బ్రాహ్మణ ద్రావిడుల్నీ నుగ్గు నుగ్గు చేస్తారు. చూర్ణం చేయబడిన ద్రావిడులు బెంగాలీవారి యెముకల్ని మాలగా ధరిస్తారు' అని నిట్టూర్పు విడుస్తాడు. అదే ప్రశ్నను న్యాయమూర్తి మణి అయ్యరు, కేశవ పిళ్లై, చిదంబరం పిళ్లై మొదలైన వారిని అడిగి చూడండి. 'అలా అపాయ మేమీ వాటిల్లదు. స్వరాజ్యం కనక వస్తే కష్టాలు తగ్గుతాయి. కరువు కనక వస్తే, దాన్ని భరించేశక్తి కలుగుతుంది. అకాల మరణాలు తొలగుతాయి. అంతే' అని చెపుతారు.

అదే విధంగా, స్త్రీలకు స్వాతంత్ర్యం యిస్తే, మానవ సమాజం పాడయిపోతుందని చెప్పేవారు, ఇతరులు తమ కళ్లయెదుట స్వేచ్ఛగా జీవించడం తాము చూడలేక ఈర్ష్యకొద్దీ చెపుతున్నా రేతప్ప మరేమీ కాదు. స్వాతంత్ర్య మంటే యేమిటి? స్వాతంత్ర్యం ఇచ్చిన తర్వాత స్త్రీలు ఏవిధంగా ఉంటారు? వాళ్లకి స్వాతంత్ర్యం యివ్వాలంటే, ఏం చెయ్యాలి? ఇళ్లనుంచి బయటికి గెంటివెయ్యాలా? చెయ్యవలసిన పనేమిటి? అని పలువురు సందేహించవచ్చు. ఇలా అనుకున్నప్పుడే, స్వాతంత్ర్యమంటే యేమిటి? అని సమూలంగా ఆలోచించడానికి వీలు కలుగుతుంది. ఇందుకు బదులు చెప్పడం సులభమే. ఇతరులకు గాయం తగలకుండాను, ఇతరుల్ని కొట్టకుండాను, తిట్టకుండాను,

నాకు నచ్చినది నేను చెయ్యవచ్చు — అనే స్థితిలో కనక వుండగలిగితే అప్పుడు నేను స్వతంత్రుణ్ణి అని భావించ గలుగుతాను. ఇతరులకు హాని కలిగించకుండా, ఎవరికి వారు తమ యిచ్చ వచ్చినట్లు చెయ్యవచ్చు నన్నదే స్వాతంత్ర్యం — అని హెర్బర్ స్పెన్సర్ పేర్కొన్నాడు.

ఈ సూత్రం ప్రకారం చూస్తే ప్రపంచంలో ఇంకా మగవారికే స్వాతంత్ర్యం లభించలేదు. అయితే, యీ స్వాతంత్ర్య సముపార్జన కోసం ప్రతి దేశంలోనూ పురుషులు పాటుపడుతూనే వున్నారు. పురుషులలో ఒకరికొకరు బానిసలుగా వుండే క్రౌర్యం సహించరానిది. కాని యిందువల్ల కలిగే కష్టనష్టాల కంటె కొన్నివేల రెట్లు ఎక్కువగా కష్టనష్టాలు స్త్రీలను పురుషులు అస్వతంత్రులుగా వుంచడంవల్ల కలుగుతున్నాయి.

అస్వతంత్ర దేశాలలో కూడా మగవారిలో పలువురు – అనగా రహస్య పోలీసుల బాధకు పాల్పడిన వారు తప్ప యితరులు — తమ యిష్టం వచ్చిన ఊరికి వెళ్లవచ్చు. స్వైరవిహారం చేయవచ్చు. ఒంటరిగా సంచరించ కూడదనే షరతులేదు. కాని తన యిచ్ఛవచ్చినట్లు స్త్రీ ఒంటరిగా సంచరించ డానికి వీలులేని దేశాలూ వున్నాయి. వాటిలో మన దేశంలోని అత్యధిక భాగం యిమిడివుందని చెప్పడానికి చాలా విచారిస్తున్నాను.

'స్త్రీలకు కనక ఒంటరిగా సంచరించే హక్కు యిచ్చినట్లయితే, లోకాలు తప్పకుండా ఛిన్నాభిన్న మవుతాయి. ఏవిధమైన నీతీ నియమం వుండదు. మనుష్యులు మృగ ప్రాయులవుతారు' అని తమిళదేశపు ఛాందసులు కొందరు భావించవచ్చు. అలా అనుకోవడం అసమంజసం. ఐరోపాలోనూ అమెరికాలోనూ స్త్రీలు తమ యిష్టం వచ్చినట్లు పోవచ్చు రావచ్చు. అందువల్ల అక్కడ భూకంపం ఏదీ రాలేదు. శ్రీమతి అనీబిసెంటుని మనవాళ్లలో పలువురు సగౌరవంగా ప్రశంసిస్తున్నారు. ఆవిడవలె మన స్త్రీలు వుండవచ్చు గదా — అంటే మనవాళ్ళు అందుకు ఒప్పుకోవడం లేదు. కారణ మేమిటి? ఐరోపీయ స్త్రీలకంటె మన స్త్రీలు సాధారణంగా నమ్మదగని వారని అర్థమా?

'పైగా, ఐరోపీయుల్ని ఉదాహరణగా పేర్కొనడం మనకు నచ్చదు. మనం ఆర్యులం; ద్రావిడులం. మరి వారో ఐరోపీయులు!' అని కొందరు చెప్పవచ్చు.

సరే, ఇండియాలో మహారాష్ట్ర స్త్రీలు యథేచ్ఛగా సంచరించవచ్చు; తమిళనాడులో అలా జరగకూడదు. ఎందుకని ?

స్త్రీలకు స్వాతంత్ర్యం ఇవ్వడంలో యింకా ప్రాథమిక సోపానాలు ఏమిటంటే :

(1) రజస్వలాత్పూర్వం స్త్రీలకు పెళ్లి చెయ్యకూడదు.

(2) తమకు నచ్చనివారిని పెళ్లి చేసుకోవలసిందిగా స్త్రీలను బలవంతం చెయ్యకూడదు.

(3) వివాహానంతరం భర్తను వదిలివేసే హక్కు స్త్రీకి ఉండాలి. అందుకని ఆమెను అవమానించ కూడదు.

(4) పిత్రార్జితంలో ఆడపిల్లలకు సమభాగం యివ్వాలి.

(5) భర్తృ మరణానంతరం స్త్రీ మళ్లీ పెళ్లి చేసుకోవడాన్ని నివారించ కూడదు.

(6) పెళ్లి చేసుకోకుండా, ఒంటరిగా వ్యాపారం, చేతిపనులు మొదలైనవి చేసుకుంటూ గౌరవంగా జీవించదలచిన స్త్రీలను యథేచ్ఛగా వుండేటట్లు చూడాలి.

(7) స్త్రీ భర్తతో తప్ప పరాయి మగవాడితో మాట్లాడకూడదనీ, తిరగకూడదనీ భయంతోనూ ఈర్ష్యతోనూ విధించబడిన నియమాలను తొలగించాలి.

(8) స్త్రీలకు, మగవారివలె, ఉన్నత విద్యకు సంబంధించిన అన్ని శాఖలలోనూ అధ్యయనం చేసే అవకాశం కల్పించాలి.

(9) అర్హత పొంది, స్త్రీలు ఏ ప్రభుత్వోద్యోగం చెయ్యదలచినా అందుకు చట్టం అవరోధం కాకూడదు.

(10) తమిళనాడులో పురుషులకే రాజకీయ స్వాతంత్ర్యం లేనప్పుడు, అది స్త్రీలకు కావాలని చెప్పడంవల్ల యిప్పుడు లాభం కలగదు. అయినప్పటికీ, త్వరలోనే తమిళులకు స్వరాజ్యం లభించే పక్షంలో, అప్పుడు స్త్రీలకు కూడా రాజకీయ స్వాతంత్ర్యం తప్పక లభించాలి. గత సంవత్సరపు కాంగ్రెసు చట్ట సభలో అధ్యక్షత వహించినవారు శ్రీమతి అనీబిసెంటు అనే ఆంగ్ల మహిళ అన్న విషయాన్ని విస్మరించ కూడదు.

ఈవిధంగా మన స్త్రీలకు ప్రాథమిక సోపానాలు చూపినట్లయితే, తర్వాత వారు తమ ప్రయత్నంవల్ల పరిపూర్ణ స్వాతంత్ర్యం సముపార్జించి మానవ

జాతిని పరి రక్షిస్తారు. అప్పుడే మనదేశపు ప్రాచీన ఋషిపత్నులున్న స్థితిని మన స్త్రీలు చేరుకోవడానికి ఆస్కారం కలుగుతుంది. స్త్రీలను మృగములు గానే వుంచి, మనం మాత్రం మహర్షులుగా ఉండాలనుకోవడం అవివేకం. స్త్రీ పెరగకపోతే పురుషుడు కూడా పెరగడు.

## తమిళదేశపు నాగరకత

తమిళదేశపు నాగరకతను గురించి ముందు వ్యాసంలో కొన్ని సాధారణ విషయాలు పేర్కొన్నాను. ప్రస్తుతం వాటిని కొంచెం వివరిస్తాను. ప్రాచీన తమిళ నాగరకతలో స్త్రీలకు ఎక్కువగానే స్వాతంత్ర్యం ఉండేది. ఇందుకు ప్రధాన కారణాలు ఏమిటంటే : తమిళదేశానికి మలయాళదేశం సహజంగానే ఏర్పడిన సరిహద్దు. ఆ దేశపు నాగరకతకూ తమిళదేశపు నాగరకతకూ అనుబంధం ఉన్నది. స్త్రీలను ముందు నిలపడం మలయాళ సంప్రదాయం.

అతిప్రాచీన తమిళభాషా, అతిప్రాచీన మలయాళభాషా ఒకటే. తరువాతి కాలంలోనూ చేరదేశం తమిళదేశంలో అంతర్భాగంగా ఉండేది. చేరదేశీయు లందరూ తమిళులే. వారిని తమిళులుగా భావించడం జరిగింది. భాషవలె, నాగరకతలోనూ ప్రాచీన తమిళ మలయాళ నాగరకతలు ఒక్కటే.

తరువాతి కాలంలో మలైక్కోట్టై (పర్వతప్రాంతం)లోని మలయాళదేశం ప్రాచీన తమిళ నాగరకతను పరిరక్షిస్తూ వచ్చింది, వీలయినంతవరకూ. అడివారానికి తూర్పునగల భాగంలోని తమిళనాగరకత తెలుగునాడు మొదలైన ఉత్తరదేశాల ప్రభావంవల్ల రోజురోజుకీ మార్పులకు లోనయి హిందూ దేశపు నాగరకతను స్వీకరించ సాగింది.

అయినప్పటికీ, మలయాళ సంప్రదాయాలు తొలగిపోలేదు. కొండప్రాంతాల ప్రజలు, ప్రపంచమంతటా కూడా, సాధారణంగా పులి, ఎలుగుబంటు, తోడేలు మొదలైన వన్యమృగాలతో పోరాడీ, కొండవేడికీ కొండవానకూ కొండచలికీ కొండనిప్పుకీ తట్టుకునీ, అనగా కష్టాలను సహించి బ్రతుక

వలసినవారు. కాగా, తీరప్రాంతాలలో నివసించే ప్రజలవలె కాక స్త్రీల విషయంలో దయాదాక్షిణ్యాలు ప్రదర్శిస్తూ, వారిపట్ల ఆదరపూర్వకంగా ప్రవర్తించడం అలవాటు. ఐరోపాలో స్విట్జర్లాండు దేశంలోని కొండ ప్రాంతం స్త్రీలు మిగిలిన ప్రాంతాలలోని స్త్రీలకంటే ఎక్కువ స్వాతంత్ర్యంతో జీవిస్తున్నారు.

మలయాళదేశంలో మహిళలకు ఎక్కువ స్వాతంత్ర్యంతో పాటు, ఆస్తి హక్కు స్త్రీ సంతతికే సంక్రమించివున్నది. ఇటువంటి కేరళ నాగరకతతో సన్నిహిత సంబంధం కలిగి వుండడమే కాక, తమిళదేశపు నాగరకత యిక్కడున్న మహిళలకు – హిందూదేశంలోని యితర ప్రాంతాలలోని మహిళలకంటె - ఎక్కువగానే స్వాతంత్ర్యం యిస్తూ వచ్చింది. మహమ్మదీయుల ప్రాబల్యంవల్ల, ఉత్తర హిందూదేశంలో అగ్రవర్ణాలకు చెందిన హైందవస్త్రీలు ఘోషా అనే మహమ్మదీయ సంప్రదాయాన్ని అవలంబించిన రోజుల్లో కూడా, తమిళనాడులోనూ ఆ నాగరకతను అనుసరించే తెలుగు, కన్నడం మొదలైన దేశాల్లోనూ ఆ ఘోషాపద్ధతి వాడుకలోకి రాలేదు.

పైగా, ప్రపంచంలోని స్త్రీలకందరికీ నీతి నియమాలు పురుషులవల్లనే విధించబడినాయి. తమిళదేశపు స్త్రీలు కూడా రాజనీతికి సంబంధించినంత వరకూ పురుషుల శాసనాలకే బద్ధులైనా, సాంఘిక విషయంలో మాత్రం తమిళనాడులో ఎప్పుడూ సుప్రసిద్ధ కవయిత్రి అవ్వగారి మవ్వపు సూక్తులే పరమ ప్రమాణములు. పురుషులలో కూడా ఉన్నతవిద్య నభ్యసించిన వారే సాంఘిక విషయంలో తిరువళ్లువర్ వెలయించిన తిరుక్కుఅళ్, నాలడియార్ (చతుష్పది) మొదలైన గ్రంథాలను ప్రమాణంగా పేర్కొంటారు. ఎక్కువగా చదువుకోనివారూ, అసలు చదువు మొగం చూడనివారూ - పురుషులైనా సరే స్త్రీలైనా సరే - అందరికీ అవ్వగారి నీతి వాక్యాలే ప్రమాణం. సుమారు రెండువేల సంవత్సరాలుగా తమిళులలో చాలామందికి అవ్వగారి సుభాషితములే ప్రమాణం.

సామాన్యులు అవ్వగారి నీతివాక్యాలను ఆదరిస్తున్నారంటే, పండితులూ రాజులూ వాటిని తృణీకరించారని మాత్రం భావించకూడదు. పండితులకూ రాజులకూ తమిళులకందరికీ కుఅళ్, నాలడియార్ మొదలైన గ్రంథాలకంటె అవ్వగారి రచనలపట్ల అంతులేని ఆదరభావం ఉన్నది. అయితే ఈ నీతి గ్రంథాలు రెండువేల సంవత్సరాలకు మునుపు జీవించిన మొదటి అవ్వగారు

వ్రాసినవి కావనీ, సుమారు వెయ్యి సంవత్సరాలకు మునుపు జీవించిన రెండవ అవ్వగారు సంతరించినవే అనీ కొందరు భావిస్తున్నారు.

అవ్వైయార్ కేవలం కవయిత్రే కాదు. ఆమె రాజనీతి విశారదగా తమిళ దేశపు రాజుల ప్రశంసలు అందుకున్నది. ఆ రోజుల్లోనే ఆమె రాయబారిగా వ్యవహరించింది కూడా. పైగా ఆమె గొప్ప ఆత్మజ్ఞాని. యోగసిద్ధిచేత జర, రుజలకు లోనుకాకుండా ఆమె చాలాకాలం జీవించ గలిగింది.

'మచ్చ లేని తలపు మనసునం దున్నచో
దేవు డపుడు తెలియు దేహమునకు.'

అనగా, మనస్సులో కనక మచ్చ, భయం, కపటం, దోషం, వైరుధ్యం మొదలైనవి లేని భావాలను నిలుపుకోగలిగితే, అప్పుడు దేహానికి దైవాంశ, అనగా అమరత్వం, లభిస్తుందని భావం. ఈ కుఱళని చెప్పినవారు అవ్వ గారు. ఈ భావానికి అనుగుణంగా ఆమె జీవించినట్లు, ఆమె చరిత్ర మనకు వ్యక్తం చేస్తున్నది.

ఒకదేశం నాగరకతకు ఆ దేశపు సాహిత్యమే ప్రబల నిదర్శన మని యింతకుముందు వ్యాసంలో పేర్కొన్నాను. ఉదాహరణానికి, ఆంగ్లేయుల నాగరకతకు షేక్స్పియర్ మొదలైన మహాకవుల రచనలే తార్కాణం. 'మేము హిందూదేశపు రాజ్యాధికారాన్ని ఒకవేళ వదులుకోవడానికైనా సమ్మతిస్తామే కాని షేక్స్పియర్ని వదులుకోవడానికి మాత్రం ఎప్పుడూ సమ్మ తించము' అని ఆంగ్ల రచయిత మెకాలే పేర్కొన్నాడు.

ఈ విధంగా మనం ప్రముఖంగా కంబ మహాకవిని పేర్కొనవచ్చు లేదా తిరువళ్లువరుని ఉదాహరించవచ్చు. సిలప్పదికార కావ్యకర్త అయిన ఇళంగోవడిగళ్ని (ఇళంగో పూజ్య పాదులు) సూచించవచ్చు. ఇంకా కవులు పలువురిని పేర్కొనవచ్చు. అయినప్పటికీ కంబర్, తిరువళ్లువర్ మొదలైన మహాకవుల ప్రశంసలను బహుధా చూరగొన్న అవ్వగారినే మనం ప్రబలో దాహరణంగా చెప్పవచ్చు. 'తమిళదేశపు ఇతర సంపదలను కోల్పోవడం సమ్మతమా ? అవ్వగారి రచనలను కోల్పోవడం సమ్మతమా ? అని ఎవరైనా కనక మనల్ని అడిగినప్పుడు, 'ఇతర సంపదలను కోల్పోయినా అందువల్ల వచ్చే నష్టం ఏమీ లేదు. వాటిని తిరిగి సంపాదించుకునే శక్తి సంపన్నత తమిళ దేశానికి ఉంది. కాని అవ్వగారి రచనావళిని మాత్రం కోల్పోవడానికి ఎన్నడూ సమ్మతించం. అది తిరిగి సంపాదించలేని మహా సంపద' అని మనం

ప్రత్యుత్తరం యివ్వాలి. అది మన ధర్మం. తమిళదేశపు నాగరికతకు నిరుపమానమైన సంపదగా, దేదీప్యమానంగా వెలిగే జ్యోతిగా, మూర్తీభవించిన ప్రత్యేకతగా తమిళ మహిళ ఒకామె సంతరించిన రచనలు ప్రతిభాసించడం మనదేశ మహిళలకు సంతోషదాయకమైన విషయం కాదా? ఇది తమిళ స్త్రీలకు కేవలం కీర్తినొసగే అంశం కాదు. వారికిది ఒక రక్షణ వంటిది. అవ్వగారు ప్రభవించిన దేశపు మహిళలను, అవ్వగారి కోవకు చెందిన స్త్రీలను - తెలివితేటల్లో పురుషులకంటె తక్కువ అని నోరు నొవ్వకుండా చెప్పడానికి ఎవ్వరూ సిద్ధపడరు. ఇతర దేశాలలో - ఉదాహరణకి, ఇంగ్లాండు దేశమునే పరిశీలిద్దాం. అక్కడ పురుషులతో సరిసమానంగా స్త్రీలకు హక్కులు యివ్వకూడదని వాదించేవారు ఇలా అంటారు. సహజంగా తెలివి తేటల్లో పురుషులకంటె స్త్రీలు తక్కువ వారనీ అందువల్ల వారు ఇంటి పనులకే అర్హులనీ, బుద్ధి సూక్ష్మత నాధారంగా చేసుకుని నిర్వహించవలసిన దేశ పరిపాలనకు వారు అనర్హులనీ చెబుతారు. అందుకు సాక్ష్యంగా, పురుషులలో షేక్‌స్పియర్ అనే కవిరాజు సంతరించినట్టుగా రచనలు చేయగల స్త్రీ మన దేశంలో ఎప్పుడైనా జన్మించినట్టు మన మెరుగుదుమా? ఎందుకు ప్రభవించలేదు? ఇందువల్ల వ్యక్తమయ్యే దేమిటంటే పురుషుల కంటె స్త్రీలు జ్ఞానసంపదలో తక్కువవారు - ఇలా ఉంటుంది వారి ధోరణి.

కాని తమిళనాడుకి సంబంధించినంత వరకూ ఈ వాదం చెల్లదు. అందుకు బదులుగా ఈ దేశపు స్త్రీలు 'అవ్వైయార్ వలె కవిత్వమూ శాస్త్రమూ చెప్పగల ఒక మగధీరుడు యీ దేశంలో జన్మించాడా? ఎందుకు జన్మించలేదు? దీన్ని బట్టి పురుషులు సహజంగానే స్త్రీలకంటె తెలివితేటల్లో తక్కువ వారని విదితమవుతున్నది గదా!' అని వాదించే స్థితిలో ఉన్నారు.

మహిమాన్విత అయిన అవ్వైయార్ వంటి ఆత్మజ్ఞాని సంతరించిన 'అవ్వైకుఱళ్' అనే జ్ఞాన ప్రబోధాత్మక రచన తమిళ దేశపు యోగులకూ సిద్ధులకూ ఉపనిషత్తు వంటిది. యోగ శాస్త్రమునకూ మోక్ష శాస్త్రమునకూ ఈ గ్రంథం పాఠ్య పుస్తకం. పైగా, యోగానుభూతిని గురించి వ్రాసే టప్పుడు యితర రచయితలకు మహా జటిలములూ అసాధారణములూ అయిన మాటలూ వాక్యములూ వాడడం తప్పనిసరి అయింది. కాని అవ్వై రచన సుస్పష్టమైన సులభమైన తమిళ భాషలో సాగింది; అందరికీ అర్థమయ్యే విధంగా సంతరించబడింది. 'సంగ్రహంగా చెప్పి స్పష్టం

చెయ్యడం' అన్నది కవితా రచనలో సర్వోత్కృష్టమైన విధానం. ఇందులో అవ్వై అందెవేసిన చెయ్యి. అంతేకాక, అద్భుతములూ సూక్ష్మములూ అయిన అంశములను కూడా అందరికీ అర్థమయ్యే విధంగా సులభమైన శైలిలో వివరించగల శక్తి సంపన్నత దైవికమనీ, భగవద్దత్తమైన శక్తి అనీ కవి చక్రవర్తులే భావిస్తున్నారు. మామూలు కవులకిది అసాధ్యం. ఈ అద్భుత శక్తిలోనూ అవ్వైకి ఆమెయే సాటి.

చతుర్విధ పురుషార్థము లయిన ధర్మం అర్థం కామం మోక్షం - వీటిలో మోక్షమని చెప్పబడుతున్నది మాటకూ మనస్సుకీ అతీతమైనది కనక దాన్ని వివరించలేక, అందుకు సాధనమైన దైవభక్తిని మాత్రం మొదటి ప్రకరణంలో చెప్పి, మిగిలిన మూడు పురుషార్థములను వివరించి, తిరువళ్లువ నాయనార్ ముప్పాల్ (త్రివర్గము) అనే నామాంతరం కల తిరుక్కుఱళు సంతరించాడు. వెయ్యిన్ని మూడు వందల ముప్ఫయి చిన్న కుఱళ్ పద్యాలలో ఆయన ధర్మార్థ కామములనే త్రివర్గములను వివరిస్తూ గ్రంథ రచన చెయ్యడం అపూర్వమని భావించబడుతున్నది. ఇది చూసి మోక్షంతో కలుపుకొని నాలుగు పురుషార్థములకు సంబంధించిన ఒక చిన్న పద్యమును అవ్వై కవయిత్రి వెలయించింది. ఆశ్చర్యకరమైన యీ పద్యం ఈ దిగువ ఉదాహరించ బడుతున్నది.

'ఈద లఱం, తీవినై విట్టీట్టల్ పొరుళ్, ఎజ్ఞాన్డ్రుం
కాద లిరువర్ కరుత్తొరుమి త్తాదరవు.
పట్టదే యిన్బం, పరనై నినైన్ది మ్మూన్డ్రుం
విట్టదే పేరిన్బవీడు.'

[ఇచ్చుట ధర్మము, చెడుత్రోవలు వీడి ఆర్జించుట అర్థము, పొరపొచ్చెములు లేక ప్రేయసీ ప్రియులు మెలగుట కామము, ఈశ్వరుని స్మరించుచు ఈ మూడింటిని విస్మరించుట బ్రహ్మానంద సంధాయకమైన మోక్షము.]

ఈ పద్య భావం ఏమిటంటే: ఇచ్చుట అనగా లోకులకు ఉపకరించు నట్లుగా మన దేహం, ద్రవ్యం, ఆయుస్సు - యీ మూడింటినీ వినియోగించుట అని అర్థం. మన ద్రవ్యం వల్లనూ, మాటల వల్లనూ, మనస్సు వల్లనూ, చేతలవల్లనూ యితరుల కష్టాలను తొలగించి వారికి మంచి చేయుట. దానం చెయ్యడమే యిచ్చుట అని చాలా మంది పొరబడుతున్నారు. ఇతరుల కోసం మన ప్రాణమునే అర్పించడం ఇవ్వడం కాదా ? వైద్య చికిత్సవల్ల యితరులకు

ప్రాణదానం చెయ్యడం ఇవ్వడం కాదా? ద్రవ్యం మొదలైనవాటిని తనకు తానే సేకరించుకునేందుకు వీలుగా విద్యాదానం చెయ్యడం ఇవ్వడం కాదా?

కాగా, ప్రతిఫలాపేక్ష లేకుండా ఏవిధంగానైనాసరే యితరుల కష్టాలను తొలగించేందుకు తోడ్పడే కార్యం దాన మవుతుంది. ఇదే యీ లోకంలో మానవుడు అనుసరించవలసిన ధర్మం. లేదా విధ్యుక్త ధర్మం. చెడుపనులు చెయ్యకుండా, స్వబుద్ధి నుపయోగించి శారీరకంగా (అనగా పనిచేసి) సేకరించే ఆహారం గుడ్డ మొదలైన నిత్యావసర వస్తువులూ, గుర్రపు బండ్లు, ఆభరణములు, వాద్యములు, బొమ్మలు మొదలైన సౌఖ్యప్రదములైన వస్తువులూ, వీటిని అనుభవించేందుకు సాధనాలనదగిన ఇల్లూ వాకిలీ తోటా మొదలైనవీ, వీటిని సొంతం చేసుకునేందుకు తోడ్పడే బంగారు, వెండి నాణెములు కాగితం నోట్లు - మొదలైన వాటిని ద్రవ్యం లేదా అర్ధం అని వ్యవహరిస్తున్నాము. మంచి పనుల ద్వారా ఆర్జించిన విత్తం వల్లనే సుఖం కలుగుతుంది. చెడు త్రోవల వలన ఆర్జించే విత్తం వలన ఎన్నో దుఃఖాలు కలుగుతాయి. అందువల్ల చెడు త్రోవను వీడి ఆర్జించబడునదే అర్ధ మవుతుందనీ, అన్యాయార్జిత విత్తం అనర్ధహేతువనీ అవ్వగారి అభిప్రాయం.

ఇక ప్రేమకు అవ్వైయార్ ఇచ్చిన వివరణ నిరుపమానమైనది. ప్రేమ జనిత సుఖమునే మన పూర్వులు కామమని వ్యవహరించారు. విత్తనము పార్జనవల్లనూ, ధర్మాచరణమువల్లనూ పలువిధములైన సుఖములు కలుగుతాయి. అయినప్పటికీ, యివి ప్రేమకు దోహదం చేస్తున్నవి కనుకనే, వీటిని కూడా సుఖము లనవచ్చు. ప్రపంచంలో రుచ్యములైన వస్తువులు తినడం, శ్రావ్యమైన పాట వినడం, వాసనగల పువ్వులు వాసన చూడడం మొదలైన యింద్రియ సుఖాలను ఆశించి మానవులు వాటిని అనుభవించేందుకు పాటు పడుతున్నారు. అధికారసుఖం, కీర్తివాంఛ మొదలైన అసంఖ్యాకములైన సుఖములకోసం అర్రులు చాచుతారు. కాని యివి అన్నీ తుచ్ఛసుఖములని తలచి మన పూర్వులు వీటిని ప్రేమగా లెక్కించలేదు. కీర్తి, అధికారం మున్నగు వాటిని ధర్మవిభాగంలోనూ, అర్ధవిభాగంలోనూ చేర్చారు. ఇంద్రియ సౌఖ్యాలలో మధుర పదార్ధములను, ఫలములను తినుట, పువ్వులను వాసన చూచుట మొదలైనవాటిని అనాయాసంగా పొందవచ్చుననీ, ఆత్మసుఖమునకు తోడ్పడని కేవల శరీరసౌఖ్యము సుఖము కాదనీ వాటిని ప్రేమవిభాగంలో చేర్చలేదు.

చూచుట, వినుట, తినుట, తాకుట మొదలైన పంచేంద్రియ సుఖములూ కాంతివంతములైన కంకణములు ధరించే యీ స్త్రీలోనే ఉన్నవి - అని తిరువళ్లువర్ ఒక కుఱళలో పేర్కొన్నాడు. అందువల్ల ప్రాణమునకూ, మనస్సుకీ, ఆత్మకూ సుఖమిచ్చేది కనుక, ప్రేమసుఖము ఈ ప్రాపంచిక సుఖములలో కల్లా మిన్న అయినది. నాలుగు పురుషార్థములలోనూ - అనగా మానవుడు ఆశించదగ్గవాటిలో - ప్రేమసుఖమునే సుఖమనే సమష్టినామముతో వ్యవహరించారు మన పూర్వులు. ఇలా సుఖమనే పేరుతో వ్యవహరించి పేర్కొనదగిన విశిష్టసుఖము మానవుడికి ప్రేమసుఖమనే వారి అభిప్రాయం. ఆ సుఖమును పొందదగిన మార్గము ఫలానా అని కూడా అవ్వైయార్ చాలా తీయని తమిళ శబ్దాలలో వివరించారు.

ప్రియుడు ప్రేయసిని, ప్రేయసి ప్రియుణ్ణి మనస్సు వల్లను, మాట వల్లను, చేతలవల్లను, శీలభంగము కాకుండా, ఎల్లప్పుడూ ప్రేమిస్తూ, ఏకమనస్కులై, పరస్పరము ఆదరభావము కలిగి సంచరించుటవల్ల కలిగే సుఖమే కామసుఖ మనదగునని అవ్వైయార్ అభిప్రాయం.

ఇక మోక్షమును పరిశీలిద్దాము. ఈశ్వరుని మనస్సులో నెలకొనేటట్లు చేసి, అహంకారమునకు స్వస్తి చెప్పి, ఈశ్వరధ్యానము కావిస్తూ పై మూడు పురుషార్థములను త్యజించి మెలగడమే మోక్షం. ముక్తిని పొందుటవల్ల, ఒకడు మిగిలిన మూడు పురుషార్థములతోనూ ఏవిధమైన సంబంధం పెట్టుకోకుండా, నిష్క్రియుడై ఉంటాడని భావించడం పొరపాటు. ప్రాణమున్నంత దాకా పనీపాటు చెయ్యకుండా వుండేందుకు భగవంతుని ప్రకృతి చోటివ్వదు. (ఎలాగయినా (మనోవాక్కర్మలవల్ల) ఏదైనా ఒక పని చెయ్యకుండా ఊరికే కూర్చోవడానికి ఒక్కక్షణం కూడా వీలు కాదు. ప్రకృతి సహజంగా యేర్పడే గుణములవల్ల ఒక్కొక్కడూ తనకు తెలీకుండానే ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూ వుండడానికి ప్రేరేపించబడతాడు — అని కృష్ణుడు భగవద్గీతలో పేర్కొన్నాడు.)

ఇంకా అవ్వగారి రచనలలోని సూక్తులను ఉదాహరించి, ఆ కవయిత్రి ధీశక్తిని సవివరంగా తెలియజెయ్యాలంటే, ఒక గ్రంథం వ్రాయవలసివస్తుంది. ఈ వ్యాసం ఇప్పటికే దీర్ఘమయింది. అందువల్ల ఈ కవయిత్రిని గురించి యిప్పటివారు తెలుసుకోవలసిన విషయాలలో, నాకు ముఖ్యమని తోచిన వాటిని మరొక వ్యాసంలో సంగ్రహంగా చెప్పాలని ఆశిస్తున్నాను.

నా ఆదరమునకూ అభిమానమునకూ పాత్రులైన తమిళదేశపు మహిళలైన సహోదరీమణులారా! ఇంత గొప్ప తమిళనాగరకత యొక్క భవిష్యత్తు మీ శిక్షణ మీదా మీ ప్రయత్నముల మీదా ఆధారపడివున్నది. ప్రపంచంలో సాటిలేని ఒక మహానిధిని పరిరక్షించేందుకు భగవంతుడు మిమ్ము కాపలాగా నియమించి వున్నాడు. కాని ప్రస్తుతం ప్రచండ మారుతములవంటి మార్పులతోనూ విప్లవములతోనూ ఉద్యమములతోనూ మానవ లోకం కొట్టుమిట్టాడుతున్నది; భీకర సముద్రంలోని ఒక చిన్న పడవవలె కిందుమీదులవుతూ, అటూ యిటూ ఒరుగుతూ పయనిస్తున్నది. ఈ మహా ప్రళయకాలంలో తమిళనాగరకత చెదరిపోకుండా సురక్షితంగా ఉండేందుకు భగవంతుడు అనుగ్రహించుగాక! అందుకుగాను తగిన చదువు సంధ్యలు, మంచి నడవడి, స్వాతంత్ర్యం మొదలైనవాటితోపాటు, దాన్ని పరిరక్షించ గల శక్తిసంపన్నతనూ మీకా పరబ్రహ్మము అనుగ్రహించుగాక!

# వ్యాసములు : సమాజము

1. కులభేదాలు
2. పాత లోకం
3. మృగములూ పక్షులూ
4. అనంత శక్తి
5. తమిళము
6. స్వాతంత్ర్యము
7. నాగరకతకు మూలం

## కులభేదాలు

ఇండియాలో గొప్పచిక్కులు రెండు. డబ్బు లేకపోవడం ఒకటి. కుల భేదాలకు సంబంధించిన గందరగోళం మరొకటి. డబ్బు లేకపోవడం వల్ల తగినంత ఆహారం లేక యిబ్బంది పడవలసి వస్తున్నది. ఈ ఇబ్బందిని తొలగించాలంటే, మనదేశంలో పండే ఆహారధాన్యాలను ఇతర దేశాలకు ఎగుమతి చెయ్యకుండా ఉండడమే. ఇంగ్లాండు మొదలైన కొన్ని దేశాలలో అయితే పొద్దున్నే చేపలు కావాలంటే, అవి దక్షిణ అమెరికానుంచి రావాలి. వెన్న యేమో ఆస్ట్రేలియా నుంచి రావాలి. కాని యీ దేశస్థుల పరిస్థితి అటువంటిది కాదు. ఈదేశపు గడ్డలో ఇక్కడున్న వారి కందరికీ తగినంత ఆహారం లభిస్తున్నది. అందువల్ల, తగినంత డబ్బు చేత ఉంటేనే తిండి దొరుకుతుందనే పరిస్థితి కాదు మనది. ఆహారధాన్యాల ఎగుమతిని ఏ క్షణంలో అయితే మనం నిలిపివేస్తామో, ఆ క్షణం నుంచీ మన ప్రజలకు నిరాఘాటంగా పుష్కలంగా ఆహారం లభిస్తుంది. ఈ విషయంలో మనం కృతార్థులం కావాలంటే, మన వ్యాపారస్థులు కేవలం తమ కడుపులు నింపుకోవాలనే ఆశయాన్ని విడిచిపెట్టి, తమకు లాభాలు వచ్చేటట్లుగాను సామాన్య ప్రజలకు ఇబ్బంది కలగకుండా వుండే విధంగానూ వారు వ్యాపార విధానాలు అవలంబించాలి. అందుకు మనం కృషి చేయాలి. ఇలా మన దేశంలోనే ఆహార ధాన్యాలను జాగ్రత్త చేసుకుని, ఆయా గ్రామాలలో మరీ నిరుపేదలుగా వుండే వారిచేత తగిన పనులు చేయించి, వారికి కావలసినంత ఆహారపదార్థాలు ఇవ్వాలి. ఇలా చెయ్యడం ఏమంత కష్టం కాదు.

పూరి (జగన్నాధం) ఆ ప్రాంతాలలో ప్రస్తుతం ఘోరమైన దుర్భిక్షం విలయతాండవం చేస్తున్నది. మనదేశంలో రాజులు, పెద్దపెద్ద భూస్వాములు, షాహుకార్లు, శాస్త్రుల్లు, వ్యాపారస్థులు, వకీళు, ఉన్నతోద్యోగులు మొదలైన వారు అజీర్ణవ్యాధి వచ్చేలా ఆహారపదార్థాలను మెక్కుతూ వుండగా, ప్రపంచంలో మరేదేశంలోనూ లేనట్టుగా ఇండియాలో మాత్రమే తీరని

మారని క్షామం బయలుదేరి ప్రజలను రూపుమాపుతున్న ఘోరాన్ని అరికట్టేందుకు మార్గము లేమిటో వారు ఆలోచించకుండా ఉండడాన్ని చూసి నేను పరితపిస్తున్నాను. ఇన్ని యిబ్బందులతో పాటు జటిలమైన కులవ్యవస్థ కూడా యిబ్బందులు కలిగిస్తున్నది.

చాలావరకు నిమ్నజాతులవారే నిరుపేదలుగా ఉన్నారన్న విషయాన్ని మనం విస్మరించకూడదు. వారికే చాకిరీ కూడా ఎక్కువ. ఎక్కువగా పరిశ్రమించేవారికి ఎక్కువ బలం కూడా ఉంటుంది. ప్రపంచం మొత్తంమీదా అధర్మం ఉన్నది. అయినప్పటికీ, మనదేశంలో వలె మరెక్కడా కూడా యింత నీచమైన పరిస్థితి లేదు.

ఈ ఊళ్లో (కడైయంలో) ఒక ధనవంతుని యింట్లో శుభకార్యానికిగాను శంకరనాయనార్ కోయిల్ అనే ఊరినుంచి ఒక యేనుగుని తీసుకువచ్చారు. అది 18 యేళ్ల మగయేనుగు. దానికి మహా మదం! దాన్ని చూడడానికి ఈ ఊళ్లోనివారు గుంపులు గుంపులుగా వెడుతున్నారు. ఇవాళ పొద్దున నేనూ నా మిత్రుడు ఒకాయన కలిసి ఆ యేనుగుని చూడడానికి వెళ్లాము. ఆ యేనుగుకి సంబంధించిన ముఖ్యవిషయ మేమిటంటే: ఇద్దరు బ్రాహ్మణ యువకులూ, ఒక శైవ ఓదువార్ (గురుక్కళ్ - పూజారి) యువకుడూ - దీనికి మావటీలుగా ఉన్నారు. సాధారణంగా మహమ్మదీయులూ, హిందువులలో కొన్ని జాతులవారూ మావటీలుగా వుంటారు. ఈ యేనుగుకి బ్రాహ్మణ మావటీలు లభించారు.

ఆ బ్రాహ్మణ యువకులలో ఒకనితో నే నీ యేనుగుని గురించి మాట్లాడుతూ వున్నాను. నేను ఏటికి వెడుతూవుండగా అతను యేనుగుని దయాదాక్షిణ్యాలు లేకుండా కొట్టడం చూశాను. ఆ విషయాన్ని అతనికి గుర్తు చేసి, 'జంతువుల్ని ప్రేమ పూర్వకంగా పెంచాలి. జాలి లేకుండా కొడుతూ మచ్చిక చేసుకోవడం మంచిది కాదు' అన్నాను. నే నీ మాట అనడం తరువాయి, అతను శాస్త్రం కవిలి కట్టవిప్పి యింక యేకరువు పెట్టడం మొదలుపెట్టాడు. ఆ మావటీడు యిలా అన్నాడు: 'ఈ యేనుగు తక్కువ జాతి యేనుగు. ఏనుగులలో బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులనే నాలుగు ప్రధానమైన జాతు లున్నవి. ఒక్కొక్క జాతిలోనూ ఉపశాఖ లున్నాయి. వాటిలో ఇది శూద్రజాతికి చెందినది. శూద్రులలో 'ఈళవర్' అనే జాతివారున్నారు అలాగే, యీ యేనుగు వీరన్ అనే జాతికి చెందింది....'

ఇలా మావటీడు ఒక కథ చెప్పాడు.

నే నిక్కడ యీ కథను ఎందుకు ఉదాహరించానంటే, మన మనస్సుల్లో ఈ జాత్యభినివేశం ఎంత లోతుగా పాతుకుపోయిందో తెలపడం కోసమే. ఏనుగుల్లో బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు! గుర్రాలలోనూ అలాగే. ఆకాశంలోని గ్రహాలలోనూ అలాగే బ్రహ్మ క్షత్రియాది భేధాలు. రత్నాల లోనూ ఇటువంటిదే వర్ణభేదం!

ఇలా జాతి భావన పాతుకుపోయిన మన దేశంలో మానవ స్వాతంత్ర్యం, సమత్వం, సహోదరత్వం అనే లక్ష్యాలు సాధించడమంటే సాధ్యమయ్యే కార్యమేనా? జాతులు ఎన్నెన్ని! వాటిలో ఉప జాతులు! 'పఱై' పద్దెనిమిదట! 'నుళై' నూటెనిమిదిట! అనగా మాలవారిలో పద్దెనిమిదీ, నుళైయలలో నూటెనిమిదీ భేదాలూ ఉన్నవట. పైగా పఱైయన్ (మాల), పళ్లన్ శక్కిలియన్ (మాదిగ) - వీళ్లంతా వేర్వేరు జాతులవారట. వీళ్లల్లో పంక్తి భోజనం లేదు. పిల్ల నివ్వడం, పిల్లను పుచ్చుకోవడం లేదు. ఏమిటీ విపరీతం? ఇలా యిప్పటికే పెరిగిపోయిన జాతులు చాలవని, రోజు రోజుకీ కొత్త కొత్త జాతులు ఏర్పడుతున్నవి. సంస్కరణాభిలాషులలో కొందరు తమకు తెలియకుండానే కొత్త జాతులు ఏర్పాటు చేస్తున్నారు. కడైయంలోని వేళాల కులస్తులలో (శూద్రులు, వ్యవసాయం చేసేవారు.) ఇంగ్లీషు చదువుకున్న కొందరు తాము 'ద్రావిడ బ్రాహ్మణులము' అని చెప్పు కుంటూ, వంశానుగతంగా వస్తున్న 'పిళ్లై' అనే పేరుకి బదులుగా 'రాయర్' అనే పేరు తగిలించుకుంటున్నారు. ఒక ఉదాహరణ. ఒకాయన పేరు ఆండియాప్పిళ్లై. ఆయన సర్కారువారి అనుమతితో దాన్ని ఆండియప్ప రాయర్ అని మార్చుకుని, ఆ పేరుతోనే అన్ని వ్యవహారాలు సాగిస్తున్నాడు. ఈ ద్రావిడ బ్రాహ్మణుని రాయర్ పట్టం ఎలా వచ్చిందో తెలుసుకోవ డానికి మార్గం లేదు.

ఇలాగే కొన్నాళ్లకు మునుపు వళ్లువులు (నిమ్మ జాతివారని అంటారు) తంజావూరు జిల్లాలో ఒక సభ జరిపి తాము పై జాతివారమనీ, ఇతర మాల వారిని తాకరాదనీ, పంచాంగం మొదలైనవి చెప్పకూడదనీ, ఒకవేళ వీటిని అతిక్రమించే వళ్లువుల్ని అదుపులో ఉంచాలనీ కరపత్రాలు అచ్చు వేశారు. దీన్ని చూసి భరించ లేకపోయిన శ్రీ వి. యల్. పెరుమాళ్ నాయర్ అనే వళ్ళువ కులస్థుడు 'వళ్ళువులు మాలవారే, పంచములే' అని సుస్పష్టం చేస్తూ

గత గురువారం (జూన్, 3 వ తేది) స్వదేశమిత్రన్ పత్రికలో చక్కని వ్యాస మొకటి వ్రాశాడు. అది చూసి నేను చాలా సంతోషించాను.

కాని అదే వ్యాసంలో నాయనార్ చతుర్ధ కులజులైన వేళాళర్ నుంచి మాల వారు విడివడినవారని చెప్పడం అసమంజసం. ఆయన యిలా చెప్పడానికి ఆధారమేమిటో అందులో వివరించలేదు. కేవలం జాతి ద్వేషం వల్లనే యిలా చెపుతున్నారని అనిపిస్తున్నది. వ్యర్ధ కలహాల వల్ల లాభం కలగదు.

## పాత లోకం

ఈ ప్రపంచం బహు ప్రాచీనమయింది. దీన్ని ఆకృతి కొత్తగా కనిపిస్తుంది. ప్రకృతి యేమో పాతది. ఒంటరి వేపచెట్టు చచ్చిపోతుంది. మళ్ళీ వేప మొక్క పుడుతుంది. వేప జాతి యెప్పటికీ ఉంటుంది. భూమి ఉన్నంత వరకూ ఎండ యిలాగే కాస్తూవుంటుంది. వాన, గాలి, పుట్టుక, పెరుగుట, వ్యాధి, మరణం, స్వాతంత్ర్యం, సెబ్బర, సంతోషం, దుఃఖం, భక్తి, విస్మృతి, కష్టం, జుట్టు నెరవడం - ఇవన్నీ ప్రతి యుగంలోనూ ఉన్నవే.

ఉపకరణాలు మారుతున్నాయి. ప్రకృతి సాగిపోతున్నది. ఎందుకు చెబుతున్నానో తెలుసునా? మనకు తెలియకుండానే ఆకాశంనుంచి కొత్త నాగరికత ఒకటి వచ్చినట్టుగా బడి పిల్లలు కొందరు మాట్లాడుకుంటున్నారు. నేనది నమ్మలేదు. ప్రపంచం పాతది.

బీదవారికి ఎప్పుడూ కష్టాలే. ధనవంతుడికి పలువిధములైన సౌఖ్యాలు. గుడిని అంటి పెట్టుకున్న వాడికి కరువు లేదు. దేవుళ్లలో చాలా వరకు సగం రాయి, సగం దేవుడూను. పూర్తి దేవుడే కనక గుడిలో నెలకొంటే వెంటనే కృతయుగం రాదా?

ఏ దేశంలోనైనా సరే ఏ యుగంలోనైనా సరే యీ పరిస్థితికి భిన్నం లేదు. ఎవడి చెయ్యి పైన ఉంటుందో, వాడికేమి ఫరవాలేదు. కష్టమంతా బీదవాడిదే.

దరిద్రుడు, ధనికుడు - అనే భేదం పూర్వం ఎలా వ్యాప్తిలోకి వచ్చింది? ప్రజలు, సేన - అని మానవ జాతీలో ఎందుకు ఏర్పడ్డాయి ? అంతా కలిసి, సేద్యం చేసి, జీవించే గ్రామంలో భేదం ఏ కారణాల వల్ల వచ్చింది ? వీటిని పరిశీలించాలి. కాని యిప్పుడు సమయం లేదు. దరిద్రుడు, ధనికుడు - ఈ విషయాన్ని మాత్రం యిప్పుడు పరిశీలిద్దాం.

వ్యాపారం మూలంగా దరిద్రుడైన ఒక సెట్టి తమ యింటి పంచాంగపు బ్రాహ్మణ్ణి 'ధనికుడు కావాలంటే ఏం చెయ్యాలి ?' అని అడిగాడు. 'నవగ్రహ పూజ చేయించండి' అని ఆ బ్రాహ్మణుడు బదులు చెప్పాడు. అయితే ఎంత ఖర్చువుతుందని సెట్టి అడిగాడు. పది బంగారు నాణెములు కావాలని అతడు బదులు చెప్పాడు. అప్పుడు సెట్టి యిప్పుడు నా దగ్గర చిల్లిగవ్వకూడా లేదు. ఈ పరిస్థితులో ఏం చేస్తే డబ్బు వస్తుందని మీ శాస్త్రం చెపుతున్నది. అది మాత్రం సెలవియ్యండి ? అని అడిగాడు.

అందుకు బ్రాహ్మణుడు అన్నాడు గదా : పోయిన జన్మలో నువ్వు బ్రాహ్మణులకు మంచి దానాలు చెయ్యలేదు. అందువల్ల యీ జన్మలో నీ కీ పరిస్థితి యేర్పడింది. నీకు తగిన ప్రాయశ్చిత్తం మా శాస్త్రంలో లేదు. ఈ జన్మలో యికనైనా పుణ్యకార్యాలు చేస్తే తరువాతి జన్మలోనైనా నీకు ధన ప్రాప్తి కలుగుతుంది.

ఇలా బ్రాహ్మణుడు చెప్పడం సెట్టికి నచ్చలేదు. అది లాభదాయకమని నాకు తోచలేదు. తరువాతి జన్మలో నేను మరొక మానవుడనై ధనవంతుణ్ణి కావడం వల్ల, ప్రస్తుత జన్మలో నాకే విధంగాను లాభం లేదు. తరువాతి జన్మ గురించి నా కంతగా ఆసక్తి లేదు. ఈ జన్మలోనే ధనార్జన చెయ్యడం సముచితం. రాబోయే జన్మలోని డబ్బు కోసం యిప్పుడు యాతన పడడం అవివేకం.

మృగాలూ పక్షులూ కూడా కక్షకొద్దీ తమ కులాన్ని తాము నాశనం చేసు కోవని అనుకుంటున్నాను. మానవ మృగానికి మాత్రం ఈ అలవాటు చాలా కాలంగా ఉంది. హెూమర్ కాలం మొదలుకొని కాన్‌స్టన్‌టైన్ రాజు కాలం దాకా యవనదేశంలో యుద్ధం నిలువలేదు. హాని అన్నది ప్రతియుగంలోనూ ఉన్నదే. విషానికి విరుగుడలనూ, వ్యాధికి మందునీ అవివేకం తొలిగేందుకు విద్యను ఏ కాలంలోనైనా వెతకవచ్చు. అందుకు అన్ని కాలాలలోనూ ఉపాయాలు ఒకే రకంగా ఉంటాయి కాని వివిధములుగా ఉండవు. ఉప

కరణాలనే మానవులు మార్చివేస్తున్నారు. అంతే తప్ప ప్రాచీనతను విడవ కుండా అనుసరిస్తున్నారు.

ఒక వ్యాపారంలో లాభం రావాలంటే, ఒకేసారి సూర్య మండలానికి వెళ్ళడం వీలుపడదు. పాత పద్ధతి ప్రకారం, మెల్లిగా మెట్టు మెట్టుగానే వెళ్లాలి. బెదిరితే పని కాస్తా చెదిరిపోతుంది. మెల్లిగా వెళ్ళేవాడే లక్ష్యసిద్ధి పొందుతాడు. పాత పద్ధతే మంచి దోవ. అదే ఎప్పుడూ అనుసరించదగింది. లోకంలో అన్ని పనులూ అంచలు అంచలుగానే జరుగుతాయి. ఒక్కసారిగా పైకెక్కితే, ఒక్కసారిగా కిందపడవలసి వస్తుంది, గాలి పటంలా. సూర్యుడు ఒకే విధంగా ముందుకి సాగుతున్నాడు. అతడు మార్గం తప్పడు. అటూ యిటూ ఒరగడు. ఎప్పుడూ పైకి వెడుతుంటాడు. వ్యాపారానికి పాత పద్ధతే మంచి దోవ.

## మృగములూ పక్షులూ

'జగతిలో అహింస సాగవలయు నంచు
వాకొనుటయె నాదు వ్రతము సుమ్ము.'

— తాయుమానవర్

లౌకిక విషయాలలో మహా ఘటికుడూ, వేదాంత శాస్త్రంలో అభినివేశం కలవాడూ అయిన నా మిత్రులొకరు (గోపాలపిళ్లై అని పేరు పెడు తున్నాను.) ఇవాళ మధ్యాహ్నం నాతో మాట్లాడుతూ వున్నాడు.

ఆయన అన్నాడు గదా: 'మీరు పత్రికలకు వ్రాసేటప్పుడు ఏ వర్గం వారికీ కష్టం కలగని విధంగా వ్రాయడం మంచిది. కటూక్తులకు కాదు, మృదూక్తులకు ఎటువంటివారైనా సంతోషిస్తారు. ఇతరులకు కోపం కలగని విధంగా వ్రాయడానికి ఎంతో అవకాశం ఉన్నది. ప్రపంచాన్ని సంస్కరిం చాలనీ, లోకులకు వీలయినంత వరకూ ఉపకారం చెయ్యాలనీ - యీ ఉద్ధేశాలతోనే మీరు పత్రికలకు వ్యాసాలు వ్రాస్తారు. ఈ ఉద్దేశాలు కనక

త్వరగా నెరవేరాలంటే, అణు మాత్రమైన కోపం లేకుండా తొందర పడకుండా, ఎవరి మనసునీ నొప్పించకుండా, మంచి మాటలతో వ్రాయడమే శ్రేయస్కరం.'

ఇది విని నేను 'చాలా బాగా చెప్పారు మీరు. ఇదే నా అభిప్రాయం కూడాను. కాని స్త్రీల పరిస్థితి, తక్కువ జాతుల వారి పరిస్థితి, బీదవారి పరిస్థితి, మృగములు పక్షుల పరిస్థితి - వీటిని గురించి వ్రాసేటప్పుడు, స్త్రీలు మొదలైన బలహీన వర్గాల వారిపట్ల దయాదాక్షిణ్యాలు లేకుండా ప్రవర్తించే మనుషులంటేను ఒక్కొక్కసారి నాకు ఎక్కడలేని కోపం వస్తూవుంటుంది. ఈ కోపాన్ని కూడా ప్రయత్న పూర్వకంగా తగ్గించుకుంటాను. మీరు చెప్పి నట్లుగా ఎప్పుడూ సహనంతో ఉండడానికి సహర్షంగా ప్రయత్నిస్తాను. ఎందుకంటే, మీరన్నట్లుగా మన లక్ష్యసిద్ధికి కోపోక్తులే అడ్డు తగులుతూ వుంటాయి. మేకలూ గొర్రెలూ తినేవారిని మనం నోటికి వచ్చినట్లు తిడితే, అందువల్ల వాళ్లకు మనమంటే కోపం కలగడమే కాక, వారి మాంస భక్షణను నివారించేందుకు మార్గం కనిపించదు కూడా. తగిన ఉపత్తులు చూపి, వారికి కారుణ్య భావం కలిగించడమే మానవులమైన మనం అనుసరించవలసిన ధర్మం' అన్నాను.

అప్పుడామిత్రుడు 'మృగాలను చంపి, తినే అలవాటుని తలచుకుంటేనే, నాకు ఎక్కడలేని చిరాకు పుట్టుకు వస్తుంది. వాటిని చంపేటప్పుడు మీరు చూశారా ? మేకను చంపేందుకు ముందు, అది అటూ యిటూ తల ఆడిస్తే దెబ్బ సరిగా పడదని, దాని కెదురుగా పచ్చని కొమ్మను వుంచుతారు. దాన్ని తినే వుద్దేశంతో అది సూటిగా ముఖం పెట్టే సమయం చూసి, ఉన్నట్లుండి ఒకే ఒక దెబ్బతో దాని తలను రెండు ముక్కలు చేస్తారు. అలా చంపేటప్పుడు కనక చూస్తు చంపేవాని పట్ల మనకు అంతులేని కోపం కలుగుతుంది. అతన్ని క్షమించడానికి మనస్సు ఒప్పుకోదు. ఇంత సులభంగా ఒక మేకను చంపి తింటున్నారు ; కాని ఒక మేకకు ప్రాణం యివ్వగలరా వీళ్లు ?

'కొన్నాళ్లకు మునుపు శంకరనాయనార్ కోయిలుకి దగ్గర్లో ఒక గ్రామానికి వెళ్లాను. అక్కడ ఒక మాడసామి గుళ్లో చాలామంది జనం చేరారు, పూజ కోసం. ఆ మాడసామి యెవరో తెలుసా ? ఆ గ్రామంలో చాలా సంవత్స రాలకు మునుపు ఒక మఱవన్ (జాతిపేరు) ఉండేవాడు. దొంగతనాలు చెయ్యడంలో అతను ఘటికుడు. కాని నిరుపేదులంటే మాత్రం మహాజాలి.

అతను మరణించిన తర్వాత, అతన్ని అక్కడ సమాధి చేసి, ఆ సమాధి మీద ఒక గుడి కట్టి, ఆ మఱవజాతివాణ్ణే మాడసామిగా చేసి, ఆ చుట్టుపక్కల గ్రామాలవాళ్లు అతన్ని పూజిస్తున్నారు. ఆ గుళ్లో జరుగుతున్న వేడుకను చూసేందుకు కొందరు మిత్రులతో కలిసి అక్కడికి వెళ్లాను. అక్కడ రెండు మూడు వందల గుంజలు నాటి వాటికి మేకల్ని కట్టివుంచారు. అవి కొన వూపిరితో భాధపడడం నేను చూడలేదు. అప్పుడు కనక చూసివుంటే నా మనస్సు ఎంతగా భాధపడి వుండేదో నాకు తెలీదు. అవన్నీ చచ్చిపోయి. నెత్తురు కారుతూ వుండగా చూశాను. ఆ దృశ్యం తలుచుకుంటేనే, యిప్పుడు కూడా నా ఒళ్లు జలదరిస్తోంది. అబ్బా! ఎంత మహాపాపం!' అని చెప్పి, నా మిత్రుడు గోపాలపిళ్లై పరితపించాడు.

అప్పుడు నేనిలా అన్నాను: 'కొన్నాళ్లక్రితం పారసీకపు నామమాత్రపు రాజయిన షా చక్రవర్తి బాగ్దాద్ నగరానికి తిరిగి వచ్చాడట. అంటే, ఆయన ఐరోపాలో పర్యటన ముగించుకుని, స్వదేశానికి వస్తూ దోవలో బాగ్దాద్ నగరానికి విజయం చేశాడన్నమాట! అప్పుడు ఆయన రాక నుద్దేశించి ఎనభయ్యో నూరో మేకల్ని చంపినట్లుగా స్వదేశమిత్రన్ పత్రికకు సమాచారం అందింది. అది చదవగానే నా కడుపులో కెలికినట్లనిపించింది. కాని మన దేశంలోని చిల్లరదేవుళ్ల గుళ్లలో పూజాసమయాన, కొన్నిచోట్ల వెయ్యి మేకలు, పదివేల మేకలు - అలా చంపబడుతున్న విషయాన్ని తలుచుకుంటే నాకు అంతులేని కోపం వస్తుంది.

తిరునెల్వేలికి దగ్గరగా కురంగిన్ యమ్మన్‌గుడి అనే గుడి ఒకటి ఉంది. అక్కడ ఉత్సవ సమయాలలో లెక్కలేనన్ని మేకల్ని చంపుతారని విన్నాను.

'ఇదేవిధంగా చెన్నపట్టణానికి దగ్గరగా ఉన్న ఒక గ్రామంలో ఒక అమ్మవారి గుడి ఉంది. ఇంకా దేశమంతటా యిటువంటి అమ్మవారిగుళ్లు ఎన్నో ఉన్నాయి. వీటిలో జరిగే జంతుబలిని ఆపమని ఆయాగుళ్ల ధర్మకర్తల్నీ, ప్రజానాయకుల్నీ - వాళ్ల కాళ్ల మీద పడి అర్థించనున్నానని పత్రికకు వ్రాస్తాను. కోపోక్తులవల్లనూ, దూషణవల్లనూ లాభం లేదన్నారుగదా ఇంక మనమేం చేద్దాం?' అన్నాను.

ఇలా చాలాసేపు జీవహింసను గురించీ, దానివల్ల మానవులకు కలిగే లెక్కలేనన్ని పాపములను గురించీ, అందువల్ల ఏర్పడుతున్న మరణములను గురించీ మాట్లాడుకుంటూ వున్నాము. ఆ మాట లన్నిటినీ యిక్కడ

ప్రాసేందుకు చోటు లేదు. అయినప్పటికీ, గోపాలపిళ్లైకి నేను వాగ్దానం చేసి నట్టుగా ఒక విజ్ఞప్తి చేస్తున్నాను: 'తమిళదేశపు ప్రజానాయకులారా, మీ కాళ్లమీద పడి కోటిసార్లు నమస్కరిస్తున్నాను. మాంసాహార నిషేధానికి మార్గమేదైనా చూడండి.'

## అనంతశక్తి

చచ్చిపోయిన పురుగుని చీమ లాక్కొని పోతున్నది. ఎందువల్ల? శక్తి వల్ల. అనేక లక్షల యోజనాల పొడవుగల తన తోకను లాక్కొని తోక చుక్క మహావేగంతో అంతరిక్షంలో పయనిస్తున్నది. ఎందువల్ల? శక్తి వల్ల. ఆ ధూమకేతు డెబ్భయ్ అయిదు సంవత్సరాలలో ఒక మండలంగా తనను ప్రదక్షిణం చెయ్యవలసిందిగా సూర్యగోళం ఆజ్ఞాపిస్తున్నది. ఎందువల్ల? శక్తి వల్ల.

ఒక కన్నె పడుచు పాడుతోంది. నెపోలియన్ ఐరోపా ఖండము యావత్తూ జయించ గలిగాడు. ఈ రెండింటికీ శక్తియే ఆధారం. కంటికి కనిపించేదీ, దీక్షకు గోచరించేదీ అయిన అంతరిక్షం కూడా అంతులేనిదని పండితులు కనుగొన గలిగారు. హద్దు లెరుగని యీ ప్రపంచాన్ని నడిపిస్తున్న శక్తి కూడా ఎల్లలెరుగనిది, అనంతమైనది. దానికంటె పెద్దది. ఇటువంటి శక్తిని గురించి మానవుడు భావించ గలిగితే, పలువిధములైన ప్రయోజనాలు అందువల్ల కలుగుతాయి. 'యద్భావయసి తద్భవసి.' నీవు దేన్ని భావిస్తున్నావో నీవు ఆ విధంగా రూపు దాలుస్తున్నావు.

అయితే, యిలా భావన చెయ్యడమన్నది సులభమైన పని అనుకో కూడదు. మహా శ్రద్ధగా భావన చెయ్యాలి. ఎంతో భక్తితో ధ్యానం చెయ్యాలి, ఇదంతా ఏదో కథగా భావించ కూడదు. పట్టు విడవకుండా దీక్షగా కనక చేస్తే, ఫలితం కనిపిస్తుంది.

జ్ఞానులూ యోగులూ అని వ్యవహరించబడే వారు ఈ శక్తిని, బాగా గ్రహించి కొన్ని పద్ధతులు అవలంబించి, పొందగలుగుతున్నారు. శక్తి

కొంచెమైనా లేకపోతే, ఒక్క క్షణమైనా శ్వాస పీలుస్తూ ఎవరూ ఈ లోకంలో మనలేరు. బయట గాలితో కలిసి మెలిసి సంచరించడంవల్ల ఆ శక్తి యేర్పడుతున్నది. శరీరమును కృషికి వినియోగించడంవల్ల, బయట అంతా నిండి నిబిడీ కృతమైన శక్తి అందులో చోటు చేసుకుంటున్నది. జ్ఞానమును పలువిషయములలో శ్రద్ధగా చొప్పింపజేసి, పరిశ్రమించుట వల్ల శక్తి యేర్పడుతున్నది. ఇలా కొంచెం కొంచెంగా ఏర్పడే శక్తి వల్లనే లోకంలో మానవులు జీవించి వున్నారు.

తమిళులకు ఇతోధికంగా శక్తి వృద్ధి కావాలన్నదే మా లక్ష్యం. ఈ లక్ష్యాన్ని నేరవేర్చుటకు గాను మనం ప్రభవిస్తున్నాము. 'తల్లీ, ఈ దేశపు ప్రజలకు శక్తి వృద్ధి అయ్యేటట్లు చేయుము ; ఆ కార్య సిద్ధికి తగిన శక్తిని నాకు అనుగ్రహించుము' అని మనలో ఒక్కొక్కడూ ధ్యానం చెయ్యాలి. నృత్యం, రణవిద్యలో శిక్షణ పొందడం, సంగీతం, తర్కం, వాదం, తపస్సు, బ్రహ్మచర్యం మొదలైన వాటివల్ల ఒక జాతికి శక్తి వృద్ధి అవుతున్నది. త్రికరణ శుద్ధిగా ఉండాలి. లోపలా బయటా దోషరహితంగా ప్రవర్తించాలి. భయం, సందేహం, చపలత్వం – ఈ మూడింటినీ ద్వేషించాలి. ఇందువల్ల శక్తి కలుగుతుంది.

ప్రాచీన సంప్రదాయం వల్లనే ఒకటి అబద్ధం కాజాలదు, నవీన మన్న కారణం వల్లనే మరొకటి నిజం కాజాలదు. బాగా పరిశీలించి, అనుభవ పూర్వకంగా చూసినప్పుడే, ఒక అంశములోని సత్యా సత్యములు స్పష్ట మవుతాయి. మన పూర్వులు యోగం అనే ఒక మార్గమును స్థాపించారు. ఇది హటయోగం, రాజయోగం, భక్తి యోగం, జ్ఞానయోగం అని చతుర్విధ ములు. వీటిలో హటయోగం వల్లనే చాలా తక్కువ లాభం కలుగుతుంది. తతిమ్మా మూడింటి వల్ల అనంత శక్తులను పొందవచ్చు. విషయం తెలియక ముందే 'ఇందువల్ల లాభం ఏముంటుంది' అని సందేహించడం విజ్ఞులు చెయ్యవలసిన పని కాదు. దాన్ని బాగా పరిశీలించాలి. ఆ విధంగా సాధన చేసేవారికి బహువిధములైన అపూర్వ శక్తులు లభ్యం కావడం మనం కండ్లారా చూస్తున్నాము. మనకు మాత్రం ఈ శక్తులు ఎందుకు లభ్యం కాకూడదు ? ఈ మూఢ తమోగుణం వల్ల మనం సుఖపడిందేముంది ? బద్ధకం వల్ల తుచ్ఛ విషయాలలో ఆసక్తిని పెంచుకుని మనస్సు

సముద్రంలో చిక్కుకున్న వస్తువు వలె, చలించడం వల్ల మనకేం ఒరిగిందని?

సాహసం, మనోనైర్మల్యం, ఏదైనా ఒక మహత్తరమైన లక్ష్యంలో జ్ఞానమును పూర్తిగా కేంద్రీకరించడం, లాభనష్టాలను గురించి ఆలోచన పెట్టుకోక పోవడం - మొదలైనవే యోగ రహస్యాలు.

## తమిళం

కలకత్తా నుంచి వెలువడే 'మాడరన్ రెవ్యూ' అనే మాస పత్రిక అక్టోబరు సంచికను నిన్న కాలక్షేపం కోసం తిరగేశాను. అందులో తిరునెల్వేలి హిందూ కాలేజి చరిత్రోపన్యాసకులు శ్రీ నీలకంఠయ్యరు ఒక చిన్న ఉత్తరం ప్రచురించారు. అంతకు మునుపు ఆ పత్రికలో శ్రీ యదునాథ సర్కార్ అనే విద్వాంసుడు వ్రాసిన కొన్ని మాటలను పురస్కరించుకొని శ్రీ అయ్యరు తమ అభిప్రాయాలు వెలిబుచ్చారు.

కళాశాలలో చరిత్ర పాఠాలను ఇంగ్లీషులో చెప్పడం లాభరహితమైన వృథాశ్రమ అనీ, ప్రాంతీయ భాషలలో చెప్పడం వల్ల ప్రయోజనం ఉంటుందనీ శ్రీ సర్కార్ తాము అనుభవ పూర్వకంగా గ్రహించిన విషయాలను పేర్కొన్నారు. అందుకు మన తిరునెల్వేలి పండితుడు ఇలా అన్నారు: 'భాషా సమస్య ఒక సమస్యగానే పరిణమించింది. కాని మా జిల్లా, మా కాలేజీకి సంబంధించినంత వరకూ విద్యార్థులకు చరిత్ర పాఠాలు ఇంగ్లీషులో చెప్పడం కంటె ప్రాంతీయ భాషలోనే చెప్పడం చాలా లాభదాయకమని చెప్పలేము. నా విద్యార్థులలో చాలా మంది వ్రాసే ఇంగ్లీషులో వ్యాకరణ దోషాలూ, ఇతర దోషాలూ ఎన్నో కనిపిస్తున్నప్పటికీ, మొత్తం మీద తమిళం కంటె ఇంగ్లీషే బాగా వ్రాస్తున్నారు. చరిత్ర విషయాలను వివరించేటప్పుడు నాకూ ఇంగ్లీషే తమిళం కంటె చాలా సులభంగా కనిపిస్తున్నది.'

ఈ విధంగా వ్రాసిన శ్రీ నీలకంఠయ్యరు పరిస్థితిని తలచుకుని నేను చాలా విచారిస్తున్నాను. స్వభాషను చక్కగా మాట్లాడ లేనివాళ్ళు శాస్త్ర విషయాలను బోధించే వింతను ఈ దేశంలోనే చూస్తున్నాము. నవ్యత! నవ్యత! నవ్యత!

పైగా తనకు స్వభాష తెలియదనే వార్త ఆయన వంగదేశపు పత్రికలో ఎందుకు ప్రచురించాడో నాకు అర్థం కాలేదు. జపాను వారు, చైనీయులు నార్వే దేశస్థులు మొదలైనవారంత మనల్ని తెలివితేటల్లోనూ శాస్త్రము ల్లోనూ, భాషా పాండిత్యంలోనూ తక్కువగా చూసేవారు. ఇప్పుడే హైందవుల మయిన మనం అడవి మనుషులం కాము, తోకలులేని కోతులం కాము, మనకు భాషలంటూ ఉన్నవి, మనలో శాస్త్ర పండితులున్నారు, కవులున్నారు – అని మన వాళ్లలో కొందరు ఇతర దేశాలవారికి తెలియ జేసేందుకు ప్రయత్నిస్తున్నారు. ఈలోగా తమిళులు ఇతర భారతీయుల కంటె తక్కువ వారని మనలో కొందరు ఢంకా బజాయించడం చూస్తుంటే నాకు నవ్వు వస్తోంది.

నా అభిప్రాయాలను కొంచెం వివరిస్తాను.

ప్రపంచంలోని జాతులలో హైందవ జాతి తెలివితేటలలో ఆధిక్యం వహించివున్నది. ఈ హైందవ జాతికి తమిళులమైన మనం శిఖరంలా ఉన్నాము. నాకు నాలుగైదు భాషలు తెలుసు. వీటిలో తమిళం వలె శక్తి సంపన్నత కలదీ, హృదయంతో అనుబంధం కలదీ అయిన భాష మరొకటి లేదు.

ఈ నిమిషం తమిళుల తెలివి తేటలు పేరు పెంపులు బయటి ప్రపం చానికి వ్యాప్తం కాని సంగతి నాకు తెలుసు. గడచిన నిమిషం తమిళుల జ్ఞానజ్యోతి కొంచెం మసక మసకగా ఉన్నట్లు నాకు తెలుసు. అయితే గడచిన నిమిషం గతించినట్లే, ఈ నిమిషం నిజం కాదు. రేపన్నది నిజం. అచిర కాలంలో తమిళ భాషా కాంతి ప్రపంచమంతటా వ్యాపించకపోతే నా పేరు మార్చి పిలవండి. అంతవరకూ ఇక్కడ పండితులుగా వ్యవహృతులవు తున్న వారు తమకు తమిళ శబ్దాలు సూటిగా రాకపోతే, నోరు మూసుకుని ఉండాలి. తమిళమును ఇతరులు తక్కువగా భావించేందుకు తోడ్పడే మాటలు కట్టిపెట్టాలి. ఇదే నా విజ్ఞప్తి.

# స్వాతంత్ర్యం

ధర్మార్థ కామములను గురించి తిరువళ్లువర్ వెయ్యిన్ని నూట ముప్పై కుఱళులలో వివరించిన ఆ తీరుని చూసి ఆశ్చర్యపడిన కొందరు అవ్వై యారుని సమీపించి ఆ సంగతి చెప్పారట. నాలుగు పురుషార్థములను వివరిస్తూ ఆమె అప్పుడు ఒకే ఒక పద్యం చెప్పిందట.

'ఇచ్చుట ధర్మము, చెడుత్రోవలు వీడి ఆర్జించుట అర్థము,
పొర పొచ్చెములు లేక ప్రేయసీ ప్రియులు మెలగుట కామము
ఈశ్వరుని స్మరించుచు ఈ మూడింటిని విసర్జించుట
బ్రహ్మానంద సంధాయకమైన మోక్షము.'

ఇచ్చుట ధర్మము.

కవిత నొసగినా సరే, రాజ్యమిచ్చినా సరే, డబ్బు, విద్య, మందు, ధైర్యం – ఏదైనా ఒక మంచి వస్తువుని ఉన్నవాడు లేనివాడికి ఇవ్వడం ధర్మం. ప్రపంచంలో సామాన్య మానవుణ్ణి పురస్కరించుకుని గొప్పవారు, సమానులు, తక్కువవారు అని మానవుల్ని మూడు వర్గాలుగా విభజించవచ్చు. ఈ మూడు రకాలవారికి అతను ఇవ్వవలసినవి దేశ కాల పాత్రల ననుసరించి మారుతూ వుంటాయి. ఫలానా కాలంలో ఫలానా వస్తువు ఇవ్వాలని ధర్మజ్ఞునికి సహజంగానే తెలుసు. ఆర్జించబడునది అర్థం. మానవుడికి సంతోషం కలిగించే వస్తువులు, వాటిని సేకరించడానికి తోడ్పడే మంచి సాధనం బంగారమును కూడా ఆర్జించాలి. దీక్షతో ఆర్జించాలి. ఎప్పుడూ సంపాదిస్తూనే వుండాలి. అయితే చెడు పనులు చేసి, చెడు త్రోవలు అవలంబించి సంపాదించే డబ్బు నిలవదు. డబ్బుని సంపాదించిన తర్వాత, ఆ ధనగర్వంతో ఇతరులకు హాని చేసేవారు త్వరగానే చెడిపోతారు. కష్టపడే వాళ్ళు కనక భరించరాని దుఃఖంతో విలపించినట్లయితే, ఆ కష్టం కలిగించిన వాని ఐశ్వర్యాన్ని ఆ దుఃఖాశ్రువులు తుడిచి వేస్తాయి. ధనం మంచిదే. అది ప్రయత్న పూర్వకంగా సేకరించబడాలి. లాభదాయకమైన పనిని యితోధికశ్రద్ధతోనూ, తెలివిగానూ చెయ్యగలిగినట్లయితే ద్రవ్యం వృద్ధి అవుతుంది. చెడుపనులు చెయ్యనిదే ధనార్జన జరగదని మూఢులు

భావిస్తారు. చెడుపనులు చెయ్యకుండా ఆర్జించబడునదే అర్థమనీ, తద్భిన్నమైనది అనర్థదాయకమనీ అవ్వగారు పేర్కొన్నారు.

స్త్రీ పురుషులు ప్రేమమనస్కులై జీవించడం సంతోషములలోకల్లా సంతోషమైనది. ఆహారము, స్నానము, పువ్వు, సంతానం - మొదలైనవాటి కంటె ప్రేమజనిత సౌఖ్యమే శ్రేష్ఠమయింది. ప్రేమైకజీవులయిన యిరువురి అభిప్రాయంలో కనిపించే ఏకవాక్యతను కట్టుబాట్లు, ధనగర్వం మొదలైన వాటివల్ల పొందాలని మానవులు ఆశిస్తున్నారు. స్త్రీ పురుష సంబంధంవల్ల వచ్చే దుఃఖమే మానవులకు ఈ లోకంలో ఇతర దుఃఖాలకంటె ఎక్కువగా కనిపిస్తున్నది. కొన్నిదేశాలలో వివాహపద్ధతిని నరకప్రాయం చేశారు. భగవద్దత్తమైన సౌఖ్యాన్ని మానవులు అవివేకంవల్లనూ, పాపచింతనవల్లనూ దుఃఖంగా మలచుకుంటున్నారు.

దైవమును నమ్మి, పై మూడింటిలో ఏదీ కూడా అవసరం కాదనుకుని, ప్రాప్త ముంటేనే మనకు లభిస్తుందని భావించి, అన్నీ కూడా భగవంతుని లీలలు కాబట్టి, మనకు ఏవిధమైన బాధ్యత యిందులో లేదనుకుంటూ ప్రవర్తించడమే మోక్షమూ ; అందువల్ల కలిగేది ఆనందమూను. ఎటువంటి కష్టం వచ్చిపడ్డా, సరే అనుకుని, ఆ దుఃఖాన్ని ఒక్కసారిగా నిప్పులో వేసి కాల్చి, భగవన్నామస్మరణే దిక్కుగా భావించడం మోక్షం. 'అన్ని ధర్మములూ విడిచిపెట్టి నన్నే శరణు పొందుము' అని గీత కూడా చెపుతున్నది.

ఈ ముక్తిని పొందినవాడు సాధువుగా సంచరిస్తూ, చింకిపాతలు ధరించి, బిచ్చమెత్తుకుంటూ జీవిస్తాడని పామరులు అనుకుంటారు. ఇది ముమ్మాటికీ అసమంజసం. వెయ్యిమందిలో ఒక్క జీవన్ముక్తుడికి సాధువేషంలో సంచరించడానికి వీలు కలగవచ్చు. అయితే యిదే మార్గమని అనుకోకూడదు. జనకుడు జీవన్ముక్తుడై రాజ్యం చేశాడు. అర్జునుడూ, అలాగే ఋషులూ, భార్యాపుత్రులతో సుఖంగా జీవించారు. ముక్తిని పొందినవారు ఏ వృత్తినైనా అవలంబిస్తారు. అయితే, అంతరంగంలో ఒక్క దైవమునే నమ్మి సంచరిస్తారు. 'ఏ వృత్తి నవలంబించినా, ఏమి వాటిల్లినా, జీవన్ముక్తుల మనస్సు దైవం మీదనే లగ్నమై వుంటుంది' అన్నది పెద్దలమాట. భగవంతుణ్ణి నమ్మి మిగిలిన మూడు పురుషార్థములను విడిచిపెట్టడమే బ్రహ్మానందమని అవ్వైయార్ పేర్కొన్నారు. ఆశను విసర్జించడమే మోక్షం. మానసిక సన్న్యాసమే సన్న్యాసం. మానసిక సన్న్యాసం గలవానిని మనం ఎలా గుర్తుపట్టడం? భక్తి

పరిపక్వతకు ఏది సరిఅయిన లక్షణం? 'భయపడకు!' అన్నది వేదం. నిర్భయంగా ఉండడమే మోక్షలక్షణం. భగవంతుణ్ణి నిజంగా నమ్మినట్లేనా లేక పైకి అలా చెపుతున్నాడా అని మనం కనుక్కోవాలంటే, అటువంటివాణ్ణి మనం ఆపదసమయాల్లో చూడాలి. ఆపదల్లో ధైర్యంగా ఉండేవాడు జ్ఞాని; భక్తుడు; జీవన్ముక్తుడు. మరణ మంటే భయపడనివాడు భగవంతుణ్ణి నిజంగా నమ్మినవాడు. దైవమును కనక నమ్మితే మనకు హాని కలగదన్న అంశమును ప్రత్యక్షజ్ఞానంగా చేసుకుని జీవన్ముక్తులు ఏ స్థితిలో ఉన్నప్పటికీ సాటిలేని వీరులుగా ప్రతిభాసిస్తారు.

## నాగరకతకు మూలం

(కాలజ్యోతి అనే వ్యాసం లోంచి ఒక భాగం)

ఫ్రాన్సుదేశపు ప్రధానమంత్రి అయిన శ్రీ క్లెమెన్సో మన దేశంలోకొన్నాళ్లుగా పర్యటిస్తున్న విషయం మిత్రులకు తెలిసిందే. కొన్నాళ్లక్రితం ఆయన గౌరవార్థం బొంబాయిలో జరిగిన ఒక విందులో ఆయన ప్రసంగించారు. అందులో సారభూతమైన యీ క్రింది వాక్యం కనిపిస్తున్నది.

'ఫ్రాన్సుకోసం నెత్తురుబొట్లు రాల్చిన ప్రముఖుల మాతృదేశాన్ని సందర్శించడం నాకెంతో సంతోషంగా ఉన్నది. ఫ్రెంచి కుటుంబాలతో ఇండియా సైనికులు ఉండడం నేను చూశాను. వారి మర్యాద, ప్రేమ ఫ్రాన్సు దేశీయుల్ని ముగ్ధుల్ని చేశాయి. ప్రాచ్యదేశాలు నాగరకతలో తీసిపోవు. ప్రేమ, మానవత మొదలైన మహోన్నత లక్ష్యాలు ప్రాచ్యదేశాలనుంచి వచ్చినవే. పాశ్చాత్యులు వాటిని స్వీకరించి తమ లక్ష్యాలుగా చేసుకున్నారు. కాగా, మీ కంటె ఉన్నతమైన నాగరకతగల దేశపు ప్రతినిధిగా నేనిక్కడ మాట్లాడడం లేదు. నాగరకతకు మూలమైన ఇండియాని సందర్శించాలని వచ్చినట్లుగా నేను భావిస్తున్నాను' అని ఆయన అన్నారు.

ఆయన ఎవరు? ఫ్రాన్సుదేశపు ప్రధానమంత్రి పదవినుంచి యిటీవలే విరమించుకున్నవారు. కేవలం సాహిత్యవ్యాసంగం చేసినవాడు కాదు ఆయన. అత్యద్భుతమైన లౌకికప్రజ్ఞ, ఐరోపీయ రాజనీతి పారంగతత్వం సంతరించుకున్నవాడు. ఆయనే పదేళ్లకు మునుపు యీ విధంగా ప్రసంగించివుండడు. రెండేళ్లకు మునుపు కూడా ఇలా ప్రసంగించివుండడు. అసలు అలా అనుకుని

కూడా ఉండడు. ఐరోపీయ నాగరకతయే శ్రేష్ఠమయిందని భావించివుంటాడు. నేటికి ఇండియా సందర్శించి, వీలయినంతవరకూ పక్షపాతరహితంగా, స్పష్టంగా పరిశీలించగా, ఆయనకీ విషయం తోచివుంటుంది. ఆయన చేసిన ఆ ప్రసంగాన్ని మరీమరీ చదవమని నేను మనవారికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఆయన ఏమంటున్నాడు? ఐరోపీయ నాగరకతలోని ఉన్నత లక్ష్యాలూ, భవిష్యత్తులో తాము నెరవేర్చదలుచుకున్న ధర్మాలూ ఐరోపాకి సొంతం కావనీ, అవి ప్రాచ్యదేశాలనుంచి తమకు సంక్రమించినవనీ ఆయన పేర్కొన్నారు. మనమే ఐరోపాకి లక్ష్యదానం చేశామనీ, మన సహాయం లేకపోతే వారింకా నిర్యాణంగా అడవిమనుషులుగా సంచరించేవారనీ అంగీకరిస్తున్నాడు. ఆసియానుంచి నాగరకత ఐరోపాకి ప్రయాణం చేసింది. ఆసియా నాగరకతకు మూలస్థానం మన భారతదేశం. కాని, పూర్వం మనమెంత ఉచ్చస్థితిలో ఉండి, ప్రపంచానికి ఎన్నో వెలుగులు చూపినప్పటికీ, ఇప్పుడు మనం సరిఅయిన స్థితిలో కనక ఉండకపోతే మన గతవైభవం ఎవ్వరికీ స్ఫురణకు రాదు. మళ్లీ మనదేశం అపూర్వమైన జ్ఞానమునకూ, అద్భుతమైన శక్తిసంపన్నతకూ నిలయం కావాలని ఆశిస్తూ శ్రీ క్లెమెన్సో ప్రభృతులు మనల్ని ఆ విధంగా ప్రశంసించారని మనం భావించాలి. లోకానికి మనం కొత్తమార్గం చూపగలమని స్పష్టం చెయ్యాలి. అయితే మనమింకా ఆ స్థానంలో స్థిరత్వాన్ని సంపాదించలేదు. 'పశ్చిమ దేశాలలోవలె యిక్కడ కూడా ప్రజలు పరస్పరం ప్రేమించుకోవాలన్న భగవదాజ్ఞను విస్మరించి, ఒకరిపట్ల ఒకరు ద్వేషభావంతో మెలగుతూ, చంపుకోవడాన్ని చూసి నేను పరితపిస్తున్నాను' అని శ్రీ క్లెమెన్సో పేర్కొన్నారు. అయితే యీనాడు ఇండియాలో వ్యాప్తమైవున్న సాత్విక ధర్మమును కనక ఆయన గ్రహించినట్లయితే ఆయన యీ మాట చెప్పివుండడని నా నిశ్చితాభిప్రాయం. ఇప్పుడు శ్రీ క్లెమెన్సో పారిస్‌నగరంలో ఉంటే, మళ్లీ వీస్తున్న జర్మనీ ద్వేషవాయువులు ఆయన్ని కూడా మార్చివేసేవి. అప్పుడాయన యిలా సాత్వికమార్గంలో పయనించలేడు. కాగా, ప్రేమమార్గమును అనుసరించి ప్రపంచాన్ని పరివర్తింపజేయాలన్న లక్ష్యమును ఇండియా ఆదరిస్తోంది. ఈ తొలిఘట్టంలోని అంశములే యావత్‌ప్రపంచాన్ని ఆశ్చర్యంలో ముంచివేశాయి. ఈ లక్ష్యం ఇండియాలోని ప్రజలందరిలోనూ, అన్ని జీవనరంగాలలోనూ సుస్థిరంగా నెలకొనేటట్లు ఆ భగవంతుడు అచిరకాలంలోనే అనుగ్రహించుగాక!

## వ్యాసములు : వేదాంతం

1. ఇక
2. మూఢభక్తి
3. పుస్తక జ్ఞానం
4. అమృతాన్వేషణ
5. పునర్జన్మ
6. లౌకిక జీవిత ప్రయోజనం
7. ఆశయానికీ ఆచరణకూ మధ్య గల అంతరం
8. జ్ఞానరథం (ఒక భాగం)
9. భగవద్గీత పీఠిక (ఒక భాగం)
10. చంద్రిక కథ (మొదటి భాగం)
11. వేదకాలపు ఋషుల కథ (పీఠిక)
12. త్రాసు (ఒక భాగం)

ఇక

గతించింది పోగా, ఇకమీద జరగవలసిన పనిని గురించి మనం ఆలోచించాలి.

ఇక మనదేశ ప్రజలు అర్చకులతో సహకరించి సంచరించాలంటే, పూజారులు ప్రజలవద్ద దేన్నీ దాచకూడదు. ఏ విషయంలోనూ ప్రజల్ని మోసగించకుండా, అసలు సంగతి చెప్పాలి.

'దేవుడెక్కడున్నాడో? అంతా ఈశ్వర మయమేగదా? ఊరి మధ్య ఒక గుడి కట్టి, అందులో ఒక శిలనో, ఒక రాగిరేకునో ప్రతిష్ఠించి, అందరూ దానికే నమస్కరించా' లనే నిబంధన ఎందుకు? ఎందుకంటే, ప్రజలలో సమైక్య భావం కలగడానికి.

శిలలోనే దేవుడున్నాడని నమ్మి, మన చుట్టూ ఉన్న ప్రజలలో దైవం లేడని అనుకోవచ్చునా?

గమనించు! అండ బహిరండము లన్నిటిలోనూ లోపలే ఉండి ప్రవర్తింపజేసే పరంజ్యోతియే మన చుట్టూ వున్న అనంతకోటి జీవరాసుల్లో చైతన్యం కలిగిస్తున్నది.

ఇదే వేదంలోని పిండితార్థం. 'తనలో లోకాన్నీ, లోకంలో తననూ ఎవడు కనుగొనగలుగుతున్నాడో అతనే కళ్లున్నవాడు' అని మన పూర్వుల అభిప్రాయం.

నీ ఆత్మా, లోకపు ఆత్మా ఒక్కటే. నీవు, నేను, మొసలి, తాబేలు, ఈగ, గ్రద్ద, గాడిద - అందరూ ఒకే ప్రాణం. ఆ ప్రాణమే దైవం.

ఒక చోట చేరి భగవంతుణ్ణి నమస్కరించేటప్పుడు, మానవుల మనస్సులు ఏకమై, తమలో ఉన్న ఆత్మ ఏకత్వాన్ని వారు గ్రహించేందుకు వీలు కలుగుతుందనే ఉద్దేశంతో పూర్వులు గుళ్లు ఏర్పాటు చేశారు.

ఊరి సమైక్యం ఆలయంవల్ల నెరవేరుతుంది. ఇంట్లో ప్రత్యేకంగా శిలను ఉంచి, నమస్కరించడంవల్ల కుటుంబ సమైక్యానికి వీలు కలుగుతుంది.

గమనించు ! సుస్పష్టమైన తమిళంలో చెపుతున్నాను. మగవాడివైన నీవు నమస్కరించే దైవములలోని స్త్రీ దైవం నీ తల్లి, భార్య, సహోదరి, కుమార్తె - మొదలైన స్త్రీలలో ఇంతవరకూ బహిర్గతం కాక అదృశ్యంగా ఉన్న పరాశక్తి అంశను సూచిస్తున్నది. దైవం తల్లి. ఆమెవలె మన స్త్రీలు, భార్య, సహోదరి, తల్లి మొదలైనవారి కాంతి ప్రసరించగా మనం దర్శించాలని సూచన.

(పురుష దైవం నీవు, నీ తండ్రి, నీ సహోదరులు, నీ కుమారుడు, నిన్నావరించిన పురుషులు పొందదగిన స్థితిని సూచిస్తున్నది.

నీవు శివుడవు ; నీ భార్య శక్తి.

నీవు విష్ణుమూర్తివి ; నీ భార్య లక్ష్మి.

నీవు బ్రహ్మవు ; నీ భార్య సరస్వతి.

ఈ తత్త్వమును తెలియజేసి పశుత్వంనుంచి దివ్యత్వంలోకి తీసుకు రావడానికే ఏర్పడిన దైవ పాఠశాలలు ఆలయాలు.)

ఈ విషయాన్ని అర్చకులు దాస్తున్నారు. నమస్కరించేవారు నిత్యదాసులనీ, తామేమో దైవాంశ సంభూతుల మనీ భావించడం మంచిదని పూజారి సలహా యిస్తున్నాడు. ఇతరుల్ని బానిసలుగా ఉంచాలని కోరేవారిలో దైవాంశ ఏర్పడదు.

(ఇది యిలా వుండగా, చాలామంది అర్చకులు తమలో దైవాంశ ఉన్నట్లుగా నటిస్తూ ప్రజలను మోసగించి డబ్బు గుంజుకుంటున్నారు.

ఘటికుడి అబద్ధం ఏడురోజులు ! ఎంతకాలమని వంచకుడైన ఒక వ్యక్తిని కప్పిపెట్టి అతనిలో దైవాన్ని చూపగలం ? అందువల్ల ఈ అర్చకుల అసలు రంగు త్వరలోనే బయటపడుతుంది. ప్రజలు పూజారుల్ని గౌరవించక, పాత ఆచారం ప్రకారం శిలకు మాత్రం నమస్కరిస్తున్నారు. అటువంటి శిల వరం యివ్వనే యివ్వదు. ఎలా అయితే ఒక శిలను ఒక సాధువు భక్తి పూర్వకంగా మంత్రోచ్చారణ చేసి నమస్కరించిన వెంటనే అతనికి భగవద్దర్శనం కలుగుతున్నదో, అలాగే అనర్హుడైన అర్చకుడు తాకినంతనే భగవంతుడు ఆ శిలలోంచి అదృశ్య మవుతున్నాడు. అది మళ్లీ బాటమీద కనిపించే రాయిగా మారిపోతున్నది.

గుడికి వెళ్లినా సరే, వెళ్లకపోయినా సరే ; భగవంతుణ్ణి నమస్కరించినా సరే, నమస్కరించకపోయినా సరే, ఇతరుల్ని మోసగించడం మానివేస్తే

భగవంతుని అనుగ్రహం లభిస్తుంది. అణుమాత్రమైనా, యితరుల్ని మోసగించను - అని ఎవడైతే పరిపూర్ణంగా భావించి అలా ఉంటాడో, అతడే ఈశ్వరుడు. పిచ్చుక, కాకి, పురుగు, చీమ - ఒక్క ప్రాణినీ మోసగించకూడదు. మోసానికి స్వస్తి చెప్పి, 'ఏదో యీ లోకంలోకి వచ్చాము. భగవంతుడు నిర్ణయించిందే దోవ' అని నదిలో తేలుతూ పయనించే తెప్పవలె, ప్రపంచ ప్రవాహంలో తేలుతూ పయనించాలి. అలా పూర్తిగా పరాధీనుడై ఎవడు ఈశ్వరుని మీద భారమంతా వేసి వ్యవరిస్తాడో, అతనిలో దైవాంశ ఏర్పడుతుంది. ఇందులో సందేహం లేదు.

ఎన్నో అల్ప ప్రాణులకు మానవుడు ఎంతవరకూ అన్యాయం చేస్తూ వుంటాడో, అంతవరకూ కలియుగం ఉంటుంది. అన్యాయం నశిస్తే కలి ఉండదు. ప్రపంచ మంతటా కలిఉండదు. 'ప్రపంచమంతా అన్యాయాన్ని విసర్జించే పరిస్థితి యేర్పడుతుందని ఇప్పట్లో సూచన లేవీ కనిపించడం లేదు. కనక కృతయుగం రాదు. మనం మాత్రం ఎందుకు న్యాయంగా వ్యవహరించాలి ?' అని వితండవాదం చెయ్యకుండా, తాను నడుస్తున్న అధర్మమార్గాన్ని యింకా అనుసరించకూడదు. ఎవడైతే అన్యాయాన్ని విసర్జిస్తున్నాడో, అతనికి కృతయుగం ఆ క్షణమే హస్తగత మవుతుంది. ఇందులో సందేహం లేదు.

ఒకడు కనక కలిని నలిపినట్లేరు చేస్తే, అతన్ని చూసి పదిమంది అలాగే ఆచరిస్తారు. ఇలా ఒకరు, పదిమంది, వందమంది, వెయ్యిమంది, లక్ష మంది, కోటిమంది ; మానవ జాతిలో సత్యయుగం నెలకొనే కాలం యిప్పటికే మొదలయింది. ఇందులో సందేహం లేదు.

## మూఢభక్తి

మనలో ఈ క్షణం దాకా కొనసాగుతున్న మూఢ భక్తికి ఒక హద్దూ పద్దూ లేదు. ఇందువల్ల మన వ్యవహారములకూ, పనులకూ ఏర్పడే విఘ్నాలకు అంతులేదు.

ఈ మూఢ భక్తిలో చాలా యిబ్బంది కలిగించే అంశం ఏమిటంటే, ప్రతి పనికీ తిథివార నక్షత్రాదులు చూడడం. క్షౌరం చేసుకోవడానికి కూడా మన వారు నెల, పక్షం, తిథి, రోజు, నక్షత్రం - యివన్నీ చూస్తున్నారు. క్షౌరానికే యిలా అయితే, యిక శుభాశుభ కర్మలు, వ్యాపారం, యాత్ర, వ్యవసాయపు పనులు ప్రారంభించడం – ఇలా ఎన్నెన్నో విషయాలకు మన వారు తిథివార నక్షత్రాదులు చూడడం కోసం కాలాన్నీ, ధనాన్నీ వినియోగిస్తున్నారు. దీని కొక హద్దు లేదు. శకునం చూసే అలవాటు కూడా పనులకు విఘ్నం కలిగిస్తున్నది. ఇందువల్ల కలిగే యిబ్బందిని కాని, ధన వ్యయాన్ని కాని మనవారు గమనించడం లేదు. శకునం చూడడంవల్ల కార్య హాని మాత్రం కలుగుతున్నది. రోజూ, లగ్నం మొదలైనవి సరిపోయినవో లేదో చూడడంవల్ల కార్య హానితోపాటు జ్యోతిష్కునికి కూడా డబ్బు ముట్ట చెప్పవలసి వస్తున్నది.

'కాలం చాలా అమూల్యమయింది' అనే అర్థం కల ఒక ఇంగ్లీషు సామెత ఉంది. ఈ విషయం మనవారికి తెలిసినట్లు కనిపించదు. వృథాగా కాల యాపన చెయ్యడం వల్ల, ఆర్థికంగా లాభం లేకుండా పోతున్నది. నేడు చెయ్యదగిన పనిని రేపటికి వాయిదా వెయ్యడంవల్ల, ఆ పనిలోని బలం తగ్గుముఖం పడుతున్నది. దేన్నయినా తోచిన మరుక్షణమే చెయ్యడం వల్ల అది సాధారణంగా విజయవంతంగా పర్యవసిస్తుంది. దాన్ని కాస్తా నానవేసి, ఆ తర్వాత చేద్దామనే సరికి, అప్పుడు మొదట వున్న ఉత్సాహం తగ్గి పోతుంది. అందుకు తగినట్లే లాభమూ కలుగుతుంది.

'ఇటువంటి మూఢాచారము లన్నీ చదువు లేకపోవడం వల్ల కలుగుతున్నవి' అనీ, 'ప్రజలకు కనక చదువు సంధ్యలు చెప్పిస్తే యివి నశించి పోతాయి' అనీ ఇంగ్లీషు చదువుకున్న వారు చెప్పగా విన్నాను. ఇది ఒక విధంగా నిజమనే నేనూ నమ్ముతున్నాను. కాని ప్రస్తుతం మన దేశంలోని పాఠశాలల్లో చెప్పబడుతున్న ఇంగ్లీషు చదువు ఎందుకూ ఉపయోగించదని సువిదిత మవుతున్నది. గత నూరేళ్లుగా ఈ దేశంలో ఇంగ్లీషు చదువు ప్రచారంలో ఉన్నది. వేలకొద్దీ పాఠశాలలు ఏర్పడినవి. వీటిలో లక్షలకొద్దీ కోట్లకొద్దీ విద్యార్థులు చదివి కృతార్థులయినారు. వీరిలో మూఢభక్తి తొలగి పోయిందా ? లేదు. మన దేశంలో ముప్ఫయి మూడు కోట్ల మంది ప్రజలున్నారు. వీరందరిలోనూ, ఒక్కరికైనా బాకీ లేకుండా, ఉన్నతవిద్యా

సౌకర్యం కలిగిన తర్వాతనే మూఢాచారాలు అదృశ్య మవుతాయని భావించ నవసరం లేదు. ఇప్పటికే ఇంగ్లీషు పాఠశాలల్లో చదివి కృతార్థులైనవారు ఈ విషయంలో తమ మనస్సాక్షి ప్రకారం సవ్యంగా వ్యవహరిస్తూ వున్నట్ల యితే, యితరులలో కూడా చాలా మందిలో మార్పు కనిపించి వుండేది. ఇంకా ఎన్నో విషయాలలో మనవారు ఇంగ్లీషు చదివిన వారిని అనుసరించి తమ తమ ప్రాచీనాచారాలను మార్చుకొన్నారు. ఇది మనం చూస్తున్నదే. అదే విధంగా ఈ విషయంలోనూ మార్పు వచ్చి వుండేది.

అయితే ఇంగ్లీషు పాఠశాలల్లో చదివి కృతార్థులైన వారిలో, మనస్సాక్షి ప్రకారమూ విజ్ఞాన సముపార్జనకు తగినట్లుగానూ వ్యవహరించేవారి సంఖ్య చాలా తక్కువగా ఉన్నది. ఇంగ్లీషు పాఠశాలల్లో ఎన్నో శాస్త్రాలు - సత్య ములూ అసత్యములూ, సత్యాసత్యములూ - చదువుతున్నారు.

కాని స్వాతంత్ర్యం, మగతనం, నిజాయితీ, నిజం, శౌర్యం - వీటిని అంత శ్రద్ధగా బోధించడం లేదు. అందులోనూ తాను గ్రహించిన సత్యము ననుస రించి సంచరించాలనీ, అలా సంచరించని పక్షంలో మహా పాపమూ అగౌర వమూ సంక్రమిస్తాయనీ చెప్పే అలవాటు లేదు. ఈ విషయాన్ని కూడా నోటి పాఠంగా చదివిస్తున్నారు. నడవడి విషయంలో శిక్షణ యివ్వడం లేదు. పుస్తకానికీ, నోటిమాటకూ, చేతకూ మధ్య లక్ష యోజనాల దూరం ఉన్నదని ప్రబల నిదర్శనంగా చూపడానికి మన దేశంలో ఇంగ్లీషు పాఠ శాలల్లో కృతార్థులయ్యే వ్యక్తుల కంటె మంచి నిదర్శనం మరెక్కడా దొరక దని తోస్తున్నది.

'కన వినుం ఇన్నాదు మన్నో వినై వేఱు
చొల్ వేఱు పైయార్ తొడర్పు'

అని తిరువళ్లువర్ పేర్కొన్నాడు.

(పై కుఱళుకి అర్థ మేమిటంటే: మాటలూ చేతలూ వేర్వేరుగా కనిపించే వారితో కలలోనైనా సంబంధం పెట్టుకోవడం హానికరం.) బి. యే., ఎం. యే., పరీక్షలలో కృతార్థులై న్యాయవాదులుగా, అధ్యాపకులుగా, ఇంజనీర్లుగా, ఇతర ఉద్యోగులుగా జీవిస్తున్న అసంఖ్యాకులైన అయ్యర్, అయ్యంగార్, పిళ్లైలలో ఒక్కరైనా తమ యింట్లో పెళ్లికి సుముహూర్తం చూడ నవసరం లేదని చెప్పి వుంటారా? ఆడవాళ్ల బాధను భరించలేక యిలా మూఢాచారాలతో జీవించవలసి వస్తున్నది - అని కొందరు అంటు

న్నారు. స్త్రీలకు ఎక్కడ గౌరవం యివ్వాలో అక్కడ గౌరవం యివ్వాలి. అంతే కాని, బుద్ధిమంతులు చూసి పరిహసించేందుకు వీలుగా, వారి మాటల ప్రకారం ప్రవర్తించడం చాలా తప్పు. పైగా యిది నిజమైన కారణం కాదు; అబద్ధం. ఇటువంటి మూఢాచారాలను వదిలిపెట్టక పోవడానికి నిజమైన హేతువు 'ఎక్కడ మనల్ని సనాతనులూ పామరులూ పంక్తి భోజనానికి పిలవక వెలివేస్తారో' అన్నదే. ఇంగ్లీషు చదివిన సవర్ణ హిందువులు లెక్క లేని మూఢాచారాలను చేతి సంకెళ్లగాను, కాలి సంకెళ్లగాను, మెడలోని సంకెళ్లగాను తగిలించుకుని యాతన పడడానికి ముఖ్యమైన కారణం పంక్తి భోజనం గురించిన భయమే. అది తప్ప మరొకటి లేదు. ఈ అసలు కారణాన్ని విడిచిపెట్టి, స్త్రీలమీద వృథా నేరం మోపిన యీ వీరులు ఇతర వ్యవహారా లెన్నిటిలోనో తమ స్త్రీలను బానిసలుగానో మృగాలుగానో భావించి ప్రవర్తించే విషయం మనకు తెలియనిది కాదు. లెక్కలేనన్ని వస్తువుల నష్టమూ, కాలయాపనా కలగడమే కాక, వీటిని చూసిన ప్రపంచపు మేధావుల పరిహాసమునకూ, సత్యదేవుని కోపమునకూ కూడా వీరు పాత్రులవుతున్నారు. పంక్తి భోజనమే చాలా గొప్పదని భావిస్తున్నారు! మీరు నిజమని దేనినయితే నమ్ముతారో ఆ విధంగా నిర్భయంగా ప్రవర్తించండి. పంక్తి భోజనం కొంత కాలంవరకే మీకు లభించక పోవచ్చు. తర్వాత మీ వంటి వారి సంఖ్య పెరుగుతుంది. సత్యమునకు గల బలం మొదలైన ఎన్నో కారణాలవల్ల పంక్తి భోజనం మీకు లభ్య మవుతుంది. ధైర్యంగా పని చెయ్యండి.

## పుస్తక జ్ఞానం

వ్యాపారం, చేతి పరిశ్రమ, రాజకీయ సాంఘిక సంస్కరణలు మొదలైన లౌకిక వ్యవహారము లన్నిట్లోనూ ఇంచు మించు అన్ని పథకములూ అవలంబించి మానవులు వాటిని పూర్తి చేశారు. ఒక శాఖకు సంబంధించిన సూక్ష్మాంశ

ములను మరొక శాఖలో నిపుణులైనవారు గ్రహించివుండక పోవచ్చు. కాని ఆయాశాఖలలో తగిన శిక్షణ పొందిన నిపుణులకు ఆయాశాఖలకు సంబంధించిన సూక్ష్మాంశములు పూర్తిగా చాలావరకు తెలిసివుండవచ్చు.

విజ్ఞాన సంబందములైన విషయాలకు సంబంధించినంత వరకూ మానవులు మహా సూక్ష్మములైన పరమ సత్యములను కూడా కనుగొన్నట్లుగా భావించవచ్చు. కాని బుద్ధికి అందినది మనస్సుకి అందకుండా శక్తి విహీనంగా ఉంది. జ్ఞానం మలిన రహితమైన తర్వాత కూడా, చిత్తశుద్ధి కలగడానికి వీలులేకుండా ఉంది. కాగా, బుద్ధికి అందిన సత్యాలను మానవులు ఆచరణ రూపంలో పెట్టడానికి చాలా కష్టపడుతున్నారు. ఆత్మ జ్ఞానమునకు సంబంధించినంతవరకు, ఈ సత్యమును తాయుమానవర్ ఇలా వ్యక్తీకరించారు.

'పుస్తక జ్ఞానము సుఖ మిచ్చునే ?
పాడు మనసు ప్రతిబంధక మగుచున్నది ;
ఎప్పుడు తీరునో యిది ; ఈశ్వరా ! నీవు చెప్పుము'

మాటల్లోనే పరిమితమైన జ్ఞానం వల్ల ఆనందం అనుభవించలేక పోతున్నానే ; ఏం చెయ్యను ? ఈ పాడు మనస్సు ఎడతెరిపి లేకుండా ప్రతిబంధక మవుతున్నది గదా ! ఈ దురవస్థ ఎప్పుడు తీరుతుంది ? ఓ భగవంతుడా ! నీవైనా ఆ సంగతి చెప్పవా ? – అని దీనికి అర్ధం. ఈ సత్యమునే లోకనీతిని వివరిస్తూ తిరువళ్ళువర్

'చొల్లుదల్ యార్క్కుం ఎళియ అరియవాం
చొల్లియ వణ్ణం చెయల్.'
[చెప్పుట సులభమ్ము, చెప్పిన రీతిగా
ఆచరించుట కడు అరిది కాదె.]

ఒక ధర్మమును నోటి మాటగా సులభంగా ఎవరైనా చెప్పగలరు. కాని ఆ చెప్పిన విధంగా ఆచరించడం మాత్రం మహా కష్టం.

ఉదాహరణానికి : ఆత్మస్థితిలోనూ గుణములలోనూ స్త్రీ పురుషులు సమానులు కనక, ఏ విధంగానూ స్త్రీలను తక్కువగా చూడడం అసమంజసం - అనే భావం చదువుకున్న ఐరోపీయులలో సర్వ సాధారణంగా కనిపిస్తుంది. అయినప్పటికీ, స్త్రీలకు కూడా ఓటు చేసే హక్కు కావాలని అడిగినప్పుడు, ఇంచుమించు ఐరోపీయ రాజనీతి శాస్త్రజ్ఞు లందరూ దాన్ని ప్రతిఘటిస్తూ ప్రసంగించారు. తమ ప్రతిఘటనకు కారణాలు కూడా కొన్ని చూపారు.

విష్ణుభక్తి కలవారు ఏ కులానికి చెందినవారయినా, అన్ని విషయముల లోనూ వారు సరిసమానంగా ప్రశంసార్హులే అనేది శ్రీ రామానుజా చార్యులవారి పరమ సిద్ధాంతం. ఈ విషయాన్ని చక్కగా గ్రహించిన నేటి వైష్ణవులు, ఇతర కులస్థుల కంటె, ఎందుకు ఎక్కువగా బ్రాహ్మణ శూద్రాది భేదములను పాటిస్తున్నారు? అంతేకాదు; ఇంకా వడగలై, తెంగలై సంప్ర దాయాలను విడవకుండా, వృథా కలహాలతో కాలం గడుపుతున్నారు.

'అన్ని శరీరములలోనూ నేనే జీవుణ్ణి' అని కృష్ణుడు గీతలో ఉపదేశించిన సత్యమును, 'అన్ని జీవులలోనూ తనను, తనలో అన్ని జీవులనూ దర్శించ గలవాడే కళ్ళు గలవాడు' అని కృష్ణపరమాత్ముడు అదే గీతలో వివరించిన భావమూ వేదోపనిషత్తుల పిండితార్థ మని తెలుసుకున్న హిందువులు, ప్రపంచంలోని యితర ప్రజలకంటె, ఎందుకు ఎక్కువగా జాతి భేదాన్ని పాటిస్తున్నారు ?

'ఇన్‌చొల్ ఇని దిన్రల్ కాణ్బాన్ ఎవన్ కొలో
వన్ చొల్ వళంగువదు.'

[మంచి నుడుల వలన మంచి కలుగు; తెలి
సియు కఠినపు నుడులు చెప్ప దగునె?]

అనే కుఱళు వలన, మంచి మాటలు చెప్పడం వల్ల మంచి కలుగుతుందని తెలిసికూడా, పరుషోక్తులాడడం అవివేక మని స్పష్ట మవుతున్నది. ఏ మాత్రం లోకానుభవం ఉన్నవారికీ యీ విషయం నిజమని తెలుసు. అలా తెలిసి కూడా, పరుషోక్తు లాడనివారూ కోపం కలిగించే పనులు చెయ్యని వారూ వెతికి చూసినా కనిపించడం చాలా అరుదు.

'మరణం పాపపు కలి' అని క్రైస్తవుల వేదం చెపుతున్నది. ఇది క్రైస్తవు లందరికీ తెలుసు. అయినప్పటికీ, పాపాన్ని పూర్తిగా తొలగించిన క్రైస్తవు లెవ్వరూ లేరు. 'మనమంతా పాపులం' అన్న దాన్ని పల్లవిలా పాడుతూ కాలం గడుపుతున్నారు.

(ఏమిటి ఘోరం! ఏమిటీ ఘోరం!) సాధారణంగా వ్యాపారం, వ్యవ సాయం మొదలైన వృత్తుల్లో కూడా తప్పకుండా లాభం కలుగుతుందని తెలిసిన దోవల్ని అనుసరించలేక యాతన పడుతున్నారు. ఈ శక్తి విహీ నతకు మార్గాంతరం కనుక్కోకుండా మనం ఊరికే ఉండడం న్యాయం కాదు

కళ్లు కనిపిస్తున్నప్పటికీ గోతిలో పడినట్లుగా, మానవ జాతి మంచిని బాగా గ్రహించినా చెడుని విసర్జించడానికి శక్తి చాలక యాతన పడుతున్నది.

దీన్ని ఎలా నివారించడం ? ధైర్యమే మందు. నేటి యిబ్బందుల్నీ, కష్ట నష్టాలను లక్ష్య పెట్టకుండా తాము నిజమని దేన్ని నమ్ముతారో దాన్ని ఆచరించాలి. అలా ధైర్యంతో సత్యమార్గము ననుసరించే వారిని ఇతరులు ప్రశంసలతోనూ సమ్మానములతోనూ ప్రోత్సహించాలి. అనుభవించిన కలి చాలు; వృధా దుఃఖాలూ, అనవసరమైన కష్టాలూ అనుభవించి లోకం అలిసిపోయింది.

(రండి ప్రజలారా! రండి, అన్నదమ్ములారా!) ఒకరిద్దరు ఋజు మార్గంలో పయనించడంలో ఎన్నో కష్టాలు ఎదురవుతున్నవి. అందువల్ల ఋజుమార్గంలో పయనించదలచిన వారి కందరికి అధైర్యం కలుగుతున్నది. రండి ప్రపంచ పౌరులారా ! గుంపులు గుంపులుగా మనం ఋజుమార్గంలో ప్రవేశిద్దాము.

స్త్రీ పురుషుల సమత్వమే ధర్మమని అర్ధమవుతున్నదా ! అలా అయితే, రండి ; లక్షలాది మహిళలను స్వతంత్రుల్ని చేద్దాము. జాతిభేదాలు లాభ రహితములని అర్ధమవుతున్నదా ? రంగు భేదాలూ దేశ భేదాలు ఉపయోగ పడవని అర్ధమయిందా ? మంచిది. కోట్ల కొద్దీ రండి. సమత్వ పథంలో పయనిద్దాము. పాత కట్టుబాట్లనుంచి లక్షలాది మనుష్యుల్ని బంధ విముక్తుల్ని చేద్దాము.

ప్రేమయే సౌఖ్య మిస్తుంది; పగ నశింప జేస్తుంది. — అని తెలును కున్నామా మంచిది. కోట్ల కొద్ది మనుషుల్లారా, లేవండి. ఎక్కడా, ఎప్పుడూ, అన్ని ప్రాణుల పట్ల ప్రేమ చూపుదాము. కలిని నాశనం చేద్దాము. సత్యమును స్థాపిద్దాము.

# అమృతాన్వేషణ

'రక్షింప నీ దయ లేకున్నచో ఏమియు సాగదు.' - తాయుమానవర్.

చాలా యేండ్లకు మునుపు ఒక బిచ్చగాడు పాడుకుంటూ వచ్చాడు.

'కమ్మనీ నిదురలో శ్వాస - అది
ఆగితే పోయేను హంస.'

ఈ పాట వినగానే నేను దీర్ఘాలోచనలో పడ్డాను. ఏమిట్రా యిది! ఈ శరీరం యింత సంశయాత్మకంగా ఉన్నప్పుడు, ఈ లోకంలో మన మేమి మహత్కార్యం తలపెట్టి ముగించగలం? భగవంతుడు మనకు జ్ఞానం యిచ్చాడు. జ్ఞానమే మన ఆకృతిగా మలిచాడు. జ్ఞానం సుఖాన్ని కోరుతున్నది. అంతులేని అందమూ, సౌఖ్యము గల లోకం ఒకటి మన వెంట వున్నది. ఎప్పుడూ ఈ లోకం సంతోషమయమే, ఈ లోకం చింతా రహితం. ఇందులో అణువులోనూ అణువువంటి చిన్న భూమండలం మీదే మనం సంచరించగలుగు తున్నాము. ఇలా లెక్క లేనన్ని మండలాలు అంతరిక్షంలో పరిభ్రమిస్తున్నాయి. వాటి లక్షణాలను కూడా మనం జ్ఞానం సహాయంతో తెలుసుకున్నాము. వాటిలో ఒక భాగమైన ఆకృతులను దూరం నుంచే కంటితో చూస్తున్నాము. ఎటు చూసినా అంద చందాలు కనిపిస్తున్నవి. మన భూమండలానికి ఆకాశమంతా ఏదో ఒక గడ్డలా కనిపిస్తున్నది. నడుమ భాగమంతా ఒకటే వెలుగు; సూర్యుడు కల్పించే వేలకొద్ది కాంతులూ కొండ, అడవి, నది, సముద్రం - అన్నిటా అందమే.

అంతేకాక, దేన్ని తాకినా సుఖదుఃఖాలు అందులో గోచరిస్తున్నవి. కాని మనం మన జ్ఞానంవల్ల వసువులవల్ల కలిగే దుఃఖాన్ని విసర్జించి సుఖాన్ని గ్రహించవచ్చు. స్నానం చేస్తే చన్నీళ్లు సుఖ మిస్తాయి; తాగితే సుఖం. చలికాచుకుంటే నిప్పు సుఖం; అసలు చూస్తుంటేనే సుఖం. అలాగే మట్టి కూడా చాలావరకు సుఖాలే యిస్తున్నది. గాలి తాకితే మనకు సుఖం; శ్వాసగా పీలిస్తే సుఖం. ప్రాణులతో కలిసిమెలసివుంటే సుఖం. మనుష్యుల సంబంధాలలో ప్రేమ కనక ఉంటే చాలా సుఖం. పైగా, ఈ లోకంలో భోజనం సౌఖ్యావహం. పరిశ్రమించడం సుఖం. నిద్రలో సుఖమున్నది. ఆటలో సుఖమున్నది. నేర్చుట, వినుట, పాడుట, భావించుట, తెలిసి కొనుట — అన్నీ సౌఖ్యావహములే.

కష్టమును విసర్జించడం త్వరలో నెరవేరదు.

కాని ఈ సుఖము లన్నిట్లోనూ కష్టములూ కలిసివున్నవి. జ్ఞానం వల్ల కష్టాలను హతమార్చి సుఖములను మాత్రమే చవిచూడాలని మానవుడి ఆశయం. కష్టాలను ఛేదించి అవతల పారవేయగల జ్ఞానమునూ దృఢ

సంకల్పమునూ పొందడం, అనుకున్నంత సులభమైన పని కాదు. కష్టాలెన్నో పడిన తర్వాతగాని చిన్న సత్యాలు తెలియడం లేదు. మనల్ని ఆవరించి ఆనందదుర్గాలు నిర్మించుకోవాలని ప్రతివ్యక్తీ ఆశిస్తాడు. ఇందుకు మహత్తరమైన జ్ఞానం కావాలి. చలించని దృఢసంకల్పం కావాలి. చదువుసంధ్యలు కావాలి. పేరుపెంపులు కావాలి. సిరిసంపదలు కావాలి. మనల్ని ఆవరించి వున్న ఊరివారు, దేశములవారు, ప్రపంచంలోని వారు — అందరూ సుఖంగా జీవించేటట్లు మనం చెయ్యాలి. మంచి ఆశలు మనం ఎన్నెన్నో పెట్టుకున్నాము. ఈ ఆశలు నెరవేరాలంటే, గట్టి పునాది మీద మెల్లిగా కట్టడం మొదలుపెట్టాలి. సుస్థిరమైన సౌఖ్యములు త్వరత్వరగా కలగవు. దరిద్రుడు గొప్పధనికుడు కావాలంటే, ఎన్నో సంవత్సరాలు పడుతున్నది. చదువులేనివారు చదివి పరీక్షకు కూచోవాలంటే ఎన్నో సంవత్సరాలు పడుతున్నది. ప్రపంచంలోని వృత్తులలో తగినంత నైపుణి యేర్పడాలంటే, అందుకూ కొంతకాలం పడుతుంది. 'ఓర్పుగలవాడు భూమిని ఏలుతాడు.' 'బెదిరితే పని చెదురుతుంది.' మధ్యలో మరణం తొంగి చూస్తుంది. ఇలా కష్టాల మధ్యలో మనవల్ల వీలయినంతవరకూ నిర్విరామంగా కృషి చేసి, కాల పరిపక్వత కోసం మనం ఎదురుతెన్నులు చూడవలసి వస్తున్నది. ఈ మధ్యలోనే ఆ బిచ్చగానిపాట నిజమైతే యేం చెయ్యడం? కమ్మనీ నిదురలో శ్వాస, అది ఆగితే పోయేను హంస. ఏమిటీ బాధ? నూరేళ్ళు జీవించవచ్చు – అనేది కనుక అబద్ధం కాకుండా వుంటే ఫరవాలేదు. నూరేళ్లలో ఎన్నో పనులు చెయ్యవచ్చు. 'తరువాతి నిమిషం నమ్మకం లేదు' అని కనుక అనుకుంటే మనం ఏం చెయ్యడం? లాభం లేదు. ఎలాగయినా సరే, మనం ఒక నిశ్చయానికి రావాలి. అనుకున్నపని పూర్తిఅయిన తర్వాతనే మనం మరణిస్తాము; అంతవరకూ మరణించము. మన ఆశలూ, మన ధర్మములూ నెరవేరేంతవరకు మనకు మరణం లేదు.

# పునర్జన్మ

## పునర్జన్మ ఉన్నది

మధురలో ఒక శాస్త్రిగారు నిన్నసాయంకాలం మరణించారని అనుకుందాం. ఆయన మళ్లీ పుడతాడా? వీధి వెంబడి ఒకడు నడిచి వెడుతుంటే, అతన్ని

కాలి కిందపడి ఒక చీమ మరణించిందని అనుకుందాం. అది మళ్లీ పుడుతుందా? దీన్ని గురించి శాస్త్రాలు సవివరంగా చెపుతున్నవి. వాటిని మనం చదవవచ్చు. కాని నేనిప్పుడు చెప్పదలచుకున్న విషయం వేరు. హిందూస్తానపు పునర్జన్మను గురించి నేను చెప్పదలచుకున్నాను.

హిందూస్తాన్ అంటే హిందువుల స్థానమని అర్థం. ఇది మనదేశానికీ, దేశీయులకూ సంబంధించిన పేరు. ఈ దేశీయుల్ని 'భారత జాతి' అని కూడా వ్యవహరించడం కలదు.

## భారతజాతి

భరతుడు స్థాపించింది భారతదేశం. ఈ భరతుడు దుష్యంత మహారాజు కుమారుడు. హిమాలయం మొదలుకొని కన్యాకుమారి దాకా గల మనదేశాన్ని అతడు సమైక్యపరిచి ఒక గొడుగుకిందికి తీసుకురావడం వల్ల, ఈ దేశానికి భారతదేశం అనే పేరు కలిగింది. గంగానదిలో కలిసే కాలువలన్నీ గంగగా మారిపోతున్నవి. భారతదేశానికి వచ్చి తరతరాలుగా ఇక్కడ జీవిస్తున్న వారంతా మనదేశానికి చెందినవారే.

క్రైస్తవులయినా, పారసీకులైనా, మహమ్మదీయులయినా, ఎక్కడనుంచి వచ్చి ఏ దైవమును కొలిచినా, భరత భూమిలో జన్మించి, పెరిగి, దీనినే నమ్ముకున్నవారినందరినీ భారతీయులుగానే భావించాలి. ఇది ఒకే జాతి; వేరుపరచరానిది; దీనికి నాశనం లేదు. అందుకు ఆధారమూ మూలబలమూ ఆర్యసంపద. అనగా, ఆర్యుల జ్ఞానమూ తత్ఫలితములూను.

## ఆర్య సంపద

సంపద అన్నది సంస్కృత శబ్దం. దీని అర్థం ధనం. అయితే యిది ద్రవ్యమునూ, భూస్థితినీ, ఆలమందల్నీ మాత్రమే సూచించదు. (1) జ్ఞాన ధనం (2) శీలధనం (3) వస్తుధనం అనే యీ మూడింటినీ సూచిస్తుంది. ఆర్యసంపద హిందువుల విజ్ఞానాభివృద్ధికి ఫలితం.

మన వేదములు, మన శాస్త్రములు, మన ప్రజలు, మన భాషలు, మన కవిత, మన శిల్పం, మన గోపురాలు, మనమండపాలు, మన గుడిసెలు

వీటిన్నిటికీ సమష్టినామం ఆర్యసంపద. కాళిదాసు రచించిన శాకుంతల నాటకం, హిందీలో తులసీదాసు సంతరించిన రామాయణం. తమిళంలోని కంబరామాయణం, సిలప్పదికారం, తిరుక్కురళ్, ఆండాళ్ (గోదాదేవి) సంతరించిన తిరుమొళి - వీటన్నిటి సమష్టినామమే ఆర్యసంపద. తంజావూరు ఆలయం, తిరుమల నాయకుని మహలు, త్యాగయ్యగారి కీర్తనలు, ఎల్లోరాలోని గుహాలయం, ఆగ్రాలోని తాజమహలు, శరభశాస్త్రి వేణువు – వీటన్నిటి సమష్టినామమే ఆర్యసంపద. కాగా, ఆర్యసంపద హిందూదేశపు నాగరకత. ఈ సంపదను పరిరక్షిస్తున్నంత వరకూ ఈ జాతికి జీవమున్నది. ఈ సంపదకు కనక తుప్పు పట్టేందుకు చోటిస్తే, ఈ జాతిని చెదలు తినివేస్తాయి.

ఈ ఆర్యసంపదను ప్రపంచ మున్నంతవరకూ సంరక్షించి, యింకా దానికి జిగి బిగి కలిగేలా చేసే బాధ్యతను దేవతలు భారతజాతికి అప్పగించారు.

## మధ్యలో మనకు వాటిల్లిన ఆపద

ఈ ఆర్యసంపదను మనం ఎన్నో శతాబ్దాలుగా ఆదరిస్తూన్నాము. గత కొన్ని శతాబ్దులనుంచీ దీనికి తుప్పు పట్టడం మొదలయింది. దేవతలు మనకు ఒప్పగించిన బాధ్యతను గర్వంవల్లనూ సోమరితనం వల్లనూ తృణీకరించసాగాము. ఈ భారతజాతిని కొంచెం చెదలు తిననీ అని దేవతలు ఆశీర్వదించారు.

కొండచిలువ కథను విన్నారుగా మీరు! దాని తోక నిప్పంటుకుని మండుతుందట. కాని కొండచిలువ గురకలు కొడుతూ హాయిగా నిద్రపోతుందట. చెదలు తినడాన్ని మనం గమనించడం లేదు. అంత గర్వం ; అంత సోమరితనం.

మన కవితలో ఆనందం తగ్గు ముఖం పట్టింది. రుచి తగ్గింది. రాళ్లూ రప్పలూ, ముళ్లూ నిండిన దోవ మన కవులకు మంచిదనిపిస్తున్నది. కవిరాజు 'కన్ను' అనడానికి బదులుగా 'చక్షువు' అని ఉపయోగిస్తున్నాడు. రసం తగ్గింది. పిప్పి ఎక్కువవుతున్నది. సత్యం తగ్గింది; డొంకతిరుగుళ్లు ఎక్కువవుతున్నవి.

చవియు అత్తెళిన్దు తణ్డెన్ఱొ ఘుక్కముం తళువి చ్చాన్ద్రోర్

కవియెన క్కిడన్ద గోదావరి యినై వీరర్ కణ్డార్ అని కంబన్ పేర్కొన్నాడు.

ఛవి అనగా కాంతి. ఇది సంస్కృత శబ్దం. కంబన్ కాలంలో బాలా ప్రచారంలో ఉండి వుంటుంది. 'కాంతివంతమై, స్పష్టత కలిగి, చల్లని (తీయని) నడక కలిగి, మహనీయుల కవిత వలె ఉన్న గోదావరినది' అని కంబన్ వర్ణించాడు. కాగా, కవితలో కాంతి, స్పష్టత, చక్కని శైలి - ఈ మూడూ ఉండాలని కంబన్ కవి ఆశయం. ఇది సముచిత మయింది.

పైగా బాలా కాలానికి ముందే సంతరించబడిన గ్రంథాలు ఆ కాలపు భాషలో వ్రాయబడినవి. కాలం మారగా మారగా భాషలో కూడా మార్పులు ఏర్పడుతున్నవి. పాత మాటలు మారి కొత్త మాటలు ఎర్పడుతున్నవి. కవులు ఆయా కాలములలోని ప్రజలకు స్పష్టంగా అర్థమయ్యే మాటలే వాడాలి. అద్భుతమైన మనోభావాలను సులభమైన శైలిలో వ్రాయడం మంచి కవిత. కాని కొన్ని శతాబ్దులుగా కవులూ సన్యాసులూ కలిసి అతి సామాన్యములైన విషయాలను అసాధారణమూ అలౌకికమూ అలంకార బంధురమూ అయిన శైలిలో వ్రాయడమే ఉత్తమ కవిత అని నిర్ణయించుకున్నారు.

## మధ్యకాలపు సంగీతం

భారతదేశంలో సంగీతం ఇతర దేశాలలోని సంగీతం కంటె శ్రేష్ఠ మయింది. కవితవలె, సంగీతలోనూ నవరసములకూ స్థానం ఉండాలి. నవరసములను గురించి ఈ పత్రికలో (స్వదేశ మిత్రన్‌లో) తర్వాత ఒక వ్యాసం వ్రాస్తాను. ఈ రాగాలలో ఈ వేళల్లో ఈ రసములు ఒప్పించాలని పూర్వ గ్రంథాలలో పేర్కొనబడినది. కీర్తనలలోని మాటలు అర్థాలు రాగంలోని గాంభీర్యమూ రసంలో అంతర్భూతములై ఉండాలి. త్యాగయ్యగారి కాలం వరకూ మనదేశపు సంగీతం చక్కగా ఉంది. తర్వాత ఇందులోనూ రుచి తగ్గజొచ్చింది. పాటలో రసానికి చోటు లేదు. ఒకవేళ రసం చేర్చినా, శోక రసం (కరుణ) చేరుస్తున్నారు. మిగిలినవి మరుగున పడిపోయినవి. పాటను అనుసరించి తాళము - అనే విధానం మారిపోయి, తాళమునకు అనుగుణంగా పాట తయారయింది. 'సంతోషం కంటె లెక్క ముఖ్యం' అని నిర్ణయించుకున్నారు. సంతోషము లెక్కా కలిసి మెలిసి వుండాలి. సంతోషం లేని లెక్క పాట కాజాలదు.

## మరల పుట్టుక

మధ్య కాలంలో మనకు వచ్చి పడిన ఆపదకు ఉదాహరణంగా కవితనూ సంగీతాన్నీ పేర్కొన్నాను. కాని యీ ఆపద ఆ రెండింటికే పరిమితం కాలేదు. మన చిత్రకళ, మన శిల్పం, మన ప్రజానీతి, మన శాస్త్రం, తల, కాలు - అన్నిటినీ యీ ఆపద ఆవరించింది. వ్యాధి ముదిరి పోయింది. తగిన సమయం చూసి పరాశక్తి మనవద్దకు మంచి వైద్యుల్ని పంపించింది. ఆమెకు మన మీద దయ కలిగింది. అందువల్ల బ్రతికి పోయాము. అయినా యిది పునర్జన్మ వంటిది. ఈ పునర్జన్మ తాలూకు చిహ్నాలను ప్రస్తుతం చూస్తున్నాము. భారత జాతి నవీన మయింది. ప్రస్తుతం ప్రపంచ మహాకవులలో మన రవీంద్రనాథఠాకూరు ఒకరని ప్రపంచం అంగీకరిస్తున్నది. ఇంతవరకూ ఐరోపీయ పండితులు ప్రకృతి శాస్త్రం మా సొంతమని భావిస్తూ వచ్చారు. ఇప్పుడు మన జగదీశ చంద్రబోసు ఆ శాస్త్రంలో నిరుపమానమైన శక్తిని సంపాదించినట్లు అంగీకరించని పాశ్చాత్య పండితులు ఎవ్వరూ లేరు. తమిళనాడులో నవ్యకవితా, శాస్త్ర ప్రకాశము త్వరలో ఏర్పడతాయి. వాటిని చూసి ప్రపంచం ఆశ్చర్యపడుతుంది.

చచ్చి బ్రతికాము. మంచి వజ్రంలా బ్రతికాము. కొత్త జన్మ మనకు అందమైన జన్మ కాగలదని దేవతలు ఆశీర్వదించారు. అందువల్ల వాళ్లని మనం కొనియాడుదాము.

## 2

పాపపుణ్యాలనుబట్టి మానవుల కర్మ ఫలంగా తరువాతి జన్మలో మంచి సెబ్బరలు ఏర్పడతాయని మనదేశంలోని నమ్మకం. పాపం చేసేవాణ్ణి 'నువ్వు వచ్చే జన్మలో మృగంగా పుట్టుదువుగాక' అని అతని మనస్సు శపిస్తోంది. కాని యీ జన్మలోనే తాము మృగములవలె ఉంటున్నట్టు మానవులు గ్రహించడం లేదు. ఒక్కొక్క నిమిషమూ ఒక్కొక్కడు చేసేపనులూ, తలచే తలపులు అతను ఎన్నో జన్మలు ఎత్తడానికి కారణభూతము లవుతున్నవి. ఈ లోకంలోనే, యిప్పుడే, ఒకే శరీరంలోని ఒకడు వెయ్యిజన్మ లెత్తి మరణిస్తున్నాడు. ప్రతిక్షణమూ ప్రతివ్యక్తి పుట్టి పుట్టి మరణిస్తున్నాడు

అనవచ్చు కూడా. మృగతుల్యములైన మానవుల్ని మనం చూడలేదా ! మనల్ని మనం పరిశీలిస్తే, ఎన్నిరకాల మృగాలుగా మనమున్నామో తెలియవస్తుంది. వంచన, ఏ ఎండ కా గొడుగుపట్టే లక్షణం — మొదలైనవి వున్నవాడు నక్క కాక మరేమిటి ? శ్రద్ధ లేకుండా ఏదో ఒకటి ఆలోచిస్తూ మానసికంగా అలసిపోయినట్లు తలవంచుకుని కూర్చునేవాడు దేవాంగపిల్లి. కురుగునఉండి యితరులకు హాని చేసేవాడు పాము. పేరుపెంపులలో ఆశలేక తుచ్ఛసుఖంలో మునిగి తేలుతూ వుండేవాడు పంది. స్వాభిమానం లేక, యితరుల సంతోషం కోసం పాటుపడుతూ వాళ్లిచ్చేది తింటూ పొట్ట నింపుకునేవాడు కుక్క. విన్న ప్రతి విషయానికి కోపం తెచ్చుకునేవాడు వేటకుక్క. కాంగ్రెసు సంస్థలోనూ చేరి, ఆంగ్లేయ అధికారులకు హితవుగా సంచరించాలనే మెహతా పక్షానికి చెందినవాడు గబ్బిలం. స్వీయజ్ఞానంతో పెద్ద పెద్ద వస్తువుల్ని సేకరించుకోలేక పూర్వులు చెప్పిన శాస్త్రాలను మాటిమాటికి వల్లెవేసేవాడు చిలుక. ఇతరులు తనను ఎంత అగౌరవపరచినా ఆ దౌష్ట్యమును ప్రతిఘటించక తన మంద బుద్ధిచేత సహించుకుని సంచరించేవాడు గాడిద. వట్టి గొప్పలు చెప్పుకుంటూ తిరిగేవాడు భరద్వాజపక్షి. విద్యాగంధం లేనివాణ్ణి జంతువర్గంలో చేర్చకూడదు. అతడు స్తంభం. తాను శ్రమించకుండా యితరుల సొమ్ముని అపహరించి పొట్టపోసుకునేవాడు గ్రద్ద. ఒక కొత్త సత్యం వెలుగులోకి వచ్చినప్పుడు దాన్ని సహర్షంగా స్వీకరించక ద్వేషభావం ప్రకటించేవాడు గుడ్లగూబ. (గుడ్లగూబ వెలుగుని చూడలేదు.)

ప్రతినిమిషమూ నిజమే మాట్లాడుతూ, ధర్మమును ఆదరించి పరమార్థమును గ్రహించేందుకు ప్రయత్నించేవాణ్ణి మానవుడనీ దేవత అని పేర్కొన వచ్చు. మృగ జన్మలను మనం క్షణక్షణమూ తొలగించుకునేందుకు యత్నించాలి.

## ఐహికజీవిత ప్రయోజనం

ఈ ఐహిక జీవితంలో మానవులూ ఇతర ప్రాణులూ ఆశించదగిన శ్రేష్ఠమైన ప్రయోజనం ఏది! ఎప్పుడూ తొలగని, ఎప్పుడూ మారని, ఎప్పుడూ తగ్గని సంతోషంతో జీవించడమే.

ఇటువంటి సంతోషాన్ని పొందడం కోసమే మానవులు చదువుసంధ్యలు సాగిస్తున్నారు. వస్తువులు సేకరిస్తున్నారు. తపస్సు చేస్తున్నారు. రాజ్యాలు ఏలుతున్నారు. దొంగతనం చేస్తున్నారు. హత్య కావిస్తున్నారు. మాట్లాడుట, నవ్వుట, ఆడుట, పాడుట, పరిశ్రమించుట — ఇవన్నీ చేస్తున్నారు. మానవులే కాక యితర ప్రాణులు సైతం యింతకు ముందు చెప్పిన ఆశయసిద్ధికోసం పాటుపడుతున్నవి.

అయినా, యింతవరకూ నిత్యానందస్థితిని ఏప్రాణి కూడా అందుకో లేదనడం స్పష్టం. ప్రపంచంలో నివారించరాని దుఃఖం నిండివున్నది. బుద్ధుడు కనుగొన్నట్లుగా చెప్పబడుతున్న నాలుగు సత్యములలో ఇదే మొదటిది. ఇలా తీరని దుఃఖం ఉండడానికి కారణం? ప్రతి ప్రాణీ తననూ యితర ప్రాణులనూ చూసి ద్వేషం, భయం చెందడమే.

ఈవిధంగా ప్రతిజీవికీ తనయందును, ఇతర జీవులందును, వస్తువుల యందును తీరని అసహనం, భయం, ద్వేషం, చింత ఏర్పడడానికి కారణం ఏమిటి? అనాదిగా జీవులమధ్య కొనసాగుతూవస్తున్న పోరాటంవల్ల ఏర్పడిన ఒక అలవాటే తప్ప మరేమీ కాదు.

అన్ని వస్తువులూ అన్ని గుణములూ ఒక్కటే అనే వేదాంత జ్ఞానంవల్ల అజ్ఞాన జనితమైన యీ అలవాటుని తొలగించుకోవాలి. ప్రపంచం పుట్టి నప్పటినుంచీ జ్ఞానం ఎందరో పండితుల మనస్సులలోనూ కవుల హృద యాలలోనూ ఉదయించింది. కోట్లకొద్ది పామరులు సైతం దీన్ని జపించారు.

అయినప్పటికీ పండితులకూ పామరులకూ సరిసమానంగా జ్ఞానం నిత్యానుభవంలోకి రాలేదు. ఇందుకు కారణం పాత అజ్ఞానం అడ్డుతగలడమే.

అజ్ఞానమును జయించినట్లయితే నిరంతరమూ సంతోషంగా జీవించ వచ్చు — అని శాస్త్రం, యుక్తి, అనుభవం అనే మూడు ప్రమాణములూ వ్యక్తం చేస్తున్నవి. అయినా ఆ అజ్ఞానమనే దయ్యమునూ, దాని సంతానమైన కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్యములనే ఆరుగురు యమదూతల్ని జయించేందుకు మానవ హృదయం వెనుకాడుతున్నది. కుక్కను స్నానం చేయించి, దానికి మంచి ఆహారం పెట్టి, నట్టింట్లో కూర్చొపెట్టినా, అది మళ్లీ అశుద్ధమైన ఆహారం వెతుక్కుంటూ తోకను ఆడిస్తూ బయటికి పరుగెత్తుతుంది. ఎన్ని కొత్త సంతోషాలు చూపినప్పటికీ, మనస్సు వాటిని తనవిగా చేసుకోక మళ్లీ ఒక దుఃఖంలో తగులుకుని బాధకు లోనవుతున్నది.

మనస్సు చెదిరినవెంటనే బుద్ధి కూడా చెదిరిపోతున్నది. అందువల్ల బుద్ధిని నమ్మి ఎవ్వడూ కూడా మనస్సుని చెదరనివ్వకూడదు. మనస్సుని చెదరనివ్వకుండా వుండేందుకు ప్రయత్నించడమే యోగములన్నిటిలోనూ ఉత్కృష్టమయింది. మనస్సు చెదిరి, ఒక దుఃఖంలో తగులుకున్నప్పుడు బుద్ధి కళ్లప్పగించి చూస్తూ కూర్చుంటుంది. ఒకవేళ బుద్ధి అడ్డు తగిలినా, మనస్సు దాన్ని లక్ష్యపెట్టదు. బుద్ధిని కాదని సంచరించేశక్తి మనస్సుకి ఉన్నది.

కనుక, మనస్సు దుఃఖంలో తగులుకున్నప్పుడు, దాన్ని ధైర్యంలేక దిటవు అనే కళ్లెంతో లాగి ఆపడమే సరిఅయిన యోగాభ్యాసం. ఇందుకుగాను సంసారమును విడిచిపెట్టి ఏకాంత స్థలమున కూర్చుని కళ్ళుమూసుకుంటారు కొందరు. మరికొందరు శ్వాసబిగించి, అవయవాలను అటూయిటూ కదిల్చి అభ్యాసం చేస్తారు. ఇంకా కొందరు ఏకాంత ప్రదేశంలో కూర్చుని జపం చేసి చూస్తున్నారు.

వీటికంతా ఇది లొంగదు. సంఘంలో నివసిస్తూనే, ఇతరులవలె అన్ని విధాలా వృత్తులు సాగిస్తూ, లౌకిక వ్యవహారాలు సాగిస్తూ చపలత్వానికి లోను కాకుండా తన మనస్సుని నిగ్రహించుకున్నప్పుడే ఆశించిన ప్రయోజనం కలుగుతుంది. మిగిలిన ప్రయత్నములన్నీ నిరుపయోగములు.

నీతి, శాంతి, సమత్వం, ప్రేమ - వీటితోనే ఈ లోకంలో ఎక్కడలేని ధైర్యమునూ, దాని సహాయంతో తీరని ఆనందమునూ పొందవచ్చును. మార్గాంతరం లేదు.

## ఆశయానికీ ఆచరణకూ మధ్య గల అంతరం

ఒక్కొక్కరికీ ఒక్కొక్క ఆశయం ఉండవచ్చు. అంటే, మిగిలినవారందరి కంటె ఏదో ఒక నీతి, ఒక ధర్మం లేదా ఒక అభిప్రాయం వీటిలో ఒకదాని మీద అతనికి ప్రగాఢమైన అభినివేశం ఉండవచ్చు. వీటిలో ఒక్కొక్కటీ సర్వజన సమ్మతమై లాభదాయకమై ఉండాలనే నియమం లేదు. ఒక అభిప్రాయం హానికరంగా ఉండవచ్చు. లేదా లాభదాయకమై ఉండవచ్చు. కాని

ఒక లక్ష్యం ప్రకారం పనులు చేసేటప్పుడు అవి తనకైనా యితరులకైనా లాభదాయకంగా ఉండగలవనే ఉద్దేశంతోనే చేస్తాడు. క్రూరుడైన రాజు పరిపాలనలో నివసించేవాడు కడుపునిండా తిండి లేక, ప్రభుత్వోద్యోగులు పెట్టే బాధలను సహించలేక కష్టపడవలసి వస్తుంది. రైతుగా ఉండి సేద్యం చేసుకోవలన్నా చాలా యిబ్బందులున్నాయి. సకాలంలో వాన పడదు. వాన ఒక వేళ పడినా దున్నేందుకు ఎడ్లు లేవు. దున్నినా, విత్తనాలు లేవు. నాట్లు వేసినా సకాలంలో కలుపు మొక్కల్ని ఏరి, పంటను కాపలాకాసి, కోతలయిన తర్వాత ధాన్యమును ఇంటికి చెరవేసి హాయిగా ఉందామంటే తగినంత ఐవేజు లేదు. అలా ధాన్యమును ఇంటికి చేరవేసి ఫలితం అనుభవిద్దామంటే అదీ వీలుపడదు. ఎందుకంటే ప్రభుత్వానికి శిస్తులు చెల్లించేందుకుగాను కళ్లంలోనే ధాన్యమును అమ్మవలసి వస్తుంది. అందువల్ల, నేల దున్ని జీవించడం కంటె ఏదైనా మరొకవృత్తి చేపట్టడం మంచిదని తలచి, దొంగల గుంపులో చేరి ప్రయాణికుల్ని కొల్లగొట్టడమో, ఇంటికి కన్నం వేసి దొంగతనం చెయ్యడమో జరుగుతున్నది. ఆవిధంగా అతడు చేసేవృత్తి ఒక ఆశయసిద్ధికి ఉద్దేశించబడిందే అయినా, అందువల్ల అతనికి మాత్రం లాభం కలుగుతున్నది; ఇతరులకు అపకారం జరుగుతున్నది. అయినా, ఆపద్ధర్మం అనే అభిప్రాయంతో అతడు ఆ వృత్తిని స్వీకరిస్తున్నాడు. భార్యాపుత్రులు తిన తిండిలేక, కట్ట గుడ్డలేక, చూసేవారు జాలిపడేలా జీవిస్తుంటే, ఆ కుటుంబ యజమాని అభిమానం గంగలో కలుస్తున్నది. వ్యవసాయం వల్ల ఏమీ గిట్టుబాటు కాదు అనే నిశ్చయానికి వస్తున్నాడు. దొంగతనం వల్ల ఆకలి తీరేందుకు ఏదైనా దొరుకుతుంది. ఆంగ్లేయుల ఆశీస్సుల వల్ల ప్రయాణికులేమో నిరాయుధపాణులుగా ఉన్నారు. పోలీసులనే స్వదేశరక్షక భటులకు జీతం తక్కువ కనకను, పరాయివారి పరిపాలన తమ సహాయం లేకపోతే సాగదనే నమ్మకంతోను, తామే దొంగతనాలకు పాల్పడుతున్నారు. దొంగల గుంపుతో ఒక ఒడంబడిక కుదుర్చుకుని వారు కొల్లగొట్టిన దానిలో ఒక భాగం గ్రహించి, పోలీసులు కాలక్షేపం చేస్తున్నారు. ఈ వసతుల వల్ల దొంగబ్రతుకు మంచిదని తలచి ఆ వృత్తిని రైతు స్వీకరిస్తున్నాడు. అయితే ఈ వృత్తిలో జీవహింస చెయ్యక తప్పదు. అలా చెయ్యడం పాపకార్యం. ఆ పాపంవల్ల మోక్షమునకు విఘ్నం వాటిల్లుతున్నదనే భయమో సందేహమో అతనికి కలుగుతున్నది. అందుకుగాను దోవలు కొల్లగొట్టే వేళల్లో అతను ఒక ధర్మం

అవలంబిస్తున్నాడు. అనగా, కొన్ని వర్గాలవారిని అతను దోచుకోడు. నిరుపేదలు, తోడు లేకుండా వెళ్లే స్త్రీలు, వ్యాధిగ్రస్తులు, దూర ప్రదేశాల నుంచి వచ్చే యాత్రికులు మున్నగువారిని బాధించడు. అంతే కాకుండా, దోపిడీలవల్ల తాను సంపాదించిన ద్రవ్యంలోని ఒక భాగాన్ని దాన ధర్మాలకు వినియోగిస్తున్నాడు. తనను పగటిపూట దోచుకుతినే షాహుకారుని, లావాదేవీలు జరిపే ఆయన్ని ఎందుకు తాను రాత్రిపూట దోచుకోకూడ దని తనలో తాను అనుకుంటున్నాడు. 'వంగితే పన్ను, తలపైకెత్తితే పన్ను, నిలబడితే పన్ను, కూర్చుంటే పన్ను, భూమిశిస్తు, నీటిపన్ను, రోడ్డుపన్ను, ఆదా యపు పన్ను, వృత్తి పన్ను, టోల్ గేట్ పన్ను, రైతుపన్ను, మురికికాలువపన్ను, కల్లుదుకాణం పన్ను, ఆలమందలకు పన్ను, కుక్కకు పన్ను, పిల్లికి పన్ను, దిగు మతిపన్ను, ఎగుమతి పన్ను, – ఇంకా లెక్కలేనన్ని పన్నులు వేసి, ఇల్లూ వాకిలి ఆలమందలు పొలము పుట్రా - వీటిని జప్తుచేసి యిలా కొల్లగొట్టే ప్రభుత్వపు ద్రవ్యాన్ని నేనెందుకు దోచుకోకూడదు? అని అతడు ప్రశ్నించు కుంటున్నాడు. ఇలా తర్జన భర్జన చేసుకొని, చివరకు దొంగతనాలు చేసి జీవించడమే మంచిదని అతను నిర్ణయానికి వస్తున్నాడు. ఈ నిర్ణయం అతని సహజస్వభావానికి విరుద్ధమే. అయినా, కాలానికి కట్టుబడి, యిది ఆపద్ధర్మమని అతను భావిస్తున్నాడు. ఆ తర్వాత యిది తన లక్ష్యంగా భావించుకుని కార్య రంగంలోకి ప్రవేశిస్తున్నాడు. కొందరు దీన్ని మంచిదంటారు. ఎవరేం చెప్పినా, ఎవరేం చేసినా, తాననుకున్నదే లక్ష్యమని అతను కాలం వెళ్లబుచ్చు తున్నాడు. అతని ఆశయానికీ చేతలకూ మధ్య చుట్టరికం ఉన్నది. ఈ రెండూ పరస్పరాశ్రయములు. అతను గుండె దిటవుగల వ్యక్తి అనవచ్చు.

ఆశయమంటే ఎమిటి? దీన్ని మనం తెలుసుకోవడం అవసరం. ఎందు కనగా, ఆశయరహితంగా ఆచరించే మానవులు కొందరున్నారు. లోక జ్ఞానమూ శక్తిలేని వానికి లక్ష్యం అంటూ ఒకటి ఉండదు. లక్ష్యం గల వానికి లోకజ్ఞానమూ శక్తి సంపన్నతా ఉంటాయి. ఒక క్రమపద్ధతి ఉన్నది. దాన్ని నిర్వహించేవారు ఒక జాతికో ఒక వర్గానికో చెందినవారై ఉంటారు. అందరూ దొంగలు. తరతరాలుగా దొంగతనమే వారి జీవనోపాయం. ఆ ఊళ్ళో ఒక వ్యక్తిని పరిశీలిద్దాము. అతని తండ్రి దొంగ. తాత దొంగ. ముత్తాత దొంగ. పక్కింటివాడు దొంగ. మామయ్య దొంగ. బావమరిది దొంగ. కనక అతనూ దొంగే. అటువంటివాడు ఒక ఆశయం మేరకు కార్యనిర్వాహణ చేస్తున్నాడని చెప్పకూడదు. అతనికి లోకజ్ఞానం ఉండవచ్చు;

లేకనూ పోవచ్చు. కాని ఆ లోకజ్ఞానం సహాయంతో తాననుకున్న ఆశయానికి అనుగుణంగా అతను ఆచరించలేడు. ఎందరో జీవచ్ఛవములు జీవిత లక్ష్య మేమిటో తెలియకుండానే, కేవలం తిని, తిరిగి కాలక్షేపం చేసి మరణిస్తున్నారు. అటువంటివారి కందరికి మంచిదో చెడ్డదో ఏదో ఒక ఆశయం ఉండదు; దాని కనుగుణంగా కర్మాచరణ కావిస్తూ జీవించే వ్యక్తులు కారు వారు. కాగా, లక్ష్యమనగా ఏమిటి ?

లోకజ్ఞానం సహాయంతో చెయ్యదగినదీ చెయ్యదగనిదీ ఏదో గ్రహించి, ముందువెనుకలు ఆలోచించి, తన జీవిత కాలంలో ఎప్పుడూ చేసేందుకు వీలుగా మనఃపూర్వకంగా అంగీకరించే పనికి పునాది వంటి భావమునే లక్ష్య మనవచ్చు. మనదేశంలో ఇటువంటి లక్ష్యములను ఎన్నుకునేందుకు తగినశక్తి కలవారు చాలామంది ఉన్నారు. కాని లక్ష్యములను మనః పూర్వకంగా గ్రహించడం వేరు; తదనుగుణంగా సంచరించడం వేరు. ఏదైనా ఒక లక్ష్యమును ఒకడు ఎన్నుకుని ఆ విధంగా సంచరించలేని పక్షంలో అతనూ జీవచ్ఛవమే.

లక్ష్య రహిత మానవులూ, లక్ష్యమును సాధించలేని మానవులూ అని రెండురకాల వారు ఉన్నట్లుగా పైవిషయాదికం వల్ల తెలియవస్తున్నది. ఈ యిరు వర్గాల వారివల్ల మానవసమాజానికి అంతగా హాని వాటిల్లదు. వీరు తిండికి తిమ్మరాజులుగానూ భూమికి భారంగానూ ఉంటారు. అంతే.

కాని తాము నివసించేదేశానికి పేగులు తినే పురుగులవలె కొందరున్నారు. వారిలోఎన్నెన్నో మంచి లక్ష్యాలు ఉంటాయి. ఆ లక్ష్యాలను అమ్ముకుని జీవిస్తారు వారు. లోకానికి తెలిసేలా వాటిని బహిరంగవేదికల మీద నుంచి సవివరంగా తెలియజేస్తారు. వాటిని విన్న ప్రజలు భ్రమించిపోతారు. అటువంటి లక్ష్యాలు నెలకొన్న వారి మనస్సే మనస్సు; వారు అవతార పురుషులే — అని ప్రజలు ప్రశంసల నందుకుంటూ సంతోషంలో మునిగి పోతారు. కాని అటువంటివారిని అనుసరించి వాళ్లయిళ్లకు వెడితే, అక్కడ మనకు ఎముకలూ చర్మమూ మొదలైనవే కనిపిస్తాయి. ఈ మహనీయుల చేతలు వారుపదేశించే లక్ష్యాలకు పూర్తిగా విరుద్ధంగా ఉంటాయి. వేదికల మీద మహా గంభీరంగా మాట్లాడి, ఆపద వచ్చినవేళలో నేను చెప్పినట్లు మీరు చెయ్యాలి, నేను చేసేటట్లు మీరు చెయ్యకూడదు — అని ప్రజలను వారు మోసగిస్తున్నారు. అంతేకాక తమ ఆశయాలను, ఇంద్రజాలకునివలె మార్చుకుంటారు.

ఈ మహా పాతకులవల్ల మన దేశానికి కలిగే హాని యింతా అంతా కాదు. ఎందుకంటే, తెలివి తేటలు లేనివారు పలువురు వారిని చూసి పోరానిదోవలో పోతున్నారు. మనకు లక్ష్య ముఖ్యం కాని మనిషి కాదు. ఒకడు తన లక్ష్యాన్ని విడిచిపెట్టి అందుకు భిన్నంగా నడిచి నట్లయతే, అప్పుడు కూడా అతన్ని కొనియాడడం అవివేకం. ఏవిధంగానైనా సరే అతన్ని మనం పరిహసించాలి. తాను తాగే కాఫీకోసం, తాను తినే అన్నంకోసం, తాను ధరించే దుస్తులకోసం ఎవడైతే తనమంచి లక్ష్యాలను విడిచిపెడతాడో, అటువంటివాణ్ణి మానవులలో ఏవర్గంలో చేర్చవచ్చు ? అతనికంటే నీచుడైన మానవుడు మరొకడు ఉండడు. అతనికి సంభంధించినంత వరకూ ఆశయానికీ ఆచరణకూ మధ్య చాలా అంతరం ఉంది.

భారతీయులమైన మనం సకల శాస్త్రములను కోల్పోయి ఎక్కడినుంచో వచ్చిన తెల్ల రంగు జాతివారికి బానిసలమై ఉన్నాము. మనం ముప్పయి కోట్ల మంది ఉన్నాము. వాళ్ళు రెండు లక్షల మందికూడా లేరు. ప్రపంచం లోనివారు ఇది ఎప్పుడూ ఎక్కడా జరగని వింతగా భావిస్తున్నారు.

అందువల్ల ప్రపంచంలోని యితర జాతులవారు మనల్ని (ముప్పయికోట్ల లేక మూడు వేల లక్షల జనుల్ని) పరిపాలిస్తున్న అంగ్లేయుల్ని మహావీరులనీ సాటిలేని దృఢగాత్రులనీ ఒప్పుకోవడం లేదు. అందుకు బదులుగా, మన మంటే వారికి అసహ్యమూ, తేలిక భావమూ కలుగుతూన్నవి. ఎక్కడికి వెళ్ళినా భారతీయుని గర్హిస్తున్నారు. మనల్ని చూసి ఏవగించుకుంటున్నారు. భారతీయులనే యీ మేకల్ని అంగ్లేయులే కాదు, యితర జాతులవారు కూడా సులభంగా పరిపాలించవచ్చు నని ప్రపంచంలోని వారు విశ్వసిస్తున్నారు. అటువంటప్పుడు మనం భేదాలు పాటించడం తగని పని. మనం స్వతంత్రు లమైన పిమ్మట మీసాలు మెలిపెట్ట వచ్చు. ఇప్పుడు కనక వట్టి గొప్పలు చెప్పుకుంటే అంతా పరిహసిస్తారు.

మనలో ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడూ చేపట్ట వలసిన లక్ష్యం ఒక్కటే ఉంది. అదేమిటనగా, మనప్రియతమ దేశంలో స్వాతంత్ర్యం నెలకొనేటట్లు చేసి, మనల్ని చూసి యితరుల భయపడి గౌరవించేలా మనం జీవించాలి. ఈ లక్ష్యం ప్రకారం మనం నడవాలి. ఇందుకు ఎన్ని ఆటంకాలు ఎదురైనా సరే వాటిని అధిగమిస్తూ మనం ముందుకి సాగాలి. ఈ లక్ష్యాన్ని చేపట్టి ప్రవర్తించడంలో మనం ఏవిధమైన సుఖమును గాని, గౌరవమును గాని

హోదాని గాని ఆశించకూడదు. ఇల్లూ వాకిలీ, భార్యా పుత్రులూ- అందరినీ త్యజించవలసి వచ్చినా అందుకూ సిద్ధంగా ఉండాలి.

లక్ష్యసిద్ధికై శ్రమించేవారు
కష్టాలను పాటించరు
ఇతరులను లెక్క సేయరు
సుఖముల నాశించరు, మృదూక్తులు కోరరు
అవమానమును లక్ష్యపెట్టరు -

అనే పెద్దల మాటలకు అనుగుణంగా మనం ప్రవర్తించాలి. ఇలా ప్రవర్తించ లేనివాడు తాను పేడినని ఒప్పుకొని వెనక ఉండాలి. 'స్వరాజ్యం నా లక్ష్యం' అంటూ ముందుకి రావాలి. స్వాతంత్ర్య లక్ష్యం కలవాడు తన ఆత్మను, కాక యితరములన్నింటినీ కోల్పోవడానికి సంసిద్ధుడై ఉండాలి. ఓ భారతీయుడా! సోమరిపోతు ఎటువంటి లక్ష్యమూ స్వీకరించడు. వాన అనీ, ఎండ అనీ, గాలి అనీ, ఆకలి అనీ, దాహ మనీ, నిద్ర అనీ చూడకు. ఈ శరీరం అనిత్యం ; కాగా దీన్ని అనుసరించిన అవస్థలు మాత్రం నిత్యము లవుతాయా? ఇంద్రియలోలత్వానికి భయపడికాని, ఇంద్రియ సుఖాలని కోరి కాని జాతీయ ధర్మమును త్యజించ వద్దు. బ్రహ్మమే నిత్యం. సత్యమే జయం. బానిసత్వం లోంచి నువ్వు బయట పడాలి. జయభేరిని నినదిస్తూ, ప్రపంచంలో ఏయే భాగాలలో ఎవరెవరు బానిసత్వంలో మగ్గుతున్నారో, వారిని నువ్వు బంధ విముక్తుల్ని చెయ్యాలి. నీ చేతలవల్ల మునుపటివలె భారతమాత ప్రపంచానికి తిలకమై భాసించాలి. ఈ లక్ష్యములను త్యజించవద్దు, త్యజించ వద్దు, త్యజించవద్దు - ముమ్మాటికీ చెపుతున్నాను.

## జ్ఞానరథం

### పీఠిక

సంజవేళ. తిరువల్లిక్కేణి వీరరాఘవ ముదలి వీథిలో సముద్రతీరానికి అభిముఖంగా ఉండే ఒక యింటి మేడమీద శ్రమ పరిహారార్థం మంచం

మీద పడుకున్నాను. నేను పడుకున్న ముందు గదిలోకి నాలుగు వైపుల నుంచీ కిటికీల ద్వారా హాయిని గొలిపే సముద్రపు గాలి వస్తోంది. ఆ గాలీ సంజ వెలుగూ కలిసినందువల్ల నాకు కలిగిన సంతోషమును నేను వర్ణించ లేను. 'ఆహా! ఇప్పుడు కనక స్నానం చేసి, మంచి గుర్రపు బండిలో కూర్చుని, సముద్రతీరం వెంబడిగా దక్షిణాభి ముఖంగా అడయారుకి వెళ్ళి - దోవలో కాళిదాసు శాకుంతలమును గాని, ఒక ఉపనిషత్తుని గాని చదివి ఆనందిస్తూ యింటి ముఖం పడితే బాగుండు' ననిపించింది. కాని నా దగ్గర గుర్రపుబండి లేదన్న సంగతి అప్పుడే జ్ఞాపకం వచ్చింది.

'అరెరె! చేతినిండా డబ్బు లేకపోవడం వల్ల, లోకంలో ఎన్నో తుచ్ఛ సుఖములనే కాదు, ఉత్కృష్టములైన సుఖములను కూడా పొందడానికి విఘ్నం కలుగుతున్నది కదా!' అనుకున్నాను. అప్పుడు నా మనస్సు 'మూర్ఖుడా! సకల మానవులకూ సర్వేశ్వరుడు జ్ఞానమనే దివ్య రథమును ప్రసాదించాడు. అది అనుకున్న వైపుకి వెళ్ళి, ఆశించిన దృశ్యాలన్నిటినీ చూసి రాగల శక్తి కలది. దాన్ని ఆధారంగా చేసుకుని ఆనందం పొందక, ఏ నిమిషంలోనైనా నిన్ను కిందికి తోసి నీకు హాని కలిగించగల కొయ్య బండిని ఎందుకు ఆశిస్తావు?' అన్నది. వెంటనే జ్ఞానరథాన్ని ఆయత్తం చెయ్య వలసిందిగా నా సేవకుడైన 'సంకల్పమును' ఆజ్ఞాపించాను. రథం వచ్చి ఆగింది. అందులో కూర్చున్నాను. అయితే నా జ్ఞానరథం ఇతరుల రథాల వలె అంత శీఘ్రగమనం కలది కాదు. అనాయాసంగా చాలా దూరం తీసుకు వెళ్ళలేదు కూడా. కొంచెం మందం. ఏం చెయ్యను? ఉన్నదానితోనే అక్కర తీర్చుకోవాలి మరి. కాగా, ఆ రథంలో కూర్చున్నాను. దానిద్వారా నేను చూసిన దృశ్యాలను వాటి విశేషాలను ఈ పుస్తకంలో వివరిస్తున్నాను.

## ఉపశాంతి లోకం (చీకుచింతలు లేని దేశం)

'ఈ క్షణమే నన్ను దుఃఖం లేని దేశం ఎక్కడైనా ఉంటే అక్కడికి తీసుకువెళ్ళు' అని నా జ్ఞానరథాన్ని అర్థించాను. ఆహా! ఈ రథం నా వద్ద యిన్నాళ్ళుగా ఉన్నప్పటికీ చీకు చింతలు లేకుండా నేను ఉండలేకపోయాను గదా! ఎన్నాళ్ళుగా నా మనస్సు స్తంభంలోని పురుగులా యాతనపడుతూ వుంటే, ఆ దురవస్థను తొలగించే ఉపాయం తెలీక ఎంతగానో పరితపించాను. ఈ ప్రాపంచిక దుఃఖాలను తలుచుకుంటేనే నాగుండె చెరువవుతున్నది.

వాటికున్న విషశక్తిని ఏమనను? ఈ చింతలే ఒకని ముఖంలో కానవచ్చే అందమునూ ప్రశాంతతనూ మృదుత్వమునూ నాశనం చేస్తున్నవి; కళ్లలోని కాంతిని మార్చివేస్తున్నవి. శరీరకాంతిని తగ్గింప జేస్తున్నవి. నుదుటి మీద గీతలూ కళ్లకింద ముడతలూ ఈచింతల వల్లనే కలుగుతున్నవి. నా కంఠ మాధుర్యం నశించింది; అందుకు బదులుగా కర్ణకఠోరమైన ధ్వని ఏర్పడింది. భుజబలమూ గుండెబలమూ కూడా తగ్గిపోయినవి. నెత్తురు వేగంగా ప్రవహించడం లేదు; మురికి నీటిలా మెల్లిగా ప్రవహిస్తున్నది. కాళ్లల్లో సత్తువ లేదు. చింతలనే విషజంతువులు శరీరాన్ని పూర్తిగా తింటున్నవి. ఒక్క శరీరమునేనా? జ్ఞానమును కూడా. మరుపు ఎక్కువవుతున్నది. ముఖ్యమైన విషయాలేవీ అవసరమైనప్పుడు స్ఫురణకు రావడం లేదు. చదివిన చదువంతా ఎడారిలో కురిసిన వానవలె నిష్ఫల మవుతున్నది. తెలివిలో కాంతి తగ్గి, ఎప్పుడూ మేఘావృతమైనట్లు కనిపిస్తున్నది. ఆలోచన కుంటుపడుతున్నది. అయ్యో! చింతలనే యీ చిన్న చిన్న విషకీటకాల శక్తి వైద్య శాస్త్ర నిపుణులు చెపుతున్న మహా క్రూరములైన వ్యాధి క్రిములకు సైతం (కంటికి కనిపించవు) లేదు.

'జ్ఞానరథమా! నువ్వు నన్నిప్పుడు చింతలేని లోకానికి తీసుకు వెళ్లు' అని ఆజ్ఞాపించాను. అప్పుడు మనస్సు రథానికి అడ్డు తగిలింది. 'అది అంత సంతోషకరమైన లోకం కాదు. చింతలు లేకుండా ఉంటే చాలా? ఇతర సంతోషాలు అనుభవించగల చోటు ఏదీ మీకు తోచలేదా? చింతలే లేని లోకంలో సుఖం ఉండదని నాకనిపిస్తున్నది. పైగా, . . .పైగా ఏమిటో, ఫలానా అని చెప్పలేక పోతున్నాను. కాని అక్కడికి వెళ్లడం మాత్రం నాకు యిష్టం లేదు' అని మనస్సు చెప్పింది.

నేను కోపంతో, 'ఛీఛీ - పాడు మనస్సా! ఎప్పుడూ నీకు కలుగుతున్న బాధలనూ వేదనలనూ చూసి జాలిపడి, నీకు కొంచెంసేపయినా ప్రశాంతి కలిగే లోకానికి తీసుకువెళ్లి యింటిముఖం పడదామనుకున్నాను. ఇందుకు నువ్వే ఆక్షేపణ చెపుతున్నావా?' అని మందలించాను. మనస్సు తగ్గక మళ్లీ ప్రతిఘటించింది.

నాకీ మనస్సనే మోహిని మీద చాలా ప్రేమ. మొదట్లో ఎలా ఈ మోహం అంకురించిందో యిక్కడ వివరించలేను. అది రహస్యం. కాని క్రమ క్రమంగా నేను వేరు మనస్సు వేరు అనే ద్వైతభావాన్ని చాలావరకు మరచి

పోయేంతగా ఈ మోహిని యందు నాకు అగ్గలమైన ప్రేమ ఏర్పడింది. ఈ మనస్సు పడుతున్నయాతనను చూడలేకనే నే నీ శాంతిలోక దర్శనానికి అభిలషించాను. కాని యిప్పుడిది నా అభిలాషను నిష్కారణంగా ద్వేషించడం చూస్తే దిగ్భ్రమ, జాలి, కోపం కలుగుతున్నవి. ఎన్నోవిధాలుగా మనస్సుని శాంతింప జేయాలని అనుకున్నాను. మనస్సు కళ్ళు మూసుకుని ఒక్కసారిగా హఠయోగం పట్టింది. నాకేం చెయ్యాలో బోధపడ లేదు. ఆతరువాత 'మనసా, నేను ఈ విషయంలో నీ మాటలు వినను. నీ మంచిని కోరి నేనీ పని చేస్తున్నాను. జ్ఞానరథమా, వెంటనే బయలుదేరు!' అన్నాను.

ఆ మరునిమిషానికి ఉపశాంతి లోకం చేరుకున్నాము. ఉన్నతమైన దుర్గద్వారం వద్ద రథం ఆగింది. నేను దూరం నుంచే ఆ కోటను చూడ గలిగాను. నా జ్ఞానరథం అక్కడికి చేరుకోగానే దుర్గద్వారం దానంతట అదే తెరుచుకుంటుందని అనుకున్నాను. కాని అలా జరగలేదు. ఏమి ఆశ్చర్యం! జ్ఞానరథం కూడా లోపలికి ప్రవేశించ లేనంతటి పరిశుద్ధమైనదా యీలోకం అని ఆశ్చర్య పోయాను. నా మనస్సేమో ఇందాకటి కంటె వెయ్యిరెట్లు ఎక్కువగా వణక సాగింది. నాతో మాట్లాడేందుకు కూడా దానికి ధైర్యం లేదు. ద్వారం బయట ఒక ద్వారపాలకుడు ఖడ్గపాణియై నిలబడివున్నాడు. నిప్పురంగు కలది, హిమాలయాన్ని కూడా ఒకేవేటుతో నుగ్గు నుగ్గు చేసేటంత పదును కలది అయిన ఆ ఖడ్గం మీద 'వివేకం' అనే అక్షరాలు కళ్లు జిగేలు మనేటట్లుగా జ్యోతులవలె మెరిసిపోతున్నవి. 'ఎవరది? ఎక్కడికి వచ్చావు?' అని ద్వారపాలకుడు అడిగాడు.

నే నతనికి నమస్కరించి 'ఉపశాంతి లోకాన్ని చూచి వెడదామని వచ్చాను' అని జవాబు చెప్పాను. అది విని అతను పెద్దగా నవ్వసాగాడు. ('ఎందుకయ్యా నవ్వుతావు?' అని అడిగాను. సమాధానం చెప్పకుండానే అతను నవ్వుతూ వున్నాడు.

నా పేద మనసు భయం నిమిష నిమిషానికి ఎక్కువయింది. నాకూ ఆశ్చర్యం కలిగింది. కోపంతో ఆ ద్వారపాలకుణ్ణి 'ఏం బాబు, లోపలికి వెళ్లవచ్చా, వెళ్లకూడాదా? ఒకే మాట చెప్పు. ఎందుకలా అదేపనిగా నవ్వుతావు?' అని అడిగాను.

అందుకతను యిలా అన్నాడు. 'నీకూ ఉపశాంతికీ చాలా దూరం!' నాకు వినిపించేలా అతను గొణిగాడు. తర్వాత అన్నాడు గదా: 'కోపగించకు

నాయనా. ఏదో నాటకశాలను చూసినట్టుగా ఉపశాంతిలోకాన్ని చూసి వెడదామనుకున్నావు. అందుకనే నీమాట వినగానే నాకు ఆపుకోలేనంత నవ్వు వచ్చింది. సాధారణంగా ఈ లోకానికి వచ్చేవారికి తిరిగి వెళ్ళే అలవాటు లేదు.'

'అది సరే. లోపలికి మేము వెళ్లవచ్చా, వెళ్లకూడదా. దయచేసి చెప్పు.'

'నువ్వు లోపలికి వెళ్లవచ్చు. సకల జీవులకూ యిది పుట్టిల్లు. ఇక్కడకు రాకూడదని ఎవరినీ నిషేధించే హక్కు నాకు లేదు. కాని వైరాగ్యదుర్గమును దాటి లోపలికి వెళ్ళే హక్కు నీతోపాటు వచ్చిన మనస్సనే ఆ అసత్య పదార్థానికి లేదు. అది కనక లోపలికి వెడితే, అగ్నిలోకంలో ప్రవేశించే దూది బొమ్మలా నాశనమైపోతుంది' అన్నాడు.

మొదట్లోనే ఉపశాంతిలోకం పేరు వినగానే మనస్సు ఎందుకు గజగజ వణికిపోయిందో, అక్కడికి నన్ను వెళ్లవద్దని ఎందుకు ప్రాధేయ పడిందో, కోట వద్దకు రాగానే ధర్మదేవత సన్నిధిని నిలబడే క్రూరుడైన రాజు వలె అది ఎందుకు చింతా క్రాంతమై పోయిందో నా కిప్పుడు తెలియవచ్చింది. ఆ తర్వాత ఆలోకంలో ప్రవేశించాలనే నా అభిలాషకు స్వస్తి చెప్పాను, మనస్సు మీద నే నుంచిన మోహకారణం వల్ల. దాన్ని హతమార్చి నేను ఆనందించాలని ఆశించలేదు.

'నన్నిప్పుడు ఏం చెయ్యమంటావు?' అని దుర్గ రక్షకుణ్ణి అడిగాను. అందు కతను 'మానవా, మనస్సు మరణిస్తేనే ఉపశాంతి లభిస్తుంది. అది ఉన్నంత వరకూ చింతా రహితంగా జీవించవచ్చునని అనుకోవడం వృథా భ్రమ. చింతలనే రాక్షసుల్ని ఎడతెరపి లేకుండా కనిపారవేసే తల్లి మనస్సే. నీకా రాక్షసి పట్ల యింకా ప్రేమ తగ్గలేదు. పరిపక్వత సిద్ధించినప్పుడు నువ్వే యిక్కడికి రావచ్చు. ప్రస్తుతం వెళ్లిరా' అన్నాడు. ఉన్నట్లుండి ఆ దుర్గమూ, ఆ దుర్గరక్షకుని ఆకృతి - అంతా అదృశ్యమై పోయింది. ఒక్కక్షణం చూపు ఆనలేదు. తర్వాత కళ్ళు తెరిచి చూశాను. మళ్ళీ వీరరాఘవ ముదలి వీధిలో, యిందాక చెప్పిన యింటి మేడమీద, ఒంటరిగా మంచం మీద నేను పడుకుని వున్నాను. సముద్రపు గాలి హాయిగా వీస్తున్నది.

'సరే అయిందేదో అయిపోయింది. ఈ ఉపశాంతి లోక సందర్శన భాగ్యం యిప్పటికి లభించలేదు. ఫరవాలేదు. పేద మనస్సుని హతమార్చి

నేను మాత్రం ఆనందించడం కృతఘ్నత అవుతుంది కదా! దాని చీకు చింతల్ని, వేదనల్ని గురించి ఆలోచించాను. కాని దాని మూలంగా నాకు లభించిన గొప్ప గొప్ప లాభాలను మాత్రం నేను ఆలోచించలేదు. నాకు ఈ ఐహిక జీవితం ఈ మనస్సు వల్లనే కదా లభించింది. దీన్ని ఈశ్వరుడన వచ్చు. పైగా దానికి నేనూ, నాకు అదీ తప్ప ప్రాణసఖులు ఎవరున్నారు? దానికి నేను ద్రోహం చెయ్యవచ్చునా! ఎన్ని కోట్ల చింతలున్నా పరవాలేదు- మనస్సు చచ్చిపోయిన తర్వాత నేను ఒంటరిగా నివసించదలచిన ఉపశాంతి లోకం ఎంత గొప్పదయినా సరే, అది నాకు వద్దు' అనే నిశ్చయానికి వచ్చాను. 'ఉపశాంతి అంటూ అరిచే మనుషుల్ని లోకులు బ్రహ్మ జ్ఞానులనీ, మహర్షులనీ ప్రశంసిస్తున్నారు. అలా ప్రశంసించే వారంతా మూర్ఖులనీ, ద్రోహులనీ నా కనిపిస్తున్నది' అని నాలో నే ననుకున్నాను.

నేనిలా అనుకోవడం చూసిన మనస్సు 'అమ్మయ్యా' అని నిట్టూర్పు విడిచింది. భయమంతా తొలగిపోయింది. కుదుట బడింది. నాకూ సంతోషం కలిగింది. నా మనో మోహినిని ముద్దు పెట్టుకున్నాను.

[మొదటి అధ్యాయం మాత్రమే యిక్కడ చేర్చబడింది.]

# భగవద్గీత పీఠిక

సమబుద్ధి కలవాడు ఈ లోకంలోనే పుణ్య పాపములు రెండింటిని త్యజించుచున్నాడు. అందువల్ల ఆ యోగ మార్గమును అనుసరించుము. యోగం కర్మలలో శక్తిమంత మయింది. (భగవద్గీత, 2వ అధ్యాయం, 50 వ శ్లోకం)

గీతలో పరమాత్ముడు చేసే ఉపదేశములకు ఇదే ప్రాతిపదిక. సమ బుద్ధి అనగా, జ్ఞానమును పూర్తిగా నిర్మలంగా ఉంచుకోవడం. నిర్మలమైన బుద్ధియే పై శ్లోకంలో బుద్ధి అని పేర్కొనబడింది. చింతతో కూడిన తలపులూ, వాటికి ఆధారభూతమైన పాప చింతనలూ లేకుండా జ్ఞానమును సహజ స్థితిలో ఉంచుకోవడమే నిర్మలమైన జ్ఞానం.

మీరు పిల్లలు కాకపోతే మోక్ష సామ్రాజ్యాన్ని చేరుకోలేరు - అని యేసు క్రీస్తు చెప్పిన మాటలలోనూ ఈ అర్థమే కనిపిస్తుంది.

పిల్లల మాదిరి కావాలి. అనగా మీ లౌకిక అనుభవములన్నీటినీ మరచి పొండి ; మీరు చదివిన చదువుని విస్మరించండి. మళ్ళీ పసిపాపల వలె తల్లి పాలు తాగుతూ తొక్కు పలుకులు పలకండి - అని కాదు అర్థం. హృదయాన్ని పసిపాపల హృదయంవలె నిష్కళంకంగా, నిర్మలంగా ఉంచుకోండి – అని అర్థం.

మనస్సు కనక నిర్మలంగా లేకపోతే, బుద్ధి కూడా నిర్మలంగా ఉండదు. హృదయంలో పరిపూర్ణ నైర్మల్యం ఏర్పడేంత వరకు మధ్య మధ్య బుద్ధి నిర్మలంగా ఉన్నప్పటికీ మళ్ళీ మళ్ళీ పాత స్థితిని చేరుకుంటూ వుంటుంది.

హృదయం కనక నిర్మలంగావుంటే నిర్మలమైన బుద్ధి యేర్పడుతుంది. పరమాత్ముడు చెపుతున్నాడు: 'ఆనిర్మలమైన జ్ఞానం సంపాదించుము, అర్జునా-' అని. అప్పుడు నువ్వు చేసే పని ఎటువంటిదైనా, అది సత్కర్మయే అవుతుంది. నువ్వేమీ చెయ్యకుండా, మనస్సు చరించినట్లు నువ్వు ఉన్నా అదీ మంచిదే. సత్కర్మ, దుష్కర్మ అనే భేదాన్ని మరచిపోయి, నీ యిచ్ఛ వచ్చినట్లు దేన్నయినా చెయ్యవచ్చు. ఎందుకంటే, నువ్వు చేసేదంతా మంచిగానే పర్యవసిస్తుంది. నీ బుద్ధి నిర్మల మయింది కదా ! బుద్ధి నైర్మల్యం ఏర్పడినప్పుడు, నువ్వు దుష్కర్మలను ఆచరించలేవు. అందువల్ల, మంచీ చెడూ చూడకుండా, మనస్సు చెప్పినట్లు నువ్వు చెయ్యవచ్చు.

ఇక తర్కించడం మాని, సత్కర్మ దుష్కర్మ - అనగా, వివిధములైన కర్మలను త్యజించి 'అర్జునా, నువ్వు ఎప్పుడూ నిద్రపోతూ వుండు' అని భగవంతుడు ఉపదేశించినట్లు భావించడం కేవలం అవివేకం తప్ప మరొకటి కాదు.

ఎందుకనగా పరమాత్ముడు మూడవ అధ్యాయంలో ఇలా పేర్కొన్నాడు : 'పైగా, ఒక్క క్షణమైనా నిష్క్రియుడై ఎవ్వడూ ఉండకూడదు. సహజంగా అలవడే గుణముల వల్ల అన్ని జీవులు తమకు తెలియకుండానే పనిలో నిమగ్నములవుతున్నాయి' - అని.

అందువల్ల మానవుడు తప్పనిసరిగా పని చెయ్యవలసిందే. ఎప్పుడు చూసినా కుంభకర్ణునిలా నిద్ర పోకూడదు. అతను కూడా ఆరునెలల పాటు మేల్కొని వుండేవాడు ! అయితే నువ్వు పని చేసేటప్పుడు, అందువల్ల వచ్చే

కష్టనష్టాలకు బెదిరిపోయి, ఎప్పుడూ దుఃఖిస్తూనే పనిపాటులు చేసేవారిలా మాత్రం చెయ్యకు. పరమాత్ముడు ఇలా ఉపదేశిస్తున్నాడు. 'అర్జునా, పని చెయ్యడమే నీ వంతు. లాభములో నీకు ఏవిధమైన అధికారం ఎప్పుడూ లేదు' అని.

అందువల్ల భగవంతుడిలా చెపుతున్నాడు. కర్మవలని ఫలము నాశించక తాను చెయ్యవలసిన పనిని ఎవడైతే చేస్తున్నాడో అతనే సన్యాసి; అతనే యోగి - అని.)

బుద్ధి నైర్మల్యమును త్యజించ వద్దు. ఆ తర్వాత నిరంతరమూ నీ పని చేస్తూవుండు. ఊరికే కూర్చున్నా కూడా, నీ మనస్సు అదంతట అదే ఏదో ఒక మంచిని చేస్తూనే వుంటుంది. శారీరకంగా చేసే పని మాత్రమే పని అని భావించవద్దు. మానసికంగా చేసే పని కూడా పనియే. జపం పని కాదా? శాస్త్రములూ కవితలూ నాటకములూ చట్టములూ వేదములూ పురాణములూ కథలూ కావ్యాలూ – ఇవన్నీ పనులు కావా! ఇవి శారీరకంగా కాక మానసికంగా జరిగే పనులు.

బుద్ధి నైర్మల్యమును చెదరనీయకు.

తర్వాత, యోగం అవలంబించు. ఎందుకనగా, కర్మలలో యోగమే శక్తిమంతమయింది.

కర్మకు తనను అర్హుణిగా చేసుకోవడమే యోగ మవుతుంది.

యోగ మనగా సమత్వం. 'సమత్వం యోగ ఉచ్యతే' అనగా, మరొక పదార్థమును పరిశీలించేటప్పుడు, మనస్సులో ఏవిధమైన చంచలత్వం కాని భయం కాని లేకుండా, దాన్ని సునిశితంగా, పూర్తిగా, మనస్సుని అందులోకి చొప్పించి పరిశీలించే అభ్యాస మన్నమాట.)

నువ్వు ఒక వస్తువుని పరిశీలించేటప్పుడు, నీ మనస్సు పూర్తిగా ఆ వస్తువు రూపంగా మార్పు చెందాలి. అప్పుడే ఆ వస్తువుని నువ్వు తెలుసుకున్నవాడి వవుతావు.

యోగస్థఃకురు కర్మాణి - అని భగవంతుడు పేర్కొన్నాడు. యోగములో ఉండి కర్మలు చేయుము - అని అర్థం.)

యోగి తన బుద్ధిని, భగవంతుని బుద్ధివలె విశాలపరుచుకోగలడు. ఎందుకనగా, సునిశితంగా పరిశీలించే అలవాటు అతనికి కరతలామలక మవుతున్నది. అందువల్ల అతని బుద్ధి దైవికమైన విశాలత్వమును పొందగలుగుతున్నది. అతని బుద్ధికి హద్దులే లేవు.

కాగా, అతడు భగవంతుడు సర్వవ్యాపకుడని దర్శించ గలుగుతున్నాడు.

వేదార్థములను వివరించడంకోసమే భగవద్గీత సంతరించబడింది. ఋగ్వేదంలోని పురుషసూక్తం 'ఇదంతా భగవంతుడే' అని చెపుతున్నది. ఈ అభిప్రాయమునే భగవంతుడు గీతలో, 'ఎవడు అన్ని వస్తువులలో ఆత్మనూ, ఆత్మలో అన్ని వస్తువులనూ చూడగలుగుతున్నాడో అతడే దృష్టి కలవాడు' అని పేర్కొన్నాడు.

నువ్వుకూడా దేవుడివే. నువ్వుచేసే పనులన్నీ భగవంతుని పనులు. నువ్వు బంధాలలో పుట్టడం కూడా భగవంతుని పని. పైగా ఎన్నో చిక్కులు నువ్వు తెచ్చి పెట్టుకోవడం కూడా భగవంతుని పని. నువ్వు ముక్తిని పొందడం కూడా భగవంతుని పని.

'అయితే నేనెందుకు బంధవిముక్తి కోసం పాటుపడాలి? అన్నీ భగవంతుని చేతలైనప్పుడు, ముక్తి కోసం నే నెందుకు ప్రయత్నించాలి' అని ఎవరైనా అడిగితే, అందుకు బదులుగా 'ముక్తి అనగా ఏమిటి?' అని నే నతన్ని అడుగుతున్నాను.

అన్ని దుఃఖాలూ అన్ని భయాలూ అన్ని చింతలూ తొలగి వాటికి అతీతంగా ఉండే స్థితియే ముక్తి. దాన్ని సాధించాలనే అభిలాష నీకు కలిగినట్లయితే, అందుకు తగిన ప్రయత్నం చెయ్యి. లేకపోతే దుఃఖాలలోనే మునిగి వాటిలోనే తేలుతూవుండు. ఎవరు నిన్ను వద్దన్నారు? కాని నువ్వు ఎటువంటి పని చేసినా 'అది నీపని కాదు, భగవంతుని పని' అనే సంగతి తెలుసుకుని ఆచరించు. అందువల్ల నీకు మంచి కలుగుతుందని శాస్త్రం చెపుతున్నది. సర్వం విష్ణు మయం జగత్ — అన్నది సనాతన ధర్మంలోని సిద్ధాంతం. అంతా దేవునిమయం, అన్ని ఆకృతులూ, అన్ని దృశ్యాలూ, అన్ని స్థితులూ, అన్ని రూపాలూ, అన్ని ప్రాణులూ, అన్ని పదార్థాలూ, అన్ని శక్తులూ, అన్ని సంఘటనలూ అన్ని చేతలూ — అన్నీ దేవునిమయం. (అందువల్ల అన్నీ ఒకదాని కొకటి సమానం.) 'ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్' అని ఈశావాస్యోపనిషత్తు చెపుతున్నది. అనగా, ఈ ప్రపంచంలో ఏది జరిగినా అది దేవునిమయం అని అర్థం.

ఈ విషయమునే గీతలో శ్రీకృష్ణుడు 'ఈ ప్రపంచమంతటా వ్యాపించిన భగవంతునికి నాశనం లేదని నమ్ముము' అని పేర్కొన్నాడు.)

కాగా, అంతా భగవత్ స్వరూపమైన, అన్నీ భగవంతుని మయంగా ఉండే లోకంలో చింతలకు లోనగుట, దుఃఖము చెందుట అవివేకం కాదా?

అన్నీ ఈశ్వరుని లీలలు – అన్నప్పుడు, యిక నే నెందుకు దుఃఖించాలి? 'ఇష్టం వచ్చినట్లు నా నుదుట ఇలా అని వ్రాసిన ఆ ఈశ్వరుడు కన్ను మూశాడా?'

నక్షత్రాలన్నీ భగవచ్ఛక్తివల్ల పరిభ్రమిస్తున్నవి. త్రిలోకములూ అతని చక్రంలో తిరుగుతున్నవి. నువ్వు అతడివి. నీ మనస్సు, నీ మనస్సులోని తలపులు అన్నీ అతనే. 'సర్వం విష్ణుమయం జగత్.' అటువంటప్పుడు, నువ్వెందుకు అనవసరంగా బాధ్యతలు మోస్తున్నావు? బాధ్యతల్ని ఒక్కసారిగా త్యజించి, నీవల్ల అయిన పనిని సహర్షంగా చేస్తూవుండు. ఏది యెలా జరిగితే నీకేమి? నువ్వా యీలోకాన్ని సృష్టించావు? లోకమన్నప్పుడు నిన్నుతప్పించి యితరలోకాల్ని లెక్కలోకి తీసుకోవద్దు. నీతోకూడిన లోకాన్ని, నీకు ముందుగానే నీ పూర్వకారణంగా ఉండి, నిన్ను పెంచి పెద్దచేసిన లోకాన్ని నువ్వా సృష్టించావు; ఓ మానవుడా! నువ్వా దీన్ని నడుపుతున్నావు? నిన్నడిగేనా నక్షత్రాలు పరిభ్రమిస్తున్నవి? నిన్నడిగేనా నువ్వు జన్మించావు? ప్రతి విషయానికి నువ్వెందుకు బాధ్యత వహిస్తున్నావు?

పరమాత్ముడిలా పేర్కొన్నాడు: అనురాగమును భయమును కోపమును విడిచి, మన్మయులై, నన్ను ఆశ్రయించిన వారై, జ్ఞానతపస్సు ద్వారా పవిత్రులైన పలువురు నా భావమును పొందియున్నారు. (గీత, 4 వ అధ్యాయం, 10 వ శ్లోకం) ఇహలోకంలోనే జీవన్ముక్తి పొంది ఈశ్వర భావమును పొందుటకు భగవంతుడీ శ్లోకంలో మానవునికి ఒక ఉపాయమును సూచించాడు. 'జ్ఞానమును అనుసరించుము. దీనినే తపస్సుగా చేసుకో. కోపమును విడిచిపెట్టుము. అభిలాషను విడిచిపెట్టుము. నన్నే శరణు వేడి, నాలో లీనము చెందుము. నువ్వు నా భావమును పొందగలవు' అని పరమాత్ముడు పేర్కొన్నాడు.

అన్ని చేతలను భగవంతునికి సమర్పించి, మమకారం విడిచిపెట్టి, ఎవడైతే కర్మాచరణకు పూనుకుంటున్నాడో అతన్ని పాపం అంటదు, తామరాకు మీది నీటిలా. (గీత, 5 వ అద్యాయం, 10 వ శ్లోకం)

ఇది చాలా మంచివార్త కదా మీకు! పాపం చెయ్యకుండా వుండేందుకు తోడ్పడే దోవకోసం తపించిపోతున్న ఓ మానవులారా! మీకు ఈ శ్లోకంలో

భగవంతుడు మంచిమార్గం చూపివున్నాడు. ఈశ్వరుని నమ్ముకుని, అతనిపని అనీ, అతనికోసం చేస్తున్నదనీ, చక్కగా తెలుసుకుని, మీ రేపనికి పూనుకున్నా, అందువల్ల పాపం అంటదు, తామరాకు మీది నీటిబొట్టులా. పాపం మిమ్మల్ని అంటిపట్టుకుని వుండదు ; అది మిమ్మల్ని విడిచిపెట్టి పారిపోతుంది.

'మానవుడికి సొంతమనదగిన పని అంటూ లేదు. పనిచేసే శక్తిని కూడా అతనికి భగవంతుడు ప్రసాదించలేదు. కర్మఫలమునూ అతను పొందుట లేదు. అన్నీ ప్రకృతి స్వభావం అనుసరించి జరుగుతున్నవి' (గీత, 5 వ అధ్యాయం, 14 వ శ్లోకం).

కాగా, అతని చేతలను చూసి ఏవిధమైన ఈర్ష్యనుగాని చపలత్వంగాని చెందవలదు. తనచేతకు ఆటంకంగా ఉండవచ్చుననే భావంతో ఇతర ప్రాణులతో తలపడ నవసరం లేదు.

'విద్యా వినయములు కల బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుగునందును, కుక్కయందును, దాన్ని తినే చండాలుని యందును పండితులు సమబుద్ధిని కలిగివుంటారు.' (గీత, 5 వ అధ్యాయం, 18 వ శ్లోకం) - అని పరమాత్మ చెపుతున్నాడు.

కాగా, మానవులలో జాతి భేదమును గాని జ్ఞాన భేదమునుగాని చూడ కూడదని కృష్ణపరమాత్ముడు పేర్కొన్నాడు. అంతే కాదు ; అన్ని ప్రాణులపట్ల ఏవిధమైన భేదభావం చూపకుండా ఉండడమే జ్ఞానుల లక్షణమనీ పేర్కొన్నాడు.

అంతా ఈశ్వరమయం కదా ! ప్రతి ప్రాణిలోనూ విష్ణువు నిండివున్నాడు. 'సర్వమిదం బ్రహ్మం.' సర్వం నారాయణుడు. నక్క కూడా నారాయణుడే. బ్రాహ్మణుడు భగవత్ స్వరూపం ; చండాలుడూ భగవత్ స్వరూపమే. ఇటువంటప్పుడు ఒక జంతువుని ఏకారణంవల్లనైనా సరే తక్కువగా భావించడం అజ్ఞానానికి లక్షణం. హెచ్చుతగ్గులు భావించేవారు ఎప్పుడూ కూడా దుఃఖ విముక్తులు కాలేరు. భేదభావం నెలకొన్న చోట భయం ఉంటుంది ; విపత్తు ఉంటుంది ; మరణం ఉంటుంది. అన్ని భేదములకూ అతీతంగా ప్రతిభాసించేదే జ్ఞానం. అదే ముక్తికి మార్గం.

[భారతి భగవద్గీతను తమిళం చెయ్యటమే కాకుండా, దానికి చక్కని పీఠిక కూడా వ్రాశాడు. ఆ పీఠికలోంచి ఒక భాగమే యిక్కడ యివ్వబడింది.]

# చంద్రిక కథ

**భూకంపం**

పొదియమలై (అగస్త్యకూటం) చరియలలో వేళాంగుడి అనే ఒక అందమైన గ్రామం ఉంది. దానికి దగ్గర్లో ఒక చిన్న నది ప్రవహిస్తున్నది. నలువైపులా నల్లని కొండశిఖరాలూ గుట్టలూ కనిపిస్తాయి. ఊరంతా తోటలు. కాగా, పొద్దుననుంచీ సాయంకాలం వరకూ పక్షుల కలకలారావం వినిపిస్తూ వుంటుంది.

ఆ ఊళ్లో మిగిలిన వీథులకి కొంచెం దూరంగా, పడమటి దిక్కుగా, నదికి దగ్గరగా ఒక అగ్రహారం – అంటే బ్రాహ్మణవీధి ఉండేది. ఆ అగ్ర హారంలోని పిల్లలందరికీ, ఎప్పుడూ పక్షుల కలకలారావం మధ్య పెరగడం వల్లనో, మరే కారణం వల్లనో, తియ్యని కంఠాలు. ఆ పిల్లలు – అందులోనూ బాలికలు – మాట్లాడుతూవుంటే, సాధారణంగా మనలా తమిళం మాట్లాడినా, వాళ్ల మాటలు కోకిల ధ్వనులుగానో చిలుక పలుకులుగానో అద్భుతంగా ఉండేవి.

ఆ అగ్రహారంలో తూర్పుదిక్కున ఒక కృష్ణుడి గుడి. గుడికి అభి ముఖంగా పచ్చిక ఏపుగా పెరిగింది. అక్కడ ఆలమందలూ కొన్ని గాడిదలూ మేస్తూవుండేవి. కొన్ని ఆవులు కృష్ణుని కెదురుగా పడుకుని, స్వామి వారి నుద్దేశించి జపం చేస్తున్నట్టుగా నెమరు వేస్తూవుంటాయి. వాటి మీద కాకులు వాలి పుళ్లను పొడిచి బాధించేవి. ఒక్కొక్కప్పుడు కంటికొనను పొడి చేలా నటిస్తూ ఆవులకి కాలక్షేపం కలిగించేవి. ఇవన్నీ చెట్లకొమ్మల మీద ఉన్న పక్షులు చూస్తూ వాటిని ఆశ్చర్యంకొద్దీ చెప్పుకునేవి.

ప్రేమకూ ప్రశాంతతకూ అందచందాలకూ లక్ష్యంగా ఉన్న వేళాంగుడి ఒక అగ్రహారం. అక్కడ అతివలందరూ బంగారుబొమ్మలు. పురుషులు సద్గుణ సంపన్నులు. అయితే చాలామంది నిరుపేదలు. పూర్వులు గడించిన ఆస్తిపాస్తులు, తోటా దొడ్డి అందరికీ కొంచెంగా ఉన్నాయి. కాని వాటిమీద వచ్చే ఆదాయం కేవలం భోజనానికి కూడా సరిపొయ్యేది కాదు. మరి అందులోనే గుడ్డలు, చీరలు, రవికలు, పరికిణీలు, ఒడుగులు, పెళ్లిళ్లు,

ఋతుస్నానాలు, ఋతుశాంతులు, సీమంతాలు, ఎన్నో పండుగలు పబ్బాలు, ఉత్సవాలు, వేడుకలు మొదలైనవన్నీ గడుపుకోవాలి. అందువల్ల ఆ ఊరి గృహస్థులు, పొలమూపుట్రా తగ్గిపోగా, పేదరికం క్రమక్రమంగా ఎక్కువ కాగా, బాధలు పడుతూ జీవించసాగారు. కాని వయస్సు ముదిరిన వారిలో అంత బాధగాని అసంతృప్తి గాని ఉన్నట్లు పిల్లలకు తెలియదు. పక్షులకూ తెలియదు. గుడి కెదురుగా ఎప్పుడూ ఏపుగా పెరిగిన పచ్చిక బీళ్లలో మేసే ఆవులకు గాని గాడిదలకు గాని తెలియదు. ఇవి ఎప్పుడూ సంతోషంలోనూ కోలాహలంలోనూ పాటల్లోనూ ఆనందోత్సాహాలలోనూ మునిగివుండేవి.

అగ్రహారంలోని మిగిలిన బ్రాహ్మణులకంటె మరీ పేదవాడు మహాలింగయ్యర్. ఆయన కుటుంబం చాలా పెద్దది. ఇల్లేమో చిన్నది. ముసలి తలిదండ్రులు. వితంతువైన ఒక చెల్లెలు. సుమారు ముప్ఫయ్యేళ్ల భార్య. ఆమెకు అయిదుగురు ఆడపిల్లలు ; ఆరవకాన్పు రేపో మాపో.

ఇంతమందికీ అన్నం పెట్టాలికదా! మహాలింగయ్యరుకి పెద్దలిచ్చిన ఆస్తి లేదు. యౌవనం, పట్టుదల, ఎలాగయినా డబ్బు సంపాదించవచ్చుననే నమ్మకం ఆయన్ని విడిచిపెట్టి చాలా రోజులయింది. ఆయన వయస్సు సుమారు నలభై దాటివుండదు. ఆలోగా పిల్ల లెక్కువైన బాధవల్ల, భార్య నోటి బాధవల్ల, తల్లిదండ్రుల వ్యాధి బాధవల్ల, వితంతువైన చెల్లెలు యౌవన బాధవల్ల మహాలింగయ్యరుకి చింతలు ఎక్కువయినాయి. తల అంతా నెరిసి పోయింది. గూని వచ్చింది. కళ్లు గుంటలు పడ్డాయి. దవడలు అంటుకు పోయాయి. ముఖం ముడతలు పడింది. పడుచుదనంలో కొంచెం శృంగారం ఎక్కువ కావడంతో మేహవ్యాధి అంకురించింది. ముఖంమీద, వీపుమీద, బుజములమీద మేహపుపొడలు కనిపిస్తున్నవి.

ఇలా ఉండగా, ఒక మార్గశిరం నెల (మార్గశిరం) రాత్రివేళ ఆకాశం కాటుకలా నల్లబడి పోయింది. నక్షత్రాలు కంటికి కనిపించలేదు. గ్రామస్థులంతా తమ తమ యిళ్లల్లో ఉండిపోయారు. బయట జడివాన. దానికి తోడు భయంకరమైన సుడిగాలి వీస్తోంది. రెండు క్షణాల కొకసారి లోకం జడుసుకునేలా పిడుగుల చప్పుడు వినవస్తోంది. చెట్లు విరిగిపడిన శబ్దం వినిపించింది. తోపులన్నీ గాలికి పాడవుతున్న సవ్వడి. దగ్గర్లో ఉన్న కొండలు ఒకదానితో ఒకటి ఢీకొని చెదిరిపోయినట్లుగా చప్పుడు వినిపిస్తోంది.

అగ్రహారంలో తమ తమ యిళ్లల్లోనే చిక్కుకుపోయిన ప్రజలు ఇవాళ తో ప్రపంచం అంతమయిందని తమలో తాము అనుకున్నారు. భయంతో పిల్లలు ఏడవడం మొదలుపెట్టారు. స్త్రీలు విలపించారు. పురుషులు దుఃఖించారు. సుడిగాలి ఇంకా ఉధృతమయింది.

ఇలా ఉండగా, భూకంపం మొదలయింది. అగ్రహారంలోని యిళ్లన్నీ పాతవి. ఆ యిళ్లన్నీ పడిపోయినాయి. ప్రజలందరూ మరణించారు.

మహాలింగయ్యరు యింటి వీధివాకిట్లో ఉన్న చిన్నగది మాత్రం పడలేదు. ఇంటి నడవలో చేరిన ముసలిదంపతులు, మహాలింగయ్యరు, ఆయన అయిదుగురు ఆడపిల్లలు – వాళ్లందరి మీద యిల్లు విరిగి పడడంతో అంతా మరణించారు. వాకిట్లో వున్న గదిలో ప్రసవవేదన పడుతున్న మహాలింగయ్యరు భార్యా, ఆమెకు తోడుగా ఆయన చెల్లెలూ ఉన్నారు.

రాత్రి సుమారు ఏడింటికి మొదలుపెట్టిన గాలివాన తెల్లవారు జామున నాలుగు గంటలప్పుడు సంభవించిన భూకంపంతో పూర్తి అయింది. అరగంటకల్లా లోకంలో ప్రశాంతత యేర్పడింది. మరునాడు తెల్లవారింది. వితంతువైన చెల్లెలు – విశాలాక్షి – బయటికి వచ్చి చూసింది. అన్నియిళ్లూ పడిపోయాయి. ఎక్కడ చూసినా మనుషుల కళేబరాలు; మృగాలవీ పక్షులవీ ప్రేతాలు. ఆ భీభత్సాన్ని పూర్తిగా చూసే సావకాశం ఆమెకు లేదు. గాలికీ వానకూ మోదుకుని వీధిలో పేరుకుపోయిన ప్రేతాలను మాత్రమే ఆమె చూసింది. పడిపోయిన యిళ్లల్లో మరణించిన మనుషుల్ని ఆమె చూడలేదు. కాని తమ యింట్లోని వారంతా మరణించడం ఆమెకు తెలుసు కనక, మిగిలిన యిళ్లల్లోనూ అలాగే జరిగివుంటుందనీ, అందువల్ల వీధిలో జనసంచారం లేదనీ ఆమె ఊహించింది. (అప్పుడు మళ్లీ గతరాత్రి జరిగిన ఆ భీభత్సం గుర్తుకి వచ్చింది. భూకంపం మొదలయిన వెంటనే మహాలింగయ్యరు ముసలి తండ్రి, 'అయ్యయ్యో, నేల కంపిస్తోంది. మనమంతా వీధివాకిట్లోని గదిలోకి పోదాం. నన్నక్కడికి చేర్చండి' అని మొత్తుకున్నాడు. ఆ మాటల సవ్వడి మాత్రం విశాలాక్షికి వినిపించింది. ఆ తర్వాత మాటలేవీ ఆమెకు వినిపించలేదు. గదిలోకి బయటి అరుగుద్వారా చేరవచ్చు. కాని యింట్లోంచి అక్కడికి వచ్చే దోవలేదు. అయినా, ఆ వృద్ధుని రోదనధ్వని మాత్రం ఆ గాలిని దాటి ఆమె చెవిని పడింది.

లోపలున్నవాళ్లు మాత్రం వాకిట్లో వున్న గదిని చేరుకోలేరని ఆమె గ్రహించింది. ఎందుకంటే, వీధివాకిలి తలుపు తెరిస్తేనేగాని లోపలున్నవాళ్లు బయటి అరుగుద్వారా ఆ గదిలోకి రాలేరు. తలుపుని తెరవడం తరువాయి, సప్త మేఘాలూ ఆ ప్రళయమారుతం యింట్లోకి ప్రవేశిస్తాయి కదా! అందువల్ల వాళ్లు బయటికి రాలేరని ఆమె అనుకుంది. ఒకటి రెండు క్షణాలలో ఉన్నట్లుండి లోపలి యిల్లంతా విరిగి పడిపోయిన చప్పుడూ, అక్కడున్న వారందరూ చేసిన రోదనధ్వనీ ఆమెకు వినిపించాయి. అంతా మరణించారని ఆమె నిశ్చయించుకుంది. తానున్న గది కూడా పడిపోతుందని ఆమె భయపడింది. కాని పడలేదు. ఆ లోపల భూకంపం కాస్తా ఆగిపోయింది. మరికొంత సేపటికి గాలీ వానా కూడా ఆగిపోయినాయి.)

ఈ విషయాలన్నీ గుర్తు చేసుకుంటూ, యిరుగు పొరుగుల పడిపోయిన యిళ్లు విరిగి పడిపోయిన చెట్లు మొదలైన వాటిని ఆమె చూస్తూవుండగా, గదిలోనుంచి కావ్ కావ్ మంటూ ధ్వని వినిపించింది. లోపలికి వెళ్లి చూసింది. వదిన గోమతికి ఆడపిల్ల పుట్టింది. (ఆ శిశువుకి చెయ్యవలసిన చికిత్సలు విశాలాక్షి చేస్తూవుండగా, గోమతికి మరణకాలం సమీపించింది. ఆ తుదిఘడియల్లో, 'విశాలాక్షి! విశాలాక్షి! నేనింకా రెండునిమిషాల కంటె ఎక్కువ బ్రతకను. నా ప్రాణం పొయ్యేముందు నీకు రెండుముక్కలు చెప్పి పోతాను. అది నువ్వు నీ బొందిలో ప్రాణం వున్నంతవరకూ మరిచిపోవద్దు. మొదటిది : నువ్వు పెళ్లి చేసుకో. విధవా వివాహం చెయ్యదగిందే. స్త్రీ పురుషులు ఒక్కమోస్తరుగానే యముడికి లోబడివున్నారు. అందువల్ల పురుషులకు స్త్రీలు బానిసలుగా, పురుషులకు స్త్రీలు భయపడి ప్రాణమున్నంత వరకూ అఘోరించి మరణించవలసిన అవసరం లేదు. కనక పురుషులు వ్రాసిన నీచమైన స్వార్థపూరిత శాస్త్రాన్ని చింపేసి, పొయ్యిలో పడేసి, ధైర్యంగా చెన్నపట్టణానికి వెళ్లి, అక్కడ విధవావివాహాలకు సహాయం చేసే సంఘం వారిని కనుక్కుని, వాళ్ల ద్వారా మంచి భర్తను పొంది జీవించు. రెండోది: నువ్వున్నంతవరకూ నా పిల్లను కాపాడు. దానికి చంద్రిక అని పేరుపెట్టు' అని చెప్పింది.

(విశాలాక్షి 'సరే' అంది. గోమతి ప్రాణం పరలోకం చేరుకుంది.)

[పెద్ద కథగా (నవలగా) దీన్ని వ్రాయాలని భారతి అనుకున్నాడు. కాని ఉద్దేశం నెరవేరకమునుపే ఆయన కాలధర్మం చెందాడు. విశాలాక్షి కథ

చాలావరకు పూర్తిగా చెప్పబడింది. అందులోని మొదటి భాగాన్ని మాత్రం చేర్చడమైనది.]

## వేదకాలపు ఋషుల కవిత

(పీఠిక మాత్రం చేర్చబడింది)

కాశిలో హిందూ విశ్వవిద్యాలయ సంఘానికి శంకుస్థాపన చేసిన సందర్భంలో, చాలామంది విద్వాంసులు ఉపన్యసించారు. వాటిలో, విజ్ఞాన శాస్త్రవేత్తలలో తలమానిక మనదగిన శ్రీ జగదీశచంద్ర వసు (బోస్) యిచ్చిన ఉపన్యాసం ముఖ్యంగా పేర్కొనదగింది.

'లౌకికశాస్త్ర పరిశోధనలలో మళ్లీ భారతదేశం అగ్రస్థానం వహించేటట్లు చెయ్యడం మన కర్తవ్యం' అనే విషయాన్ని ఆయన బహువిధాలుగా వివరించిన తర్వాత, ఉపసంహారంగా ఇలా పేర్కొన్నారు:

'హైందవ నాగరకతలో ఒక విశిష్ట శక్తి ఉన్నది. కాలానికి కలిగే పతన స్థితినీ, లోకంలోని వస్తువులన్నిటినీ ఛిన్నాభిన్నం చేసే మార్పులనూ ఈ శక్తివల్ల మన నాగరకత ఎదుర్కొ కలిగింది. (ఈజిప్టు దేశంలో) నైలునదీ తీరానవున్న అస్సీరియా, బాబిలోనియా దేశాలలోను ఎన్నోవేల సంవత్స రాలకు మునుపు గొప్ప గొప్ప విజ్ఞాన పరిశోధనలు జరగడాన్ని, అవి మార్పు లకు లోను కావడాన్ని, తుదకు మరుగున పడిపోవడాన్ని మన మహత్తరమైన నాగరకత చూస్తూనే వున్నది. (ఆరోజుల్లో కూడా మన నాగరకత అత్యంత ప్రాచీనమైనది.) ఆనాళ్లలో భారతమాత తనకు నాశనం లేదనే భావంతో ఉండేది. నేటికీ యౌవనం తగ్గలేదు. ఇక భవిష్యత్తులో కూడా నాశనం లేదన్న భావంతోనే స్థిరంగా నిలిచివుంది.'

ఇలా, నవీన శాస్త్రవిద్యా శైలము మీద అగ్నిస్తంభం వలె ప్రతిభాసిస్తున్న శ్రీ వసు (బోస్) చెప్పిన మాటలు కేవలం ఉపచారవాక్యాలు కావు. మన మధ్యకాలపు అవివేకాలను మహిమలుగా భావించి, వట్టిగొప్పలు చెప్పుకునే వారి మాటలను మనం త్రోసిరాజనడం సముచితం. వసు పండితుడు

పేర్కొన్న విషయాలను మనం ఆదరపూర్వకంగా గ్రహించడం సమంజసం. మధ్యకాలంలో మన జాతి అబద్ధాలూ నిస్పృహలూ అనే చెత్తగుట్ట కింద అణగారి పోయింది. భారతమాత నిద్రలో ఉంది. ఇప్పుడు, మళ్లీ ఆ చెత్త లోంచి బయటపడి, ధైర్యమనే గంగానదిలో స్నానం చేసి, మన భారతజాతి తన గగనవీధిని అవుతున్న సూర్యోదయాన్ని ప్రేమపురస్సరంగా ఆహ్వానించి జేజేలు చెపుతున్నది.

మరణం లేని ఈ హైందవ నాగరకత అనే కల్పవృక్షమునకు మొదట్లో విత్తనం నాటినవారు వేదకాలపు ఋషులు. వారు ఎప్పుడు — ఎన్ని శతాబ్దులకు పూర్వం — జీవించారో లెక్క కట్టి చెప్పడానికి ఆధునిక పరిశోధనకు అందని అంశంగా ఉన్నది. హిమవత్పర్వతం ఎప్పుడు ఏర్పడింది ? ఎవరికి తెలుసు ? వేదకాలపు ఋషులు ఎప్పుడు జీవించారు ? ఎలా చెప్పడం ?

శ్రీ రామకృష్ణ పరమహంస చెపుతున్నారు :—

'మీరు ప్రార్థన చేసేటప్పుడు, అది మనస్సు కిందిభాగం నుంచి రావాలి. తర్వాత కొంతకాలం వేచివుంటే, నాతల్లి జగదంబిక మీ ప్రార్థనను నెరవేరుస్తుంది.'

చక్కగా సెలవిచ్చారు రామకృష్ణ ముని. మనస్సు కింది భాగంనుంచి బహిర్గతమవుతున్న ప్రార్థనకు 'మంత్రం' అని పేరు. అది ఫలిస్తుంది. కాని అక్కడినుంచి ప్రార్థన వెలికిరావడం సులభం కాదు. అది చాలా లోతయినది. సముద్రపు లోతుని మానవులు కనుక్కున్నారు. మనస్సు కిందిభాగాన్ని కనుక్కోవడం దానికంటె ఎన్నోరెట్లు కష్టం. అయినప్పటికీ, నిస్పృహ చెందవద్దు. ప్రతివ్యక్తీ మనో జలధిలో వీలయినంత వరకూ మునిగి అక్కడున్న వస్తువుల్ని తీసుకు రావచ్చు. ఎంత కెంత లోతుగా వెళ్లగలిగితే అంత కంతకు మంచి ముత్యాలు దొరకగలవు.

ఋషులు మనోనైర్మల్యం సాధించినవారు. అందువల్ల, కిందిదాకా సులభంగా వెళ్లి, అక్కడినుంచి మంత్రములు తీసుకువచ్చారు. ఆ మంత్ర ములకు దేవతలు స్వాధీను లవుతారు. వట్టి 'మాట' కు శక్తిలేదు. ఆమాట మనశ్శక్తిని గ్రహించినట్లయితే, అప్పుడు దానికి మహిమ కలుగుతుంది. దేన్ని అనుకుంటావో అదే అవుతావు — అన్నది తప్పని సత్యం. భావం నిజమైన భావమై ఉండాలి. లోతైన భావం, చలించని భావం, శక్తివంతమైన

భావం, మారని భావం — ఇటువంటి భావం అచిరకాలంలో లోకం గ్రహించదగిన బాహ్య సత్యంగా మారుతుంది. 'ఇంద్రుడు' అనబడే విజ్ఞాన శక్తిని మధుచ్ఛందర్షి పైన చెప్పినట్లుగా శక్తివంతములైన మంత్రములతో స్థాపన చేశాడు. ఆ మంత్రములు కవితలుగా భాసిస్తున్నవి.

ఋగ్వేదంలోని ఋషుల కవితలను చదివేటప్పుడు, మన మనస్సులో తేనె స్రవిస్తుంది; జ్ఞానం దైవ మయమవుతుంది.

# త్రాసు *

గత వారం చెన్నపట్టణంలో కందసామి గుడిలో వసంతమండపంలో సాధు మహా సంఘం వారి ఆధ్వర్యాన ఒక సమావేశం జరిగింది. అందులో స్వామి అద్భుతానందులు అనే ఆయన ఒక మంచి ఉపన్యాసం ఇచ్చినట్లు తెలియవస్తున్నది.

ఆయన ఉపన్యాస సారాంశం: 'మత విషయాలలో మన పూర్వులు అతి ప్రశస్తములైన పరిశోధనలు చేశారు. వీటిని మనం చక్కగా అవగాహన చేసుకుని ప్రపంచానికి ఉపదేశించాలి. ఈ విషయంలో అమెరికా, ఐరోపా మొదలైన పాశ్చాత్య దేశాలవారు మన సహాయం కోసం ఎదురు చూస్తున్నారు.'

ఇక, 'మత విషయాలు' అనేవి పారమార్థిక సత్యములు. అనగా, పంచేంద్రియములకు అందనివి; విశుద్ధమైన జ్ఞానం ద్వారా అవగతమయ్యే దైవిక సత్యములు. ఇవి జ్ఞానం, భక్తి, యోగం అనే మార్గాల ద్వారా సుగమములవుతాయి. వీటిని మన పూర్వులు ఎంతో శ్రమించి, గ్రహించి తమ గ్రంథాలలో నిక్షిప్తం చేశారు. ఈ సంపదను మనం శక్తితో వశం చేసుకుని, ప్రపంచానికి పంచిపెట్టి, ఈ ఐహిక దుఃఖాలను, అవివేకాలను, అల్పత్వములను తొలగించి సంస్కరించాలి.

---

* ఇది యీ వ్యాసంలోని ఒక భాగం.

'తనదు చదువు లోకమునకు రక్తి నొసగ,
పడయు సంతసమ్ము పండితుండు.'

అని తిరువళ్ళువర్ చెప్పినట్లుగా, స్వామి అద్భుతానందులవారి అభిమతం కూడా అదే. కాని మన అభిలాషను ఇంతటితోనే ముగించకూడదు. లౌకిక విషయాలలో కూడా మన సహాయాన్ని లోకం ఎదురు చూస్తున్నది. దీన్ని మనం విస్మరించ కూడదు. మన పూర్వులు పారమార్థిక విషయాలలో మాత్రమే ప్రజ్ఞ గడించినట్లు మనం భావించ కూడదు. ఐహిక జ్ఞానంలోను ఆశ్చర్యకరమైన ప్రగతిని గడించారు. పెక్కు దేశాలతోను, వాటి బహు శాస్త్రాలతోను పరిచయం గల నా మిత్రులొకరు ఐరోపాలో పేరు పెంపులు గడించిన గ్రీకు (యవన) శిల్పం కన్నా మన దేశంలోని ప్రాచీన శిల్పకళ ప్రశస్తమయిందని భావిస్తున్నారు. దీన్ని పాశ్చాత్య దేశాలకు తెలియ జేయాలన్న ఉద్దేశంతో శ్రీ ఆనంద కుమారస్వామి మొదలైన విద్వాంసులు బహుధా కృషి చేస్తున్నారు. కాని ఈ విషయాన్ని మన తమిళ దేశంలో నివసించే వారికి వివరించే వారు ఎవ్వరూ కనిపించడం లేదు. ఎన్నో దేశాల సంగీత విధానాలను నేను ఒక మోస్తరుగా తులనాత్మకంగా పరిశీలించాను. మన ప్రాచీన సంగీతానికి సరితూగేది ఈ ప్రపంచంలో ఎక్కడా లేదని నా నిశ్చితాభిప్రాయం. కవిత్వం విషయంలోనూ ఇంతే.

ఇక గణితం, రసాయనం మొదలైన విభిన్న శాస్త్రాలు కూడా మన దేశంలోనే మొట్ట మొదట అభివృద్ధి చెందాయి.

మనం లౌకిక విజ్ఞానంలోనూ ప్రగతిని సాధించాలి. తెలియని శాస్త్రముల ప్రాథమిక విషయాలను మనం ఇతరుల వద్ద నేర్చుకోవాలి. తర్వాత వాటిలోనూ మన పట్టుదలతోనూ, బుద్ధిసూక్ష్మతతోనూ అభివృద్ధి సాధించి, వాటినీ మళ్లీ యితరులకు తెలియజెయ్యాలి. లౌకిక జ్ఞానంలో మనం అగ్ర స్థానం వహించాలి. అందుకు మనమే అర్హులం.

* * *

బొంబాయిలో జరగనున్న కాంగ్రెసు మహాసభలకు పలుప్రాంతాల నుంచి ప్రతినిధులు వస్తున్నట్లు, వారిలో స్త్రీలు కూడా ఉండవచ్చుననీ అనుకుం టున్నారు. పురుష ప్రతినిధులకు కావలసిన సౌకర్యాలు కల్పించేందుకుగాను స్వచ్ఛంద సేవకులుగా పురుషులు ముందుకు వచ్చినట్లుగా, స్త్రీ ప్రతినిధులకు

కావలసిన వసతులు కల్పించేందుకు స్వచ్ఛంద సేవికలు కూడా ముందుకు వచ్చినట్లుగా తెలియ వచ్చింది. ఈ (వింత) నవ్యత మన దేశానికి మహత్తర మైన ప్రయోజనానికి దారి తియ్యవచ్చునని నా అభిప్రాయం.

అరెరె! చిల్లర విషయాలు మరచిపోయాంకదా! యువాన్‌షి - కాయ్ - చైనా అధ్యక్షుడు - కాయగా ఉన్నవాడు పండబారుతున్నాడు. పూర్వ రాజ వంశాన్ని నిర్మూలించేందుకు భగీరథ ప్రయత్నాలు చేసి, చైనావారు ప్రజా స్వామ్యం నెలకొల్పారు. యూవాన్ - షి - కాయ్ వైపు సైనిక బలం ఉన్నందువల్ల ఆ ప్రజాస్వామ్యానికి అయన నాయకత్వం వహించగలిగాడు. రోజులు గడవను గడవను, అచిరకాలంలోనే, యువాన్ మనస్సులో ప్రజాస్వామ్యం కంటె ప్రభు స్వామ్యమే చైనాకి తగినదనే భావం ఉదయించింది. ప్రపంచమంతా ఆయనే రాజవుతాడని అనుకుంది. ఇప్పుడు పాత యువరాజుకి ఆయన తన కుమార్తె నిచ్చి పెళ్లి చేస్తాడనే వదంతులు వినవస్తున్నవి. కాగా, చైనాలోని ప్రజాస్వామ్యం ఇంకెంత కాలం ఉంటుందో చూసి చెప్పమని మన దేశంలోని జ్యోతిష్కుల్ని అర్థిస్తున్నాను. దాని తాలూకు జాతక వివరాలు చెప్పమన్నా చెపుతాను.

చైనా ప్రజాస్వామ్యానికి ఉచ్ఛస్థానంలో రాహువు ఉన్నాడు. రెండవ స్థానంలో శని. శని నీచుడని అందరికీ తెలిసిందే. మిగిలిన గ్రహాలన్నీ వక్రములే. నేనే ఫలితం చెప్పవచ్చు. కాని నాకు జ్యోతిశ్శాస్త్రంలో ఓనమాలు కూడా తెలియవు.

* * *

చెయ్యూరు నుంచి శ్రీ మాధవయ్య ఒక వృద్ధుని వివాహ సందర్భంగా వ్రాసిన లేఖ కొన్నాళ్లకుముందు స్వదేశమిత్రన్ పత్రికలో ప్రచురించబడింది.

వృద్ధుని వయస్సు 70; ఆయన తల్లి యింకా బ్రతికి వున్నది. ఆమె వయస్సు 98. ఆ అవ్వగారికీ తనకూ సపర్యలు చేసేందుకుగాను ఆ వృద్ధుడు ఒక పదహారేళ్ల పడుచుని పెళ్లి చేసుకోబోతున్నాడు. ఈ వృద్ధుని వద్దకు ఆమెది కాక యింకా ఇరవై ఒక్క మంది ఆడపిల్లల జాతకాలు వచ్చినట్లుగా తెలుస్తున్నది. చివరికి ఏదో ఒక విధంగా మనసు కుదుర్చుకున్న పిల్ల తండ్రి డబ్బునీ, విధినీ, జ్యోతిషాన్ని నమ్మి యిందులోకి దిగాడట. భగవంతుణ్ణి నమ్మినటు తెలియలేదు. ఒంటెకి ఒక చోటా వంకర? తమిళ దేశానికి యిదొకటేనా దురవస్థ?

కావలసిన వసతులు కల్పించేందుకు స్వచ్ఛంద సేవికలు కూడా ముందుకు వచ్చినట్లుగా తెలియ వచ్చింది. ఈ (వింత) నవ్యత మన దేశానికి మహత్తర మైన ప్రయోజనానికి దారి తియ్యవచ్చునని నా అభిప్రాయం.

అరెరె! చిల్లర విషయాలు మరచిపోయాంకదా! యువాన్‌షి - కాయ్ - చైనా అధ్యక్షుడు - కాయగా ఉన్నవాడు పండబారుతున్నాడు. పూర్వ రాజ వంశాన్ని నిర్మూలించేందుకు భగీరథ ప్రయత్నాలు చేసి, చైనావారు ప్రజా స్వామ్యం నెలకొల్పారు. యూవాన్ - షి - కాయ్ వైపు సైనిక బలం ఉన్నందువల్ల ఆ ప్రజాస్వామ్యానికి ఆయన నాయకత్వం వహించగలిగాడు. రోజులు గడవను గడవను, అచిరకాలంలోనే, యువాన్ మనస్సులో ప్రజాస్వామ్యం కంటె ప్రభు స్వామ్యమే చైనాకి తగినదనే భావం ఉదయిం చింది. ప్రపంచమంతా ఆయనే రాజవుతాడని అనుకుంది. ఇప్పుడు పాత యువరాజుకి ఆయన తన కుమార్తె నిచ్చి పెళ్లి చేస్తాడనే వదంతులు వినవస్తున్నవి. కాగా, చైనాలోని ప్రజాస్వామ్యం ఇంకెంత కాలం ఉంటుందో చూసి చెప్పమని మన దేశంలోని జ్యోతిష్కుల్ని అర్థిస్తున్నాను. దాని తాలూకు జాతక వివరాలు చెప్పమన్నా చెపుతాను.

చైనా ప్రజాస్వామ్యానికి ఉచ్చస్థానంలో రాహువు ఉన్నాడు. రెండవ స్థానంలో శని. శని నీచుడని అందరికీ తెలిసిందే. మిగిలిన గ్రహాలన్నీ వక్రములే. నేనే ఫలితం చెప్పవచ్చు. కాని నాకు జ్యోతిశ్శాస్త్రంలో ఓనమాలు కూడా తెలియవు.

* * *

చెయ్యూరు నుంచి శ్రీ మాధవయ్య ఒక వృద్ధుని వివాహ సందర్భంగా వ్రాసిన లేఖ కొన్నాళ్లకుముందు స్వదేశమిత్రన్ పత్రికలో ప్రచురించబడింది.

వృద్ధుని వయస్సు 70; ఆయన తల్లి యింకా బ్రతికి వున్నది. ఆమె వయస్సు 98. ఆ అవ్వగారికీ తనకూ సపర్యలు చేసేందుకుగాను ఆ వృద్ధుడు ఒక పదహారేళ్ల పడుచుని పెళ్లి చేసుకోబోతున్నాడు. ఈ వృద్ధుని వద్దకు ఆమెది కాక యింకా ఇరవై ఒక్క మంది ఆడపిల్లల జాతకాలు వచ్చి నట్లుగా తెలుస్తున్నది. చివరికి ఏదో ఒక విధంగా మనసు కుదుర్చుకున్న పిల్ల తండ్రి డబ్బునీ, విధినీ, జ్యోతిషాన్ని నమ్మి యిందులోకి దిగాడట. భగవంతుణ్ణి నమ్మినటు తెలియలేదు. ఒంటెకి ఒక చోటా వంకర? తమిళ దేశానికి యిదొకటేనా దురవస్థ?